# ఇది త్యాగం కాదు

ముద్దంశెట్టి హనుమంతరావు

నవజ్యోతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ విజయవాడ 2

# ఇది త్యాగం కాదు!

శంకర్రావు, హాల్లో కూచుని ఇండియన్ ఎక్స్‌ప్రెస్ చదువు తున్నాడు. ఆయన రిటైరయిన దగ్గర్నించీ మరే యితర వ్యాసంగం లేకపోవడం వల్ల, యేదో ఒకటి చదువు కుంటూ కూచోవడం అలవాటైపోయింది. ముఖ్యంగా వార్తా పత్రిక మొదట్నుంచీ, ఆఖరి అక్షరం వరకూ చదువుతాడు. అలా చదివితేనేగాని, అతనికి తృప్తిగా వుండదు. ఆఖరు పేజీ ఆఖరు కాలం చదువుతూ వుంటే, బ్యాండు వాయిద్యాలు వినవచ్చాయి. వీధికేసి అతని దృష్టి మళ్ళింది. పెళ్ళి వూరేగింపది. పెట్రోమాక్స్ దీపాల కాంతిలో యెంతో శోభాయమానంగా వుంది. రకరకాల పూలతో అలంకరింపబడిన కారులో ధీమాగా, ధీరుడులా కూచుని వున్నాడు వరుడు. క్రమంగా ఆ వూరేగింపు దూరమయింది. అయినా, శంకర్రావు కనుపాపల్లో యింకా ఆ దృశ్యం అదృశ్యం కాలేదు. అతని మెదడులో యేవేవో తలపులు, మెలికల్లా తిరిగిగాయి.

వార్తాపత్రిక ఆఖరికాలం పూర్తి చెయ్యకుండానే, టేబిలు మీద పడేశాడు.

"అమ్మాయ్, అరుణా!" మెల్లగా కేక వేశాడు. గదిలో కారమ్స్ ఆడుకుంటున్న అరుణ, చెల్లెలితో చెప్పి వచ్చింది.

"ఏం నాన్నా?"

"ఏం చేస్తున్నావమ్మా?"

"చెల్లీ, నేనూ కారమ్స్ ఆడుకుంటున్నాం నాన్నా !"

"అలాగా! కూచో. నీతో కాస్త మాట్లాడాలమ్మా!" అరుణ అతనికి అభిముఖంగా కూచుంది.

"చెప్పండి నాన్నా!"

"మీ అమ్మ పోయి యెక్కువ రోజులు కాకపోయినా, ఆమెను క్రమంగా మనం మర్చిపోయాం. అయితే, ఒక్కటి మాత్రం మనం గుర్తుంచుకోవాలి. మీ అమ్మే సజీవంగా వుంటే, మీ వివాహ విషయంలో నాలా పట్టించుకోకుండా వుండేదా? అబ్బే! నా చెవుల్లో యిల్లు కట్టుకొని క్షణ క్షణానికీ గుర్తు చేస్తుండేదేమో! ఇదేనమ్మా, తల్లికి, తండ్రికీ గల తారతమ్యం. ఈ బాధ్యతలన్నీ నా నెత్తిన పడేసి, ఆమె నిశ్చింతగా వెళ్ళిపోయింది. అప్పుడప్పుడూ నాకనిపిస్తుంది–నా కర్తవ్యాన్ని నేను నిర్వహించడం లేదేమో నని! ఈ వయస్సులో నాకు మాత్రం యింకేం కావాలమ్మా? కొడుకులు లేక పోయినా, వున్న మీ యిరువురూ పెళ్ళిళ్ళు చేసుకొని సుఖంగా సంసారాలు చేసుకోవడమే నాకు కావల్సిందమ్మా! అప్పుడే నా

జీవితానికి సార్థకత ఏర్పడుతుంది; మీ అమ్మ నామీద వదలి పెట్టి పోయిన బాధ్యత నెఱవేరినట్టూ అవుతుంది. ఎన్నోసార్లు యీ విషయంలో నీతో ప్రస్తావించాను. కాని, ఏవో సాకులు చెబుతూనే వస్తున్నావు. చదువుకున్న దానవు. నువ్వే కాస్త ఆలోచించమ్మా నా పరిస్థితి; అసలే గుండె జబ్బువాణ్ని... యెప్పుడెలా వుంటానో..." అని యింకా చెప్పబోతూవుంటే అరుణ అడ్డు వచ్చిందా మాటలకు.

"ఛా! అవేం మాటలు నాన్నా! మీరన్నట్టే జరుగుతుంది. కొన్నాళ్లుగా నన్ను ఆలోచించుకోనీయండి" అంది కాస్త తడబడుతూ.

"ఇంకా యెన్నాళ్ళమ్మా ఈ ఆలోచన? అసలు, నీ మనసులో వున్న మాట కూడా చెప్పవు. నా దగ్గర నీకెందుకమ్మా సందేహం! ఏవిటో చెప్పు!"

"అబ్బే! ఏమీలేదు నాన్నా! ఈ ఒక్కసారి అవకాశమివ్వండి."

"సరేనమ్మా! నీ యిష్టం. నీ వివాహం మొదట నిశ్చయమైతేనే, శారద వివాహపు ప్రయత్నం జరుగుతుంది. లేకుంటే, నలుగురూ నాలుగు ప్రశ్నలు వేస్తారు. నిజానికి, నువ్వు వుద్యోగం చెయ్యడం కూడా నాకు యిష్టంలేదు. మనకి జీవనాధారం ఏమీ లేదుగనుకనా? ఏవిటో యెంత చెప్పినా నువ్వు విన్పించుకోవడంలేదు." విసుగ్గా అన్నాడు శంకర్రావు. అప్పట్లో ఉద్యోగం చేస్తానని కూతురు అడిగితే, ఉపాధ్యాయినిగా వుండటంలో అంత యిబ్బందేమీ వుండదను

కొని "ఊఁ" కొట్టానుగాని, అదే యిప్పు డీ వివాహ నిరాకరణకు దోహదమవుతుం దని అప్పట్లో వూహించ లేక పోయాడు...ఇది అతని అంతర్గతా వేదన.

"నా ఉద్యోగానికీ, పెళ్ళికీ సంబంధం ఏమాత్రం లేదు నాన్నా! ఈ విషయంలో అనవసరంగా మీరు అపోహ పడకండి. వివాహం చేసుకునే నిర్ణయం నాలో రావాలేగాని, ఉద్యోగం విడిచిపెట్టడం యెంత సేపు చెప్పండి?" తాత్కాలికంగా తండ్రి మనసుకి ఆరాటం తగ్గించాలనే ఉద్దేశంతో అంది.

"సరేనమ్మా! ఇంతకంటె నేను చెప్పాల్సిందేమీ లేదు. ఆలోచించుకునే శక్తి నీకుంది. నిర్ణయభారాన్ని నీ మీదే విడిచిపెడుతున్నాను. వెళ్ళు" నిస్పృహతో అన్నాడు శంకర్రావు.

అరుణ, మారుమాటాడకుండా అక్కణ్నించి వచ్చేసింది. శంకర్రావు ఒక్క నిట్టూర్పు విడిచి, కుర్చీలో వెనక్కి చేరగిలబడ్డాడు. అతని చెవుల్లో యింకా బ్యాండు వాయిద్యాలు గింగురు పెడుతూనే వున్నాయి. తను జీవించివుండగా కూతుళ్ళకి వివాహం చేసి, తన బాధ్యత తీర్చుకోగలడా?... యిదే శంకర్రావు ఆరాటం.

తల్లిదండ్రులకు, ఆడపిల్లల వివాహం ఒక పెట్టనిబరువు. ఆ బరువు బాధ్యత దించుకుంటేనే గాని వాళ్ళకితృప్తివుండదు. మనశ్శాంతి అంతకంటె వుండదు. ఇక తల్లి లేని పిల్లలయితే, ఆ

బాధ్యతంతా ఒక్కుమ్మడిగా తండ్రి నెత్తిన పడుతుంది. ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. అదే అవస్థలో సతమతమై పోతు న్నాడు, పాపం, శంకర్రావు.

*          *          *

అరుణ గదిలో అడుగు పెట్టేసరికి శారద ఒక్కర్తే లక్ష్యమంటూ యేమీ లేకుండానే స్ప్రింగ్ బెడ్ ఆమెని పిక్కల్ని కొడుతూకూచుంది. అక్క రావడంతో ఆమెలో మొలకెత్తిన విసుగు అంతమయ్యింది.

"ఎందుకు పిల్చారక్కా నాన్న?" ప్రశ్నించింది శారద.

"అబ్బే! ఏంలేదులే!" విషయాన్ని చెల్లెలితో చెప్పడం యిష్టంలేకపోయింది అరుణకి.

"చెప్పు అక్కా రహస్యమేంకాదుగా! నేనువినకూడని విషయమా?" చిన్న బుచ్చుకుంటూ అడిగింది శారద.

దాపరికం, యింక లాభం లేదనుకుంది అరుణ. చెప్పక పోతే,ఏదో తనకిసంబంధించిన విషయమై వుండొచ్చునుకొని చెల్లాయి బాధపడుతుందేమో! అందుకే చెప్పడం యిష్టం లేక పోయినా, తప్పిందికాదు.

"అబ్బ! నీతో గొప్ప చిక్కే! అన్ని విషయాలూ తెలుసుకోవా లనే తాపత్రయ మెందుకో అర్థంకాదు. ఇంకేంకాదు— మన వివాహవిషయం ప్రస్తావించారు నాన్న. మనిద్దరికీ పెళ్ళిళ్ళు చేసి, ఆయన కర్తవ్యాన్ని నిర్వర్తించు కోవాలనుకుంటున్నా రట..."

"ఓ! అంతేనా ? మరి, నువ్వేమన్నా వక్కా!" ఆస క్తితో అడిగింది శారద.

"ఏమంటాను? ప్రస్తుతానికి నానిశ్చయాన్ని చెప్పలేను"

"ఏం? ఎందుకు చెప్పలేవు? పెళ్ళి చేసుకోవా అసలు?" చిలిపిగా చూస్తూ అంది శారద.

"అలాగని నేను చెప్పానా?"

"వేరే నువ్వు చెప్పాలా యేమిటి? ప్రస్తుతానికి నువ్వు యే నిశ్చయానికీ రాలేదంటే, పెళ్ళి చేసుకునే అభిప్రాయమైనా లేకపోవచ్చు- లేదా, యేదో రహస్యమైనా వుండి వుండొచ్చు" చనువుగా అంది.

అరుణ మొహంలో రంగుమారింది. చెల్లాయి, అంత నిష్కర్షగా అనేస్తుందని ఆమె యెప్పుడూ అనుకోలేదు.

"రహస్యమేముంటుందే, నీ మొహం! తెలివితక్కువగా మాట్లాడకు... లే!" అంటూ అక్కణ్ణించి లేచిపోయింది.

"గేమ్ పూర్తి కాకుండా లేచిపోతున్నా వేమక్కా? పోనిలే—యీ ప్రశ్న లేపి వెయ్యను... ఆడదాంరా!" అంది గోముగా, శారద. ఆమె వూహించ గలిగింది, అక్కకు కోప మొచ్చిందని!

"మరిప్పుడొద్దు చెల్లీ! రేపు ఆడుకుందాములే! ఏమిటో తలనొప్పిగా వుంది" అంటూ వెళ్ళి, మంచంమీద కూలబడింది.

కొద్దిసేపటి క్రితం లేని తలనొప్పి, యిప్పుడే యెందుకొచ్చిందో, శారదకి అవగాహన కాలేదు. ఈ మార్పుకి ఏదో మూలకారణం వుండి వుంటుందని భావించింది. బోర్డు యెత్తి పెట్టేసి, తనూ వచ్చి అక్క సరసనే కూచుంది.

నిజం చెప్పక్కా! తలనొప్పికాదు— నీ మనసులో అంతర్గతంగా ఏదో ఆవేదన రగులుతోంది. అదేమిటో నాతో చెప్పవూ?" అంది సౌమ్యంగా.

తనకంటె వయసులో చిన్నదే అయినా, చెల్లెలు అలా అడుగుతూ వుంటే, అరుణహృదయం ద్రవించిపోయింది. తన ఆవేదన చెప్పుకోగలిగిన వ్యక్తి, చెల్లెలు తప్పించి యిప్పుడింకెవరున్నారు? ఆ విధంగానైనా తన హృదయభారం కొంత తగ్గుతుందేమో ననిపించింది. అంతేకాదు— వివాహానికి తన విముఖత యెందుకో, కనీసం చెల్లాయి అయినా తెలుసుకుంటుందనుకొని, గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది.

క్షణం, గదినిండా నిశ్శబ్దం ఆవరించింది. ట్యూబులైట్ల కాంతి వెన్నెల్లా అలముకుంది. కిటికీలోంచి పిల్లవాయువులు పుష్పపరిమళాన్ని మోసుకొస్తున్నాయి. అయినా, ఆ వాతావరణం అక్కడి వ్యక్తులకు ఆనందాన్ని పంచిపెట్టలేదు. అసలు వాళ్ళు దాన్ని పట్టించుకోనే లేదు.

శారదా! మనం ఒకే రక్తం పంచుకున్న వాళ్ళం. మనలో రహస్యాలేమిటి? అయితే, ఒక రహస్యం మాత్రం యిన్నాళ్ళూ నాలో దాచుకున్నాను. నువ్వూహించింది నిజమే! ఆ రహస్యమే నా వివాహానికి నేను కనబరుస్తున్న విముఖతకి హేతువయింది. అయితే, భవిష్యత్తులో ఏమేమో ఆశించికాదు— నేను విముఖత చూపడం! ఇది కేవలం విరక్తితో కూడిన విముఖత. కాని... కాని...యీ నిజాన్ని నాన్నతో యెలా చెప్పడం? అదే నా బాధమ్మా!" చివరి వాక్యాల్లో అరుణ గొంతు గాద్గదిక మయింది.

తనూహించినట్టుగానే ఏదో రహస్యం వున్నందుకు శారద విస్తుపోయింది. అక్కపట్ల యెంతో జాలికలిగింది. ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగింది "ఇంతకీ విషయం ఏమిటక్కా?"

"ఈ రహస్యం నీ దగ్గర రహస్యంగానే వుంటుందని మాటివ్వు."

"అది వేరే చెప్పాలా అక్కా? ఆపాటి ప్రపంచ జ్ఞానం నాకు లేదనుకుంటున్నావా? ఆ సందేహం నీ కొద్దు."

మళ్ళీ గట్టిగా నిశ్వాసం వదిలింది అరుణ.

"ఇది రెండేళ్ళ క్రితం జరిగిన విషయం చెల్లీ! నేను బి. ఏ., ఫైనలియర్ చదువుతున్న రోజుల్లోనే అతనితో నాకు పరిచయం ఏర్పడింది. ఆ సంవత్సరమే అతను ఆనర్స్ పూర్తి చేస్తాడు. మా పరిచయం ప్రేమగా మారి అనతికాలం లోనే అనురాగ బీజాల్ని నాటుకుంది. మా యిరువురి అన్యోన్యత యెంతో మందికి అసూయ కలిగించిందంటే, అందులో అతిశయోక్తి ఏమీ వుండదు. మేం యేవేవో కలలుగన్నాం. భవిష్యత్తుకి యెన్నో అంచలు వేశాం. ఊహాలోకాల్లో విహరించాం. పెద్దల ఆశీస్సుల నీడల్లో వివాహం చేసుకొని, హాయిగా, ఆదర్శదాంపత్యాన్ని సాగించాలనుకున్నాం. కాని... కాని... యివన్నీ చివరికి యెండ మావులవుతాయని యెవరికి తెలుసు? నా జీవితం యిలా మోడువోతుందని యెవరూహించారు? నాహృదయంలో చెరగని జ్ఞాపకాలే చివరికి మిగిలిపోతాయని యెవరనుకున్నారు? నిజంగా దేవుడికి కరుణ లేదు చెల్లాయ్..." అంటూ వాపోయింది.

"ఇంతకీ, అత నేమయ్యాడు?" ఆతృతగా అడిగింది శారద.

"ఏ మయ్యాడో నాకూ తెలీదు. పరీక్షలు పూర్త య్యాక, అతని జాడ మరి తెలీలేదు. నేనెంతో ప్రయత్నిం చాను తెలుసుకోవాలని... కాని, లాభం లేకపోయింది. నాకు జరిగిన యీ అన్యాయానికి, నేనెంత బాధపడ్డానో నాకే తెలుసు. నా లేత హృదయం వాడిపోయింది. ఆరోజు నుంచే నాకు పురుషులన్నా, పెళ్ళన్నా, ఒక విధమైన ద్వేష భావం కలిగింది. ఇప్పుడు నీకు అర్ధమయ్యుంటుం దనుకుంటాను చెల్లీ— నేనెందుకు వివాహానికి విముఖతగా వున్నానో."

శారద వేడి నిట్టూర్పు విడిచింది. అక్క నిర్ణయాన్ని తనూ హర్షించకుండా వుండలేకపోయింది. ఎన్నో ఆశల్ని పెంచుకున్న ప్రప్రథమ 'కల' చెదిరిపోతే, తట్టుకోవడం కష్టమే మరి!... అనుకుంది, తన కున్న కాస్తంత ప్రపం చానుభవాన్ని, పురస్కరించుకొని.

"ఆ ఆవేశంలో, ఆ ఆవేదనలో, అలా నిర్ణయించు కోవడం అసమంజసం యేమీకాదు. అయితే, జీవితాంతం యిలాగే బ్రహ్మచారిణిగా వుండిపోతావా?"

"అంతకంటె యింకేం చెయ్యగలను? వాడిపోయిన హృదయం మళ్ళీ చిగురించే అవకాశాలు లేనప్పుడు మరో మార్గం లేదు. ఈ జీవితం, యిలా గడిచిపోతే చాలనిపిస్తోంది" నిస్పృహతో అంది అరుణ.

అక్క హృదయం, బాగా గాయపడిందని భావించింది శారద.

"అంత నిస్పృహ యెందుకక్కా? కొన్ని సంఘటనలు జీర్ణించుకునే అలవాటు చేసుకోకపోతే, సుఖమయ జీవితాన్ని గడపడం కష్టమేమో!"

"చెప్పడానికి చాలా సులువు శారదా! కాని, యథార్థంగా అనువించినప్పుడుగాని, అందులోని చేదు రుచి తెలీదు. అయినా, నీకెందుకులే యిప్పుడివన్నీను. పద... భోజనం చేద్దాం..." అంటూ లేచింది అరుణ. ఇంక ఆ విషయాన్ని పొడిగించకూడదనే ఆమె అభిలాష.

శారద, యింకేమీ అనకుండా అక్కతోపాటు, వంట గదికేసి వెళ్ళిపోయింది.

## 2

శంకర్రావు వాలుకుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్నాడు. అప్పుడప్పుడు యేవో భావాలు చెలరేగి, ఆలోచనలో పడుతున్నాడు. కూతుళ్ళ వివాహ విషయమే అతణ్ణి బాగా కలవరపరుస్తూ, ప్రశాంతత లేకుండా చేస్తోంది. అరుణ మొదట అంగీకరిస్తేనే తప్పించి, శారద వివాహప్రసక్తి తీసుకురావడం, అతనికి యిష్టం లేకపోయింది. అరుణ తన మాట చప్పున అంగీకరించకుండా, కాలయాపన చెయ్యడానికే

వ్యవధి కోరుతున్నట్టు భావించాడు. ఈ మన స్తత్వం ఆమెను అబ్బడానికి ప్రథమ కారణం, ఆమె చదువేమో నన్పించిం దతనికి. ఇంతకంటె మరో కారణం అతనికి ఆగుపించ లేదు. ఆ చదువే లేకపోతే, తను చెప్పినట్టుగా విని వుండేదన్పిం చింది. పోనీ బలవంతంగా ఆమెను ఒప్పించడానికి ప్రయత్ని స్తేనో...? క్షణం యోచించాడు. అది అసభ్యంగా వుంటుం దనుకున్నాడు. ఇన్నాళ్ళూ తను కురిపిస్తూ వస్తున్న వాత్స ల్యపు జల్లులు, ఒక్కసారి విషపు జల్లులుగా మారిపోయే అవ కాశం వుందనుకుని, ఆ తలంపే మానుకున్నాడు.

అప్పుడే అరుణ, శారద లోపల్నించి వస్తున్నారు. రోజూ యిద్దరూ కలిసే వెళ్తారు. అరుణ స్కూలుకీ, శారద కాలేజీకి వెళ్ళిపోతారు. శారద ప్రస్తుతం పి. యు. సి. చదువు తోందని చెప్పుకోడం అప్రస్తుతం కాదు. ఆమెకి యెన్నో వూహాలున్నాయి. డాక్టరీ చదవాలని ఆమె అభిలాష. అందుకే, కష్టపడి చదువుతూ క్లాసులో ఒక అంతస్తు తెచ్చు కుంటోంది.

"వస్తాం నాన్నా" అన్నారిద్దరూనూ.

శంకర్రావు తలపులకు తలుపులు పడ్డాయి. "ఆగం డమ్మా!" అన్నాడు గంభీరంగా.

ఆశ్చర్యంగా తండ్రికేసి చూశారు, యిద్దరక్కా చెల్లె ళ్ళూను.

"ఏం నాన్నా?" అరుణ ప్రశ్నించింది.

శంకర్రావు లేచి నుంచున్నాడు.

"అమ్మాయ్ అరుణా! నువ్వు వుద్యోగం చేస్తున్నావు. ఎన్నో శ్రమలుపడి సంపాదించిన వుద్యోగమిది. అది వదులుకోమని చెప్పడం నా తెలివితక్కువ తనమే! చెప్పినా నువ్వు విన్పించుకోవని అనుభవ పూర్వకంగా తెలిసింది. ఒత్తిడి చెయ్యడం నాకిష్టంలేదు. అయితే, శారద విషయంలో మాత్రం యిప్పుడే జాగ్రత్త తీసుకోవాలి. దాన్నింకా పై చదువులు చదివించి నీలాంటి మన స్తత్వమే అలవడేట్టు చెయ్యడం, నాకిష్టంలేదు. అందుకే, యీ రోజునుంచీ దాని చదువుకి స్వస్తి చెప్పించాలని నిర్ణయించుకున్నాను" అన్నాడు గంభీరంగా.

అరుణ తెల్లబోయింది. అంతకంటె ఆశ్చర్యాందోళనలతో కలవరపడింది శారద. తండ్రిమాటలు, పిడుగుపాటుగా ఆమెను క్రుంగదీశాయి. నోట మాటరాక, పెదాలు వణుకుతున్నాయి.

"ఏవిటి నాన్నా మీరంటున్నది ?" అంది అరుణ విస్తుపోతూ.

"నేను పరిహాస మాడ్డం లేదమ్మా! అక్షరాలా నిజం చెప్తున్నాను. దూరంగా యోచించే, యీ నిర్ణయానికి వచ్చాను. మీ మంచి, మీకంటే నాకే బాగా తెలుసునమ్మా!"

"చెల్లాయి యెన్నో ఆశలు పెంచుకుంది నాన్నా! మెడిసిన్ చదవాలని ఉబలాట పడుతోంది. దాని ఆశలన్నీ అడియాసలు చేస్తారా?" బాధపడుతూ అంది అరుణ. ఆమెకి

తెలుసు_ చెల్లాయి యెంతగా వెదజెందుతుందో! అందుకే, ఆమె తరఫున వకాల్తా పుచ్చుకుని చెబుతోంది.

శంకర్రావు తేలిగ్గా నవ్వేడు.

"ఆశల్ని పెంచుకోవడమే మనవంతు అరుణా! వాటి రూపాల్ని యేర్పర్చడం మన చేతుల్లో లేదు. ఉదాహరణకి నా విషయమే తీసుకో! నేనూ యెన్నో ఆశలు పెట్టుకుని వున్నాను మీ విషయంలో... మీరు పెళ్ళిళ్ళు చేసుకుని, హాయిగా సంసారం చేసుకుంటూ నలుగురి మెప్పూ పొందు తారని! కాని, నా ఆశలు యేమవుతున్నాయో చూస్తున్నా వుగా! ఇంతకంటె వేరే తార్కాణం యింకేం కావాలి? అయినా, మెడిసిన్ చదివి, యెవర్ని ఉద్ధరించాలని_హాయిగా పెళ్ళి చేసుకుని, సంసార జీవితంతో తరించే వయస్సులో ఈ చదువులూ, వుద్యోగాలూ యెందుకో అర్థం కాదు." అంటూ చిన్నకూతురి వేపు తిరిగాడు.

"శారదా! నామాట విని చదువుకి స్వస్తిచెప్పమ్మా! ఎంత చదువుకున్నా, యేం చదువుకున్నా, స్త్రీ యెప్పటి కైనా వివాహం చేసుకోవల్సిందేగా! ఉద్యోగం చేసో లేక డాక్టరుగా ప్రాక్టీసు పెట్టో డబ్బు సంపాదించడమంటావా, ఆ అవసరం మనకేముంది చెప్పు? పూర్వీలు గడించి పెట్టిన ఆస్తికి తోడు, నేను గడించిందీ వుంది. ఇవన్నీ యెందుకాలో చించరు?" చెప్పుకుపోయాడు శంకర్రావు. అతని మస్తిష్కంలో ఒక నిర్ణయం జరిగింది గాబట్టి, దాన్ని పురస్కరించుకుని యేదో చెప్పుకుపోతున్నాడేగాని, ఝా యిరవయ్యో శతా

బంలో యిలా చెప్పడంలో అర్థముందో, లేదో, ఆలోచించ లేదు.

శారద యేం జవాబు చెప్తుంది? అప్పటికే ఆమె మనసు వికలమయ్యింది. పై పెచ్చు తండ్రి సమక్షంలో యెదురించి మాట్లాడే ధైర్యం కూడా లేదు. చెల్లెలి అసహాయతని అర్థం చేసుకుంది అరుణ.

"నాన్నా! మీరు దాన్ని చదువు మానేయమంటే, వేరే యేమైనా జవాబు చెప్పగలదా చెప్పండి? మీరేం చెబితే అదే చేస్తుంది. అయితే, మనమూ కాస్త ఆలోచించాలి కదా! మీరేవేవో మనస్సులో పెట్టుకుని, ముందాలోచనకు రూపకల్పన చేస్తూ, దాని మనసు కష్టపెట్టడం, యేమంత సమంజసంగా వుండదేమోనని తోస్తోంది. పోనీలెండి—మీ మాట మేమెందు క్కాదనాలి? మీ అభిమతానుసారమే చేస్తాం. అయితే ఒక్క అభ్యర్థన. ఈ ఒక్క సంవత్సరం దాని చదువు పూర్తికానివ్వండి. అప్పుడు అదీ చదువు మానేస్తుంది. దాంతోపాటు, నేనూ నా ఉద్యోగానికి తిలోదకాలిచ్చుకుంటాను. చెల్లెలి తరఫున నేనీ కోరిక కోరుతున్నందుకు మన్నించండి." అంది అరుణ.

శంకర్రావు క్షణం మౌనం వహించాడు. పెద్దమ్మాయి చెప్పింది బావున్నట్టనిపించింది. ఆమెను వుద్యోగం వదులుకోమని తను చెప్పలేకపోయినా, స్వయంగా ఆ నిర్ణయాన్ని, ఆమే తీసుకుంటున్నందుకు హర్షించాడు. ఇంక తను మొండిపట్టు పట్టుకూర్చోవడం, అన్యాయమనిపించింది. పరిస్థితులు క్రమంగా తనకి సానుకూలమౌతున్నందుకు మురిసి

పోయాడు. తన ఆశలు వమ్ముకావనుకున్నాడు. మెల్లగా ఓ నిశ్వాసం వదిలాడు.

"సరేనమ్మా! నువ్వు అంతగా చెప్తుంటే, కాదనే కఠిన హృదయుణ్ణికాదు నేను. వెళ్ళండి..." అంటూ వచ్చి కుర్చీలో కూలబడ్డాడు.

అరుణ, శారద ముందుకు సాగిపోయారు. వాళ్ళని చూసి, తృప్తిగా నవ్వుకున్నాడు శంకర్రావు. తనకి జీవితంలో మిగిలిపోయిన ఒక బాధ్యత, కూతుళ్ళ వివాహం. అదొక్కటీ జరిగిపోతే తన జన్మ సార్థకమైనట్టే!ఇంకేం కావాలి తనకి?... అనుకున్నాడు తృప్తిగా.

అప్పుడే వంటావిడ తాయారు వచ్చి, కాఫీ అందించింది.

"తాయారూ..." కాఫీ తీసుకుంటూనే అన్నాడు. శంకర్రావు.

"బాబూ!" సవినయంగా ఆసక్తితో చూసింది యజమాని కేసి.

"అమ్మాయిలు వివాహమంటే, యెందుకు విముఖత చూపుతున్నారో నాకు ఒక పట్టాన అర్థంకాకుండా వుంది." ఖాళీకప్పు అక్కడ పెట్టేస్తూ అన్నాడు.

"ఈకాలం పిల్లలే అంత బాబూ!వాళ్ళమనసుల్లో యేముంటుందో, యెవ్వరమూ చెప్పలేం. మీకే అర్థం గాకపోతే నేను మాత్రం యేం చెప్పగల్ను బాబూ!" తనూ తప్పించుకోవాలనుకునే అలా అనేసి కప్పు తీసుకుని వెళ్ళిపోయింది తాయారు.

శంకర్రావు నవ్వుకున్నాడు మెల్లగా, ఆమె మాటలికి.



రిక్షా, సుమారు స్పీడులో సాగిపోతోంది. శారద మెదడు, ఆ స్పీడుని మించి పనిచేస్తోంది. అరుణకూడా చెల్లెలి విషయమే యోచిస్తోంది.

"అయితే అక్కా, ఈ సంవత్సరంతో నేను చదువు చాలించేయాలంటావా?" నిరుత్సాహం వుట్టిపడుతూవుంటే, నీరసంగా అడిగింది శారద.

"నాన్న అభిమతమే అదయినప్పుడు, అంతకంటె ఏం చేయగలమమ్మా? అయినా ప్రస్తుతానికి యెలాగో సమస్య పరిష్కారమయిందిగా! తర్వాత విషయం ఆలోచిద్దాం. ఈ లోగా నాన్న మన సత్వాన్ని మార్చడానికి ప్రయత్నిద్దాం. తాత్కాలిక తామసంతో యేదో అనేశారేగాని, ఆయనకి మాత్రం మన మనస్సుల్ని కష్టపెట్టడం ఇష్టమని నేననుకోను."

"ఇంత హఠాత్తుగా యిలా నాన్న ఎందుకు మారారో అర్థం కాదు. ఇంతకు ముందెప్పుడూ ఈ ప్రస్తావనే వుండేది కాదు."

"నిజమే! కాని, ప్రతీచోటా పెళ్ళిళ్ళు జరుగుతూ వుంటే స్నేహితులంతా 'మీ అమ్మాయిలకి పెళ్ళిళ్ళెప్పుడు చేస్తావ్' అని అడుగుతూవుంటే, నాన్న మనసులో హఠాత్పరిణామంవచ్చి వుండొచ్చు. అది సహజం కూడాను! పెళ్ళీడొచ్చిన ఆడపిల్లలు యింట్లో వుంటే తలిదండ్రులకు యిటు వంటి తాపత్రయం వుండక తప్పదు శారదా."

"ఏమిటో అంతా అయోమయంగా వుంది." నిస్పృహతో అంది శారద.

"ప్రతి విషయానికీ మనమలా భయపడితే యెట్లాగే? పరిస్థితుల్ని మనకి అనుకూలంగా తెచ్చుకుందుకు, ప్రయత్నించాలి" చిన్నగా మందహాసం చేస్తూ అంది అరుణ.

"నన్నూరడించడానికే నువ్విలా చెప్తున్నావుగాని,అది సాధ్యం కాదని నీకూ తెలుసు. అదే సాధ్యమైతే, నువ్వింతగా దిగులుతో రోజులు గడపవు" అంది శారద.

చెల్లెలి మాటల్లోని గూఢార్థాన్ని అర్థం చేసుకుంది అరుణ. ఆమె చెప్పింది నిజమేనేమో ననుకుంది. ఈవిషయాన్ని యింక పొడిగించడం యిష్టం లేకపోయింది.

"అవన్నీ యిప్పుడెందుకు? పోనీలే... యీ ప్రస్తావనే వద్దు" అనేసింది అరుణ.

శారద కూడా మాట్లాడలేదింక. రిక్షా వడిగా సాగిపోతోంది.

# 3

శంకర్రావు, అప్పుడే వీధిలోంచి వచ్చాడు రొప్పుతూ. వస్తూనే, వాలుకుర్చీలో కూలబడిపోయాడు. మొహమంతా స్వేదంతో నిండిపోయింది. మనిషి బాగా అలసిపోయినట్టుగా

అగుపిస్తున్నాడు. అతని మెదడు ఆలోచనల కార్ఖానా అయ్యింది. ఇంతవరకూ అతనెంత ప్రశాంతంగా జీవితాన్ని సాగించాడో, ఇప్పుడున్న సమస్యలు అతని మెదడుని చిందర వందర చేస్తున్నాయి. ఇంతవరకూ పిల్లల పెళ్ళివిషయం, తన ఆరోగ్య విషయం ఆలోచిస్తూ తపన పడేవాడు. ఈ రోజు బజార్లో మాధవరావుని చూశాడు. అతను మళ్ళీ తనింట్లో తిష్ట వేస్తాడేమోనన్న భయంకొద్దీ అతని కంటబడకుండా తప్పించుకు వచ్చేశాడు. అయినా, ఎప్పుడో ఓసారితప్పకుండా వస్తాడన్న నమ్మకం లేకపోలేదు. వస్తే, యెలా అతణ్ణి వెళ్ళ గొట్టడమో, సమస్యగా పరిణమించింది.

మాధవరావు పరాయివాడు కాదు. శంకర్రావుకి స్వయంగా బావమర్ది. అరుణ, శారదలకు మేనమామ. డబ్బున్నవాడే అయినా, స్థిరత్వం లేని వ్యక్తి. దురుణాలకు దాసుడు. ఉద్యోగం చేస్తూ మానేశాడు. అవసరమైనప్పుడంతా అధిక మొత్తంలో వాళ్ళనాన్న దగ్గర డబ్బు తీసుకోవడం, ఊరూరా తిరగడం, అతనికిప్పుడలవాటైపోయింది. కొడుకు యిలా వ్యర్థుడైనందుకు, తండ్రి బాధపడ్డమే తప్పించి, అదుపులో వుంచే ప్రయత్నం చెయ్యలేదు. అలా ప్రయత్నిస్తే, కొడుకు యే అఘాయిత్యానికి పూనుకుంటాడోనని అతని భయం, అదో చాదస్తం మరి! కొడుకుని అదుపులో పెట్టే ప్రయత్నం ఆ ముసలాయన యే మాత్రం చేసినా, మాధవరావు బాగుపడి వుండేవాడు. కాని, అదే జరగలేదు.

మాధవరావు ఉద్యోగం చేస్తుండే రోజుల్లో, కొన్నాళ్లు విజయనగరంలో వెలిగించడంవల్ల, అతనికి చాలా

మంది స్నేహితులేర్పడ్డారు. డబ్బుతనదికాదన్నట్టుగా విరజల్లే మనిషి చుట్టూ సహజంగా, యెంతో మంది చేరుతారు. వాళ్ళంతా స్నేహితులే మాధవరావుకి. అతన్ని మెప్పించి, మురిపించి, అతని చూట్టూ తిరుగుతారు. వాళ్ళతో వున్న న్నాళ్ళూ మత్తుగా, విలాసంగా జీవితం సాగిపోతూ, కొత్త లోకంలో వున్నట్టనిపిస్తుం దతనికి. అందుకే, అప్పుడప్పుడూ విజయనగరం వస్తూ వుంటాడు. అక్కయ్య సజీవంగా వున్న రోజుల్లో వాళ్ళింటికి నేరుగా వచ్చేవాడు. కాని, యిప్పుడు స్నేహితుల దగ్గరే మకాం పెట్టాడు. ఇటీవలగా అతను ఆ అలవాటు చేసుకున్నాడు, అదీ శంకర్రావుకి భయపడి. అయినా అప్పుడప్పుడు వచ్చి పోతూండటం, అవసరమైతే, డబ్బు అడగడం కద్దు.

అటువంటి మాధవరావు, మళ్ళీ అగుపించివస్తాడేమో ననుకునే సరికి, అసహ్యంవేసింది శంకర్రావుకి. పెళ్ళిడొచ్చిన ఆడపిల్లలు వుండగా, మాధవరావు వంటి త్రాగుబోతు, నిలకడలేని మనిషి, తనింటికి రావడం, శంకర్రావుకి మనస్కరించదు. అందుకే, వచ్చిన తర్వాత ఏ విధంగా అతణ్ణి వెళ్ళగొట్టడమా అన్న ఆలోచనలో పడ్డాడు. మనస్సు కలత జెందింది.

అరుణ కాఫీ తీసుకొచ్చి తండ్రికి అందించింది.

"ఏం నాన్నా, అలావున్నావు?" అంది, కూచుంటూ. శంకర్రావు కాఫీ తాగడం ముగించి, కప్పు ఆమెకి అందిస్తూ;

"మీ మావయ్య మళ్ళీ వచ్చాడమ్మా!" అన్నాడు.

అరుణ, గతుక్కుమంది ఆ వార్త వినడంతో. మాధవ రావు స్వంత మేనమామే అయినా, ఆయనపట్ల అరుణకి ఏ విధమైన అభిమానమూ సద్భావమూ లేదు. తమకుటుంబంలో యెవ్వరికి అలవడని దుర్గుణాలన్నీ అతనికి అలవడమే అందుకు కారణం. అవివాహితుడుగా వుంటూ, విచ్చలవిడిగా తిరూ, తెన్నూ లేని జీవితం గడుపుతూ, తమతాతయ్య మనస్సుకితీరని ఆందోళన, కలవరపాటు కలిగిస్తున్నాడని, అసహ్యించు కుంటుంది. అప్పుడప్పుడూ విపరీతంగా కోపంవస్తుంది. ఆ మధ్య ఒకటి రెండుసార్లు "అరుణా! నన్ను పెళ్ళి చేసుకోకూడదూ! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాను" అన్నాడు. అప్పట్లో తనకి యెంత కోపం వచ్చిందో, యిప్పుడు చెప్ప లేనంటుంది అరుణ. ఆ మాధరావు, తాగుబోతు మాధవరావు వచ్చాడనగానే అదోవిధమైన భయం, జుగుప్స కలిగాయి.

"మనింటికే వచ్చాడా నాన్నా" ఆతృతగా అడిగింది.

"మనింటికింకా రాలేదు. ఉన్నారుగా వాడి స్నేహ బృందమంతా... అంతా వఠి రౌడీ వెధవలు. ఎవరింటికో వచ్చి వుంటాడు... మనిల్లు కూడా పావనం చెయ్యకుండా వూరుకుంటాడా? వస్తాడు" వెటకారంగా, క్రోధంగా అన్నాడు శంకర్రావు.

"వస్తే పొమ్మనండి నాన్నా!"

"సిగ్గూ, బిడియం వున్నవాడికి చెబితే అర్థం చేసుకుం టాడు. వీడికి అవేమీ లేవుగా! చెప్పినా కదలడు... అనవస రంగా వీధిన పడాలి. చిన్నకొడుకు కద్దా అని బాగా నెత్తి

నెక్కించుకున్నాడు వాళ్ళనాన్న. ఇప్పుడు విచారిస్తున్నాడు... అతని విచారం మాటకేం— మిగతా వాళ్ళందరికీ ఏదో సమస్య అయిపోతే ఎలా?"

"ఇప్పుడొస్తే, ఇంట్లో ఆశ్రయమిస్తారా నాన్నా?"

"మరేం చేయడమమ్మా? తగువుపడితే, నలుగురూ మనల్నే అంటారు...వాళ్ళక్క చనిపోవడంతోనే, వాళ్ళతో బంధుత్వాన్ని తెంపుకుంటున్నామని అనుకున్నా అనుకుంటారు ప్రజలు. అంతేగాని, ఏడి గుణాలెవ్వరూ పట్టించుకోరు"

"మావయ్య, రోజురోజుకీ అధోగతికి పోతున్నాడు నాన్నా! ఆ మధ్య ఒకటి రెండుసార్లు త్రాగుడు మైకంలో వళ్ళు తెలియని స్థితిలో 'అరుణా నన్ను పెళ్ళిచేసుకోకూడదు' అని అడిగాడు కూడాను. చెప్పకేం— చెళ్ళున లెంపకాయ కొట్టాలనిపించింది. అయితేనేం— మేనమామకదా అని వూరుకున్నాను."

కూతురు చెప్పింది విన్నాక, శంకర్రావు క్రోధాగ్నిలో ఆజ్యం పోసినట్టయ్యింది. కళ్ళు నిప్పుకణాల్లా మెరిశాయి. బావ మర్ది చెడిపోతున్నాడు కదా, అనే సానుభూతి యే మాత్రం అతనిలో వున్నా, ఆ క్షణంతో అది తుడుచుకు పోయింది.

"ఎంత తాగుడు మైకంలో వున్నా, వా డీమాట అంటాడా? నా కూతురు తాగుబోతుని పెళ్ళి చేసుకునే అర్హతగల దనుకుంటున్నాడా? ఏవిఁటి వాడి బుర్ర తిరుగుడు? రానీ... తగిన బుద్ధిచెస్తాను..." కోపంతో పళ్ళు కొరికాడు.

నాన్న ఆవేశం తెచ్చుకోవడం భయమేసింది అరుణకి.

"మీరు ఆవేశం తెచ్చుకోకండి నాన్నా! అసలే, మీ ఆరోగ్యం మంచిదికాదు. మావయ్య వస్తే, ఆ విషయం నేను చూసుకుంటానులెండి."

శంకర్రావు క్షణం మౌనంగా ఊరుకున్నాడు. అరుణ అక్కణ్ణించి వెళ్ళడానికి వుద్యుక్తురాలయ్యింది. అదే సమయంలో మాధవరావు వచ్చాడు.

"నమస్కారం బావగారూ!" అంటూ దగ్గరగా వచ్చాడు. మనిషి ఆరోజు కాస్త బాలన్స్‌లో వున్నట్టే తోచింది. అరుణ ఆగిపోయింది.

"నీకు యెన్నో పర్యాయాలు హెచ్చరించాను యిక్కడికి రావద్దని... ఎందుకొచ్చావు?" తీక్షణంగా అతని కేసి చూస్తూ, అన్నాడు శంకర్రావు.

మాధవరావు తన కేం పట్టనట్టుగా, చిన్నగా మందహాసం చేస్తూ, బావగారికి యెదురుగా కూచున్నాడు.

"ఎందుకు రావడమేమిటి బావగారూ? మాఅక్కగారిల్లు గాబట్టి వచ్చాను. ఆ పాటి చనువు లేదా?" కాస్త మాటలు తడబడ్డాయి.

"మీ అక్క బ్రతికున్న రోజుల్లో యీ మాటంటే బాగుండేది..." కోపంగా అన్నాడు శంకర్రావు.

"అక్క బ్రతికి లేకపోతేనేం? అనుబంధం యెక్కడికి పోతుంది బావగారూ!"

"మీ అక్కతోనే ఆ అనుబంధం తెగిపోయిందనుకున్నాం. అందులోనూ నీలాంటి వాడితోనా అనుబంధం?"

"ఏం! నేను మనిషిని కానా?"

"అది వేరే అడగవల్సిన ప్రశ్న కాదు. నువ్వు మనిషి వే అయితే, పరువు ప్రతిష్టలు గలవాడివైతే, యింత నికృష్టపు జీవితానికి దిగజారిపోవు. పబ్లిక్‌గా తాగి, తందనాలు తొక్కవు."

శంకర్రావు మాటలువిని, మాధవరావు రవ్వంతయినా బాధపడలేదు సరిగదా, నవ్వుకున్నాడు.

"ఓ! ఇదా బావగారూ మీ కోపానికి కారణం? ఫ్చ! ఏం చేస్తాం? ఒకరి విషం, మరొకరికి ఆహారం కావచ్చునంటారు పెద్దలు. అలాగే మీ దృష్టికి నీచంగా కనిపించే నా అలవాట్లు, నా జీవితాన్ని పునీతం చేసే మాధుర్యాలు. అది అందరికీ అలవడదు..." వెటకారంగా అన్నాడు.

శంకర్రావు క్రోధం, ద్విగుణీకృతమయ్యింది. అతని పెదాలు కంపించాయి, కనుబొమలు ముడిపడ్డాయి.

"ఉద్ధరించావు... నీ మాధుర్యాలతో నువ్వు చావు. ముందు నా యింటినుండి బైటికినడు..."

"ఇది అన్యాయం బావగారు; ఇంటికొచ్చినబంధువును, అదీ బావమర్దిని నిర్దాక్షిణ్యంగా యింటినుండి బైటికి పొమ్మనడం భావ్యంగాలేదు...ఒకవేళ నేను వెళ్లనంటాననుకోండి.." అంటూ అదోలాంటి పోజులో కూచున్నాడతను.

శంకర్రావు కోపం పరాకాష్ఠ నందుకుంది. తనింట్లో తనకే ధిక్కారమా? సహించలేకపోయాడు. కళ్ళు నిప్పులు చెరుగుతూ వుంటే, లేచి నుంచున్నాడు.

"ఏమిటీ, వెళ్ళనంటావా: నా ఇంట్లోనా? బ్లడీఫూల్, గెటవుట్..." గట్టిగా అరిచాడు.

అంతే! ఆ అరుపుతోనే గుండెల్ని పట్టుకుని కుర్చీలో కుప్పగా కూలిపోయాడు శంకర్రావు. అరుణ కెవ్వున కేక వేసింది. ఆమె చేతిలోని కప్పూ సాసరూ క్రిందపడి తుత్తునియ లయ్యాయి.

"నాన్నా! నాన్నా!" అంటూ తండ్రి దగ్గరికి వచ్చింది ఒక్క వుదుటున.

మాధవరావు, మైకం వదిలిపోయినట్లుగా తెల్లబోయి చూస్తూ:

"బావా! బావా!" అంటూ వంగి చూశాడు.

"ఎదురుగుండా డాక్టరు గారున్నారు... వెళ్ళి తీసుకురా మావయ్యా" రుద్ధస్వరంతో అంది అరుణ.

మాధవరావు వీధిలోకి పరుగెత్తాడు. శారద, తాయారు, వచ్చారు అరుణ కేకలువిని, భ్రాంతపడిపోయారు. అతని మొహంమీద చన్నీళ్ళు చల్లారు... స్పృహరాలేదు. అరుణ, శారద, చెరో ప్రక్కా కూచుని యేడుపు లంకించుకున్నారు.

అప్పుడే డాక్టరు వచ్చాడు పరుగు నడకలతో. శంకర్రావుని పరీక్షించాడు .... చేయవల్సిన ప్రయత్నాలన్నీ చేశాడు. కాని, లాభం లేకపోయింది. మొహం దించుకుని వెళ్ళిపోయాడు. అరుణ, శారద పిచ్చిగా చూస్తూ, కెవ్వుమంటూ తండ్రి భౌతిక దేహం మీదపడి రోదించారు. తాయారు నోట మాటరాలేదు. మాధవరావు కళ్ళనుండి

అతని హృదయంలో తుఫాను చెలరేగింది. గుండెల్లో యెవరో చేయిపెట్టి పేవుతున్నట్టే అన్పించింది. కుర్చీలో కూలబడి పోయాడు, అంతరంగంలో ఆక్రోశిస్తూ. యితనికి తెలుసు— తనే పోషినని. కాని, తను హంతకుడు కాదు... భగవాన్! ఇది నా జీవితానికి శాశ్వతంగా వుండే మచ్చగామోసు?— అనుకుంటూ కుమిలిపోయాడు. ఆ అక్కచెల్లెళ్ళ ఆక్రందన వినలేకపోయాడు. అక్షణంచి లేచి బైటకి వెళ్ళి ద్వారందగ్గర కూలబడి పోయాడు మాధవరావు. అతణ్ణి యేదో బాధ అవ్యక్తంగా రగిల్చేస్తోంది. అశ్రువులు ధారావాహినిగా దొర్లుతున్నాయి చెక్కిళ్ళమీదికి.

జరుపవలసిన విధులన్నీ జరిపేసి, జరుగవలసిన వాటి కోసం యోచన సాగించాడు గంగాధరం. ఇప్పుడు మనుమరాళ్ళు మాతృ, పితృవిహీనులయ్యారు. వారికింక పెద్దదిక్కు తనే తప్పించి, యింకెవరున్నారు? వారిని తనతోపాటుతీసుకుపోవడమే సమంజసంగా తోచిందతనికి. అది తన కర్తవ్యమనిపించింది.

గంగాధరం డెబ్బైయేళ్ళవాడు. అయినా, చెక్కుచెదరని ఆరోగ్యమతనిది. నిష్ఠాగరిష్ఠుడై, కొన్ని నియమాలకు

కట్టుబడి వుండటమే, తన ఆరోగ్యానికి కారణమంటాడతను. అందరికంటె పెద్దమ్మాయి లక్ష్మి...అందరికంటె చిన్నవాడు మాధవరావు. లక్ష్మికి వివాహమయ్యేసరికి, మాధవరావు ఆరేళ్ళవాడు. పెద్దమ్మాయి యీలోకం విడిచిపెట్టినా, అల్లుడు శంకర్రావు పిల్లల్ని యెంతో గారాబంగా చూసుకుంటున్నాడని మురిసిపోయాడు గంగాధరం. కాని, యిప్పుడా ఆశకూడా పోయింది. ఆ ముసలి హృదయంలో స్థావరం యేర్పరచుకున్న తృప్తి, మటుమాయమయింది. ఆ స్థానాన్ని ఆ వేదన ఆక్రమించుకుంది.

"అమ్మాయ్ అరుణ! మీరిద్దరూ నాతో వచ్చేయండమ్మా! ఇంక, యిక్కడెందుకు?" సానుభూతితో ఆమె తల నిమురుతూ అన్నాడు.

అరుణ కళ్ళు, జలజల నీరుకార్చాయి. పగిలిన హృదయం నుండి, రక్తం స్రవించినట్లయింది.

"తాతయ్యా!" అంటూ కుమిలి కుమిలి ఏడ్చింది.

గంగాధరం, వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, కళ్ళొత్తుకుని_

"బాధపడకమ్మా! ఏంచేస్తాం ? భగవంతుడు మీకు చాలా అన్యాయం చేశాడు. ఇది దుర్భరమే! అయినా తట్టుకోవాలి. తప్పదమ్మా! నువ్వు యెంత విలపించినా, చచ్చిపోయినవాళ్ళు తిరిగిరారు. అందుకే మీరిద్దరూ మాదగ్గిరికి వచ్చివుంటే, కొన్నాళ్ళకి, యీ బాధలన్నీ మర్చిపోయి, మామూలు వ్యక్తులుగా మారడానికి అవకాశం వుంటుంది

_నాకూ అదొక తృప్తిని కలిగిస్తుంది. ఏమంటావమ్మా?" అన్నాడు.

ఆ యిల్లు, ఆ వూరూ వదిలి, యెక్కడికి వెళ్ళడానికీ అరుణకి మనస్కరించడం లేదు. తనెలాగూ వుద్యోగం చేస్తోంది గాబట్టి, చెల్లెల్ని చదివిస్తూ యిక్కడే జీవితాన్ని సాగించాలన్న నిర్ణయానికి వచ్చింది. పోతే, తాతగారింటికి వెళ్ళే, మామయ్య మాధవరావుతో క్షణక్షణానికీ పేచీపడాల్సి వస్తుందేమోనని, ఆమె భయం. తనగురించి ఆలోచించక పోయినా, ముఖ్యంగా శారద విషయాన్ని దృష్టిలో వుంచు కొని_ ఆమె చదువు సంధ్యల్ని దృక్పథంలో పెట్టుకొని, ఆ నిర్ణయానికి వచ్చింది.

"తాతయ్యా! మీ మాట మన్నించలేక పోతున్నం దుకు, క్షమించండి. మేం చిన్నపిల్లలమేమీ కాదు___మాకూ ఒక ఆసరా కావాలనుకోడానికి; అందునా, నేను ఉద్యోగం చేస్తున్నాను. చెల్లాయి భవిష్యత్తు చూసుకుంటూ, అమ్మా నాన్నల జ్ఞాపకాలతో ఈ యింట్లోనే గడపాలని వుంది. మీరు మా శ్రేయోభిలాషులని తెలుసు. మీ ఆశీస్సులు మాకుంటే అదేచాలు తాతయ్యా! మీ సహకారం యెప్పుడు కావాలన్నా, మాకు లభిస్తుందన్న నమ్మకం మాకుంది. ఇంతే నేను చెప్పదల్చుకుంది" అంది అతి కష్టంమీద.

అరుణ జవాబుకి గంగాధరంకోపం తెచ్చుకోలేదు. అతనికి ఆమె మనస్తత్వం బాగా తెలుసు. ఆమె సర్వదా స్వతంత్ర జీవనాన్ని అభిలషించే అబల. అందుకే, వాళ్ళని బలవంతం చెయ్యడం ఆ ముసలాయనికి యిష్టం లేకపోయింది. ఫుర్రో

విషయం కూడా ఆలోచించాడు. ఇప్పుడంటే తను తీసుకు పోతాడు, వాళ్ళని ఆదరిస్తాడు. మరి కొన్నాళ్ళకి తను తనువు చాలిస్తే, వాళ్ళను చూసేవాళ్ళెవరు? కొడుకు మాధవరావు ఆదరిస్తాడా? అది కల్ల...వాడు బొత్తిగా జులాయి మనిషై పోయాడు. ఇటువంటి పరిస్థితుల్లో వాళ్ళ యిష్టానుసారమే చెయ్యడం, శ్రేయోదాయక మన్పించింది.

"సరేనమ్మా అరుణ! నీ అభీష్టాన్ని నే నెందుకు కాదనాలి? స్వతంత్ర జీవితాన్ని సాగించగలమనే ధైర్యం మన కున్నప్పుడు, అంతకంటె కావల్సిందేమిటి? అందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. కాలం మారింది. కాలంతోపాటు మనమూ మారాలనే నినాదాన్ని మీరు ఋజువు జేస్తున్నారు. ఎంతో గర్విస్తున్నాను. అయితే ఒక్కమాటమ్మా అరుణా!..."

"ఏమిటి తాతయ్యా!"

"నేనింక యెక్కువకాలం బ్రతకను. నా తృప్తికోసమైనా అప్పుడప్పుడూ నాయింటికివచ్చిపోతూవుండండి. నాకు మాత్రం యింకెవరున్నారు చెప్పు! మీ అమ్మ పోయింది... మీ నాన్న పోయాడు. మీ పెద్దమామయ్య మిలటరీలో చని పోయాడు. మిగిలిన ఆ ఒక్కడూ యెలా తయారయ్యాడో మీరంతా ప్రత్యక్షంగా చూస్తూనే వున్నారు. వాడలా తయారవ్వడానికి కొంతవరకూ నేనే కారకుణ్ని... అది ఆలస్యంగా తెలుసుకున్నాను. అప్పటికే తరుణం మించిపోయింది. వాడిదంతా మరోలోకం. వాడే సవ్యంగా వుంటే, మీ యిద్దరిలో యెవరో ఒకరు మాయింటి కోడలు కాకపోదురా!

అయినా, అవన్నీ యిప్పుడెందుకులే! ఇదంతా యెందుకు చెప్తున్నానంటే, మీరు మాత్రం అప్పుడప్పుడూ వచ్చిపోతూ వుండండి. మీకు నానుండి యేవిధమైన సహకారం కావాలన్నా, సందేహించకండి...ఏం? నేను చెప్పినట్టే చేస్తావు కదూ?" గంగాధరం గొంతు బొంగురుపోయింది. అతనిజీవిత మంతా ఆవేదనామయం. ధైర్యంగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడంటే, అతని గుండె నిబ్బరాన్ని హర్షించవలసిందే మరి!

అరుణకి యెంతో జాలివేసింది, తాతయ్య మాటలకి. ఈ వృద్ధాప్యంలో ఆయనకి ఆనందం లేకుండా పోయింది కదాఅని బాధపడింది. కా స్సేపు ఫారంలో వుండి తండ్రిమాటలు వింటున్న మాధవరావు కూడా బాధపడ్డాడు. కాని, యేం చెప్తాడు జవాబు? తండ్రి చెప్పినదాంట్లో ఒక్కటీ అసత్యం కాదని అతనికి తెలుసు. నిజంగా ఆయన మనస్తాపానికి తనే ప్రథమకారకుడనుకున్నాడు. ఈ ఆలోచన రావడం, మాధవరావుకి యిదే మొదటిసారి.

"పోనీ తాతయ్యా, నువ్వు మాతోపాటు యిక్కడే వుండిపోకూడదూ?" అంది.

మనుమరాలు ఆమాట అన్నందుకే మురిసిపోయాడు గంగాధరం. ఆప్యాయంగా ఆమె తలనిమురుతూ అన్నాడు_

"నువ్వు ఆమాటఅన్నందుకే నేనెంతో మురిసిపోతున్నానమ్మా అరుణా! ఈ వృద్ధాప్యపు పడిలో నాకు కావల్సింది

అన్యాయతతో నిండినమాటలే ! అది చాలు...కాని, నే నిక్కడ వుండటం వీలుపడదమ్మా! అక్కడి వ్యవహారా లన్నీ చూసుకోవాలి కదా! మరేం అనుకోకు. నేను చెప్పింది మాత్రం గుర్తుంచుకో."

"అలాగే తాతయ్యా! తప్పకుండా వస్తూవుంటాం."

"వస్తానమ్మా మరి! అమ్మాయ్ శారదా! అక్కనీడనే వుండమ్మా నీకేయిక్కట్టూరాదు" అంటూ శారదను దగ్గరికి తీసుకున్నాడు గంగాధరం.

అక్కచెల్లెళ్ళిద్దరూ కంటతడి పెట్టుకున్నారు.

"అదిగో! అదే వద్దంటాను. గుండెల్ని కాస్త నిబ్బరం చేసుకోవాలమ్మా! ఏం చేస్తాం ... అన్నట్టు తాయారూ, పెద్దదానవు...నువ్వుంటావు-వీళ్ళని చూస్తూవుండేం..."

"మీరు చెప్పాలా బాబూ!" అంది తాయారు.

"వస్తాం...వుండండి..." అంటూ బాధగా ముందుకు సాగిపోయాడు గంగాధరం.

మాధవరావు అరుణకి దగ్గరగా వచ్చాడు మెల్లగా అడుగులు వేసుకుంటూ. అతని మొహం బాగా వాడిపోయి వుంది. ఆమెతో మాట్లాడ్డానికే అతనికి భయమేస్తోంది. ఆ క్షణంలో అయినా, చెప్పక తప్పదుగా!

"వస్తాను అరుణా! నన్ను క్షమించు..." అంతే అన గలిగాడు. అతని గొంతులో యెప్పుడూలేని జీర వచ్చేసింది. ఎంతో కర్కశహృదయు డనుకున్న మాధవరావులో వింత మార్పేదో అగుపించింది అరుణకి.

"మంచిది మావయ్యా!" అనేసింది యాంత్రికంగా.

మాధవరావు వెనుదిరిగి చరచరా వెళ్ళిపోయాడు.

అరుణ గట్టిగా నిశ్వాసం వదిలి, కుర్చీలో కూలబడి పోయింది. శారద ఆమె ప్రక్కనే కూర్చుండిపోయింది. ఎంతో సేపు నిశ్శబ్దం. ఎవ్వరూ మాట్లాడలేదు. వారికేసి జాలిగా చూసింది తాయారు. వారి కళ్ళల్లో నీరు గూడుకట్టుకుని వుండటం గుర్తించింది. అక్కణ్ణించి మెల్లగా జారుకుంది. గడియారం 'టక్' 'టక్' మనడం మాత్రం విన్పిస్తోంది ఆ నిశ్శబ్ద వాతావరణంలో.

సాయంసమయపు సంజవెలుగులో పూలమొక్కలు, సీతాకోక చిలుకల్లా వింతశోభను సంతరించుకుంటున్నాయి. మల్లెపూల సౌరభం యెంతో ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. కిటికీ దగ్గర కూచుని, శూన్యంలోకి చూస్తున్న మాధవరావుకి యివేవీ ఉత్సాహాన్ని కలిగించలేదు. అతని మెదడు తీవ్రంగా పనిచేస్తోంది. క్షణక్షణానికీ, అతనికి శంకర్రావు మరణమే గుర్తుకొస్తోంది. ఇంత హఠాత్తుగా మృత్యుదేవత ఒడిలోకి పోయిన వ్యక్తిని, మాధవరావు యింతవరకెప్పుడూ చూడలేదు. ఆ సంఘటన చెరగని ముద్రలా అతని హృదయంలో

నాటుకుపోయింది. అంతేకాదు_ ఆ విషయం గుర్తుకొస్తున్నప్పు డంతా, ఒక విధమైన ఆవేదన అతణ్ణి రగిల్చేస్తోంది. శంక రావు మరణానికి తనే కారకుడన్న బాధ, పశ్చాత్తాపం, అతణ్ని పిరికివాణ్ణి చేసేసి నీరసింపజేస్తున్నాయి. అప్పట్లో తను యేస్థితిలో వున్నదీ గుర్తుకొచ్చింది. ఆ వాగ్వివాదంరావడానికి కారణం యేమిటని తనలో తనే వితర్కించుకున్నాడు. బావ తనని యెందుకు అసహ్యించుకున్నాడు?... ఒక్కటే కారణం_ తను త్రాగుబోతు గనుక... తను దుర్గుణాలకు ప్రతినిధిగనుక! నిజమే! తనని బావ ఒక్కడేకాదు_ అరుణ, శారదకూడా అసహ్యించుకుని వుండొచ్చు. నాన్నగారిసంగతి వేరు. తనపట్ల మనస్సులో అసహ్యత, ద్వేషభావం వున్నా, కన్నకొడుకు మీదుండే అభిమానం కొద్దీ బాహాటంగా తన అసహ్యతను వ్యక్తం చేయలేకపోయారు. అంటే, తను అందరి దృష్టిలోను చెడ్డవాడే. తనని మంచివాడని పొగడ్త లతో ఆకాశాని కెత్తేవాళ్లు విజయనగరంలోని తన స్నేహి తులే! చెరువులో నీరుంటే కప్పలు చేరునట్టే; తన దగ్గర డబ్బుంది గాబట్టె, పొగడ్తల కీర్తనలతో తనని భజించే వారేమో! దూరంగా యోచిస్తే, అదే నిజమనిపించింది.

మాధవరావు మెదడులో రైళ్ళు పరుగెడుతున్నాయ్. పొగడ్తలకు మనిషి యెంత సులువుగా లొంగిపోతాడో, అతని కిప్పుడవగాహన యిస్తోంది. తమ కుటుంబంలో యెవరికీ అబ్బని దురలవాట్లు తనకెలా అబ్బాయో, అతనికీ అర్థం కాలేదు. తన స్నేహబృందపు సహవాసమే యిందుకు కారణ

మని యిప్పుడనిపిస్తోంది. పేకాట నేర్పించారు వాళ్ళే! త్రాగుడు ఔషధమంటూ అలవాటు చేయించారు వాళ్ళే! వెలయాలు వేదవతితో పరిచయాన్ని కలిగించి, ఆమె ప్రేమ ఉచ్చులో తనని బిగించారు వాళ్ళే! ఇదంతటికీ కారణం వాళ్ళ స్వార్థమే అయ్యుండొచ్చు. తన ప్రవర్తన కారణంగా పుద్యోగం కూడా వదులుకున్నాడు. అదే కారణంగా అందరి అసహ్యతకూ, జుగుప్సకూ గురై, చివరికి తన కళ్ళెదుటే, బావను పోగొట్టుకున్నాడు. నిజంగా తను పాపాత్ముడే!అంతే కాదు. తన ప్రవర్తనమూలంగా అమూల్యమైన అవకాశాన్ని జారవిడుచుకున్నాడు. అదే అరుణను దూరం చేసుకోవడం! ఆమె విముఖతకు గురికావడం! ఇన్ని అనర్థాలు జరిగినా, తనలో ఈ క్షణం వరకూ చైతన్యం రాలేదు. బావ మరణం కళ్ళారా చూశాక, తనలో హఠాత్తుగా సంచలనం రేగింది. చైతన్య స్రవంతి, జలజల పారింది. తన జీవితంలో మార్పురావాలి. మళ్ళీ మొదటి మనిషి కావాలి. పాత జీవితాన్ని మరిచి, దానికో మలుపు తిప్పాలి. అప్పుడే తనకి శాంతి యేర్పడుతుంది. అప్పుడే నలుగుర్లో తలెత్తుకుని, సగర్వంగా బోరవిరుచుకు తిరగ్గలుగుతాడు తను... అనుకున్నాడు మాధవరావు.

ఆ క్షణం_ అతనిలో మార్పువస్తున్న ఆక్షణం_ అతని జీవితంలో ఒక విలువైన క్షణం. పతనమైపోతున్న తనని కాపాడిన క్షణం. తను మారాలి. మారి, తన గౌరవమూ, కుటుంబ గౌరవమూ నిలబెట్టుకోవాలి. ఈ వృద్ధాప్యంలో తన

గురించే తపనపడుతున్న నాన్నగారి వ్యథాభరిత హృదయానికి వూరట కలిగించాలి...యిలా పరి పరి విధాల ఆలోచనలు సాగించుతున్నాడు మాధవరావు.

అడుగుల శబ్దం దగ్గరపడి, యెవరో వస్తున్నట్టనిపించి, వెనుదిరిగి చూశాడు మాధవరావు. నాన్నగారు! చప్పున లేచి నుంచున్నాడు.

గంగాధరం మెల్లగా కొడుకుదగ్గరికివచ్చాడు. కొడుకు ఆ సమయంలో యింట్లో వుండటం, అతనికి యెంతోఆశ్చర్యం కలిగించింది. చాలా రోజుల తర్వాత, వాణ్ని సాయంత్రపు వేళ యింటిపట్టున చూడ్డమే అతని ఆశ్చర్యానికి కారణం.

"ఏంరా మాధవ్! ఇక్కడ ఒంటరిగా కూచున్నావేం? ఎక్కడికీ పోలేదూ?" మెల్లగా అడిగాడు.

"లేదు నాన్నా! ఎక్కడికీ వెళ్ళాలనిపించడం లేదు." మొహం దించుకునే జవాబిచ్చాడు.

"ఆశ్చర్యంగా వుందిరా! సాయంత్రపు వేళల్లో నువ్వు యింటిపట్టున వుండటం నేనే నమ్మలేక పోతున్నాను. రోజూ రాత్రి పదకొండు తర్వాతే వచ్చేవాడివి. అటువంటిది, ఈ మార్పేమిటి? విజయనగరం వెళ్ళొచ్చాక నీలో యేదో పరిణామం వచ్చినట్టుంది..." కొడుకులో ఆపాటి మార్పు వస్తున్నందుకు లోలోన యెంతో సంబరపడుతూ అన్నాడు గంగాధరం.

"నిజం నాన్నా! మీ ఊహ గురి తప్పలేదు. బావ మృత్యువును నేను కళ్ళారా చూశాను. ఆయనకి ఆయుస్సు

తక్కువై యీలోకం విడిచిపెట్టినా, ఆయనకి కోపం తెప్పించే నా ప్రవర్తన కూడా కొంతవరకు కారణమనుకుంటున్నాను. ఈ బాధే, నాలో పశ్చాత్తాపాన్ని రేకెత్తించి, నన్ను దహించి వేసింది. నేనెన్నో దురలవాట్లకు దాసుణ్ణయ్యాను. నా జీవితాన్ని చీకటి కూపంలోనికి తోసుకుపోతున్నట్టుగా తయారయ్యాను. మీరెన్నో విధాల చెప్పారు. శాసించారు. కాని లాభం లేకపోయింది. నాలో మార్పు రాలేదు. ఇంక చేసేదేమీ లేక, నిస్పృహతో వూరుకున్నారు. అయితేనేం— యిప్పుడు హఠాత్తుగా నాలో మార్పు వచ్చేసింది. పశ్చాత్తాపపు దావాగ్నిలో, నా నికృష్ట జీవితమంతా దగ్ధపటల మయ్యింది. ఆ జీవితానికి స్వస్తిచెప్పి, కొత్త జీవితానికి ప్రాణం పోస్తున్నాను. ఈరోజు మీ ముందు వాగ్దానం చేస్తున్నాను నాన్నా! మళ్ళీ ఆ దురలవాట్ల దరికి పోను, ఈ తను వుండగా. మీకింకెప్పుడూ మనస్తాపం కలిగించను" ఆవేశంగా అదోవిధమైన వుత్సుకతతో చెప్పుకుపోయాడు మాధవరావు. అతని కళ్ళల్లో ఒక కొత్త కాంతిని చూశాడు గంగాధరం.

గంగాధరం, అనంతమైన ఆనందంతో వుక్కిరి బిక్కిరయ్యాడు. తను బ్రతికివుండగా, కొడుకులో మార్పురాదని ఒక నిర్ణయానికి వచ్చిన వ్యక్తికి, కొడుకు మాటలు అమృత ధారలై వృద్ధాప్యాన్ని పటాపంచలు చేసినట్లయ్యాయి. మొహంలో కొత్త తేజస్సు, తళుక్కుమంది. అల్లుడు పోయాడన్న ఆవేదన మెండుగా వున్నా, అకారణంగా ఒక మంచి కూడా జరిగినందుకు మురిసిపోయాడు. పతనమైపోతున్న తన

కొడుకు, అధోగతిని అగ్రం చేసుకుని మారిపోయాడన్న సంతోషం అతనిలో పురకలు వేసింది. ఒక చెడు వున్నచోట, మంచి కూడా వుంటుందేమో ననుకున్నాడు గంగాధరం.

"మాధవ్! ఈరోజు నాకెంతో ఆనందంగా వుందిరా! నువ్వు మళ్ళీ మామూలు మనిషివి అవుతావో లేదోననే తపన నాలో ప్రగాఢంగా వుండేది. ఎంత ఆశను పెంచుకోవాలనుకున్నా నువ్వు మారతావనే నమ్మిక వుండేదికాదు. కాని నా అదృష్టం కొద్దీ నీలో పరిణామం వచ్చింది. నా యీ వృద్ధాప్యంలో యింతకంటె సంతోషించదగ్గ విషయం, యింకేముంటుంది?" మురిసిపోతూ అన్నాడు గంగాధరం.

తండ్రి ఆకాశాన్నంటే ఆనందంతో వుక్కిరి బిక్కిరి అవుతూవుంటే, మాధవరావు కనీసం మందహాసమైనా చెయ్యలేకపోయాడు. అతని గుండెల్లో తగిలిన గాయం యింకా బాధపెడుతూనే వుంది.

"నాలో మార్పు వచ్చినందుకు మీరు సంతోషిస్తున్నారు నాన్నా! కాని, ఈ మార్పుకి మూలకారణమైన ఘోరసంఘటనకు, తద్వారా జరిగిన అన్యాయానికి, మీరెందుకు బాధపడరు?"

"బాధపడక పోవడమేమిటి? మంచివాడివే! అప్పుడు హఠాత్తుగా పోతే, బాధపడనూ? బాధాగ్నితో గుండెలు జ్వలించిపోతున్నాయి. కాని, యేం చేస్తాం? ఎంత బాధపడినా, చచ్చినవాళ్ళు తిరిగిరారుకదా! అందుకే, నీలోకలిగిన మార్పుకి సంతసించడంలో ఆ బాధ మరుగున పడుతోంది."

క్షణం వాళ్ళిద్దరూ మౌనం వహించారు. ఏం మాట్లాడాలో యెవరికీ అర్థంకాలేదు.

"నాన్నా విడిచిపెట్టిన ఉద్యోగాన్ని మళ్ళీ సంపాదించుకోవడం, నాకిష్టంలేదు..." అన్నాడు మాధవరావు.

"నిన్ను ఉద్యోగం చెయ్యమని యెవరు చెప్పారా? మన పొలాలూ అవీ చూసుకుంటూ కాలిమీద కాలువేసుక్కూర్చోరాదూ."

"ప్రస్తుతానికి, అది నావల్ల కాదునాన్నా!" అయిష్టంగా అన్నాడు.

"అయితే, మరేం చెయ్యదల్చుకున్నావు?" అడిగాడు గంగాధరం. కొడుకు యేం చెయ్యదల్చుకున్నా తను అంతరాయం చెప్పకూడదనే నిర్ణయించుకున్నాడు.

"వ్యాపారం చెయ్యాలనుంది..."

"ఏం వ్యాపారం చేస్తావురానువ్వు? నీకున్న అనుభవం యేమిటి, వ్యాపారంలో?" ప్రశ్నలు వేశాడు.

"ఏమిటి చెయ్యాలో యింకా నిర్ణయించుకోలేదు నాన్నా! ఆలోచించి చెప్తాను. ఇక పోతే, అనుభవం విషయమంటారా? తెలివితేటలుండాలేగాని, అనుభవం యెందుకు నాన్నా?"

"నీ యిష్టం..."

"నాకు కొంత డబ్బు కావాలి?"

"ఎంత___?" గంగాధరం సూటిగా కొడుకు మొహంలోకి చూస్తూ అన్నాడు.

"నన్ను అనుమానిస్తున్నారేమిటి నాన్నా? నేను వాగ్దానం చేసినా, మీకు నమ్మకం యేర్పడలేదన్నమాట!"

"అబ్బే, అదేం కాదురా?"

"ఏవిధమైన సందేహమూ మీలో పెట్టుకోకండి. నన్ను మీరు యథేచ్ఛగా నమ్మొచ్చు..."

"సరేలే... యెంత కావాలంటావు?" నవ్వుతూ మెల్లిగా అన్నాడు గంగాధరం.

"ఐదు వేలకి తక్కువవుండకు లెండి, తర్వాత చెస్తాను.."

"అలాగే ఇస్తాలే! నువ్వు వాగ్దానం చేసినప్పుడు యింక నేను నమ్మకండా వుండగలనా? నా మన స్తత్వమే అది కాదురా!" అన్నాడు.

మాధవరావు మళ్ళీ యేం అనలేదు.

"నీ మాట నేను కాదనలేదు. మాధవ్! నాదీ ఒక కోరిక వుంది_ చెప్పనా?" అడిగాడు గంగాధరం.

తండ్రి మనసులోని కోరిక యేవిటో, అతనికెలా తెలుస్తుంది?

"చెప్పండి నాన్నా!" అన్నాడు మాధవరావు.

"రోజులు గడుస్తున్నకొద్దీ, నేను మృత్యువుకు దగ్గరగా పోతున్నానన్నమాటేగా! ఇంకెన్నాళ్ళు యీయిల్లు యిలా మోడుగావుంటుంది కళాకాంతులేకుండా? నా తృప్తి కోసమైనా నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకోరా! అదే నా ఆఖరి కోరిక."

మాధవరావు గట్టిగా నిశ్వాసం వదిలాడు.

"మీ కోరికను నేను కాదనను నాన్నా! అయితే, కొన్నాళ్ళు వ్యవధి యివ్వండి. నా కొత్త జీవితం ఒక మజిలీకి చేరనివ్వండి."

గంగాధరం, మరి బలవంత పెట్టలేదు.

"సరే నీయిష్టం..." అంటూ వెనక్కు తిరిగి వచ్చేశాడు, వెన్నెల నిండిన హృదయంతో.

మాధవరావు కుర్చీలో కూలబడి పూలమొక్కలకేసి చూశాడు. విద్యుద్దీపాల కాంతిలో వింతగా కన్పిస్తున్నాయి. చల్లనిగాలి సువాసనల్ని మోసుకొస్తుంటే, తృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

# 6

"నేను మరి చదవనక్కా?" అంది శారద ఓరోజు.

అరుణ విస్తుపోయింది. తండ్రి హఠాత్తుగా చనిపోవడం తమ యిద్దరికీ పెద్దఘాతమే! అయితేనేం _ తను వయసులో పెద్దది గాబట్టి, ప్రపంచానుభవం కాస్త యెక్కువగా సంపాదించినది కాబట్టి, కొంతయినా ఆ ఘాతానికి తట్టుకోగలిగింది. కాని చెల్లాయి శారద బెగిలిపోయిందనడానికి సందేహం లేదనుకుంది. అందుకే భవిష్యత్తుమీద బ్రహ్మాండమైన ఆశలు పెట్టుకున్న శారద, ఒక్కసారి నిస్పృహతో ఆశల్ని వదులుకుందేమో నన్పించిం దామెకి.

"అదేవిటీ! మరీ సిల్లీగా మాట్లాడకు."

"నిజం అక్కా! నాకింక చదవాలన్న ఆసక్తిలేదు."

"ఎన్నో ఆశల్ని పెంచుకొని, భవిష్యత్తును వెలుగు బాటగా సృష్టించుకోవాలని, కలలు గన్నావు. ఆ కలలన్నీ యేం కావాలి?"

"కరిగిపోవాలక్కా ఆ కలలు! ఆశలు పూసపుల్లలై యెక్కడికో యెగిరిపోవాలి. తప్పదు..."

"ఎందుకింత నిస్పృహ శారదా ? నాన్నగారు పోయారన్న వ్యధతో భవిష్యత్తుని పాడుచేసుకోకు..."

"నన్ను ప్రోత్సహించాలని అలా చెబుతున్నావేగాని, నీకు మాత్రం ఆ వ్యధ లేదూ ? కాకపోతే నువ్వు ధైర్యంగా దాన్ని తట్టుకోగలుగుతున్నావు- నేను మాత్రం తట్టుకోలేక పోతున్నానక్కా! ఏదో నాకు తెలియని బలహీనత నన్నిలా మార్చేసిందేమో మరి! ఏంచెయ్యను? మునుపటి ఉత్సాహం లేదు... ఆసక్తీ లేదు."

అరుణ గట్టిగా ఓ నిశ్వాసం వదిలింది. చెల్లాయి మనసు మార్చడం, ఈ పరిస్థితుల్లో సంభవం కాదనిపించింది. ఆమెను యెలాగైనా మెడిసిన్ చదివించాలి. ఆమె ఆశల్ని తీర్చాలి. అంతేకాదు.—ఆమె భవిష్యత్తును, ఆమె తీర్చిదిద్దుకునే తాహతుకు చేర్చాలి. అప్పుడు తన బాధ్యత తీరినట్టవుతుంది. అయితే, ఇప్పుడే శారద యిలా మొరాయించుకూర్చుంటే, తన అభిప్రాయానికి రూపం యేర్పడేదెట్లా!...

అందుకే, యిప్పుడేదో విధంగా చెల్లాయిని సుముఖురాల్ని చేసి, తర్వాత ఆలోచించవచ్చనుకుంది.

"చెల్లాయ్! నువ్వు అన్నీ తెలిసిన దానివి. నేనేం చెప్పనవసరంలేదు నీ మనసు మార్చడానికి. మనలో ఆవేదన వున్నా దాన్ని ఆవేశంగా మార్చుకోకూడదమ్మా! సరేలే నీ కంతగా పై చదువు చదవాలనే కాంక్ష లేకపోతే లేకపోవచ్చు. కాని, ఈ సంవత్సరం చదువు పూర్తిచేసి మరీ మానెయ్. ఇది నా కోరిక... కాదనకు..." అంది సౌమ్యంగా.

శారద యింకేమీ అనలేకపోయింది. అక్క తన మంచికే చెబుతోందని భావించి తనకి యిష్టం లేకపోయినా, ఆమె మాట నిలబెట్టాలనే ఉద్దేశంతో 'సరే' అంది.

"శారదా! చూశావా, ఒక్కో సంఘటన యెన్ని పరిణామాల్ని తీసుకొస్తుందో! ఒక్కోసారి జీవిత పథాన్నే మార్చేస్తూ వుంటాయి. మన వూహాలకి అనుగుణ్యంగా యెప్పుడూ జరగదేమో! నాన్న మనగురించి యెన్నో ఊహించారు. మనకి వివాహాంచేసి, మనం భర్తలతో హాయిగా కాపురం చేసుకుంటుంటే, ఆనందించాలనుకున్నారు. ఈ ప్రయత్నంలో, నీ చదువుకి స్వస్తి చెప్పించడానికికూడా సాహసించారు. కాని, యేమయ్యింది? ఆయన వూహాలు_ వూహాలుగానే మిగిలిపోయాయి. ఆయన మాత్రం అనుకోని విధంగా అనంతయాత్ర చేశారు. మనల్ని మన అదృష్టానికి వదిలేశారు. నేను అనుకున్నాను మనస్సులో... నాన్నతో చెప్పి, నిన్నెలాగైనా మెడిసిన్ చదివించాలని. నా వూహా

కూడా_ ఊహాగానే వుండిపోయింది. ఎంత చిత్రమైంది విధి?" బాధపడుతూ అంది అరుణ.

"వ్యక్తికి ఆశలుండకూడదేమో ననిపిస్తుంది అక్కా!"

"ఆశలు లేకపోతే ప్రగతికూడా వుండదన్న విషయాన్ని మర్చిపోతున్నావు. ఆశలు వుండాలి. అవి కొంతవరకూ ఆత్మ తృప్తిని కలిగిస్తాయి" చిన్నగా నవ్వుతూ అంది అరుణ.

"అమ్మా! చాలాసేపైంది, అలా మాట్లాడుకొంటూ కూచున్నారు... భోజనం చెయ్యరా మరి? వేళకూడా అవుతోంది" అనుకుంటూ వచ్చింది తాయారు

తాయారుకి ఇప్పుడు బాధ్యత మరింత అధికమయింది. తను వంట మనిషిననే చిన్నదృష్టిని వుంచుకోకుండా, వారి మంచిని కోరుతూ, ఇంటి మనిషిలానే సలహాలిస్తుంది. అరుణ, శారద కూడా తాయారుకి ఒక ప్రత్యేకమైన గౌరవాన్ని అందిస్తున్నారు.

"వడ్డించు తాయారూ! వస్తాం..." అంటూ లేచింది అరుణ. శారదకూడా బైలుదేరింది.

తాయారు వెంట యిద్దరూ నడిచారు. గడియారం పన్నెండు కొట్టింది మధ్యాహ్నం. ఎండ తీవ్రతగా వుంది. వంటగది పక్కనే వున్న సావిడిలో కూచుని యిద్దరూ భోం చేస్తుంటే, వడగాల్పులు అక్కడికే వస్తున్నాయి.

"అమ్మా అరుణా! మీ సెలవు యింకెన్నాళ్ళుందమ్మా?" అడిగింది తాయారు.

"ఈ వేళ వరకే వుంది. రేపు జాయినవుతాను! ఏం

తాయారూ అలా అడిగావు?" అంది అరుణ, తాయారు ఆ ప్రశ్న వెయ్యడానికి కారణం యేమిటో అర్థం చేసుకోలేక.

"అబ్బే, మరేం కాదమ్మా! ఇంట్లో వుంటే, యేవో ఆలోచనలు వస్తూనేవుంటాయి. అదీగాక, చిన్నమ్మాయి మరీ దిగులుతో కృంగిపోయి చదువుమీద ఆస క్తి చూపదమ్మా!"

"నిజమే తాయారూ! నేనూ అదే అభిప్రాయంతో వున్నాను. రేపట్నుంచి అదీ కాలేజీకి పోతుంది..."

"మంచిదమ్మా! ఏదో పెద్దదాన్ని గనుక, మిమ్మల్ని ఆశ్రయించుకుని, మీ ఉప్పు తింటున్న దాన్నిగనుక, యేదో చెబుతూ వుంటాను. మీరేం అనుకోకండమా !" అంది తాయారు అర్థించే ధోరణిలో.

"అబ్బే! అటువంటి దెప్పుడూ వుండదు తాయారూ! నీ సంగతి మాకు తెలీదు గనుకనా? ఆ సందేహాల్ని నీ మనసులో పెట్టుకోకు. నువ్వు మా శ్రేయోభిలాషి వనే యెప్పుడూ నమ్ముతున్నాం... ఇకముందు కూడా అదే నమ్మకలో వుంటాం."

తాయారు, మరేం మాట్లాడలేదు. ఆమెకి తన వాళ్ళంటూ, యెవ్వరూ లేరు. లేకనే, శంకర్రావు గారింట్లో చాలా రోజుల్నుండీ వుంటోంది. ఆ యింట్లో కేవలం వంట మనిషిగా గాకుండా, ఒక ఆత్మీయురాలిగా మెలుగుతూ అందరి అభిమానాన్ని సంపాదించింది. అందుకే, అరుణ, శారదలంటే ఆమెకి ప్రాణంకంటే అధికంగా వున్నారు. వాళ్ళపట్ల ఆమెకు గల వాత్సల్యం అపారం. అది వాళ్ళకీ తెలుసు.

భోజనాలు ముగిశాయి. అరుణ, శారద గదిలోని మంచాలమీద వాలారు కాస్సేపు విశ్రాంతి తీసుకుందుకు. వేడి గాలి కొడుతూవుంది కిటికీగుండా. ఎవరికీ నిద్రపట్టడంలేదు.

"అయితేఅక్కా, రేపుజాయిన్ అవుతావన్నమాట!" అంది నిశ్శబ్దాన్ని చీలుస్తూ, శారద.

"ఔను చెల్లీ! సెలవు అయిపోయిందిగా! నువ్వుకూడా రేపట్నుంచి కాలేజీకి పోవాలి. ఈ ఒక్క సంవత్సరమన్న ధీమాతో అశ్రద్ధ చెయ్యకుండా, యేకాగ్రతతో చదివి, మంచి మార్కులతో పాసైతేనే చదివినందుకు సార్ధకత వుంటుంది..." తన ఊహను దృష్టిలో పెట్టుకుని అలా చెప్పింది అరుణ.

"నువ్వు చెబుతూవుంటే, నేను కాదంటానా అక్కా! అలాగే!" అనేసింది శారద.

క్షణం నిశ్శబ్దం యేర్పడింది. అరుణకి గతమంతా గురుకు రావడంతో, యేమేమో ఆలోచిస్తోంది. శారదకి అనుకోకుండా మావయ్య జ్ఞప్తికి వచ్చాడు.

"మాధవరావు మావయ్య మరి రావడమే లేదేవిఁటక్కా?" ప్రశ్నించింది శారద. ఆ క్షణంలో అది అవసరమైన ప్రస్తావన కాదు. అయినా సరే, అతను జ్ఞప్తికి వచ్చాడుగాబట్టి అడిగింది.

"రాకపోవడమే మంచిదిలే చెల్లీ! వచ్చి మనల్ని ఉద్ధరించే దేవిఁటి! వట్టి త్రాగుబోతు..." అసహ్యించుకుంటూ అంది అరుణ.

తండ్రి మరణించిన తర్వాత, మాధవరావుపట్లఆమెకు

గల జుగుప్స, ద్వేషం, యినుమడించాయి. నాన్న మరణానికి, మావయ్యే కారణమని, ఆమె యిప్పటికీనమ్ముతుంది. ఆరోజు మావయ్య వచ్చివుండకపోతే, నాన్న మరణించి వుండడని ఆమె నమ్మకం. ఆమె నమ్మకం కొంతవరకూ సబబుగానే వున్నా, మాధవరావుకి శంకర్రావుని చంపేయాలన్నవుద్దేశం లేదన్న విషయం ఆమె ఆలోచించడం లేదు. అది యదాలాపంగా జరిగిన సంఘటన. దానికి యెవ్వరూ బాధ్యులు కారన్న విషయాన్ని ఆమె విస్మరిస్తోంది.

"వచ్చి, మనల్ని వుద్ధరిస్తాడని కాదక్కా! వూరికనే అంటున్నాను. ఆ దుర్గుణాలన్నీ వున్నాయని అసహ్యించుకోవడం గాని, లేకుంటే మనిషి మంచివాడే!" మళ్ళీ అంది శారద.

అరుణ పక్కకు ఒత్తిగిలి, చెల్లెలికేసి సూటిగా చూసింది. ఆమెకు వింతగా తోచింది కూడాను...యెప్పుడూ లేనిది ఆ రోజు శారద మావయ్య గురించి మాట్లాడుతుందేవిఁటా అని. ఆమెకి నవ్వొచ్చింది.

"దుర్గుణాలు లేకపోతే అందరూ మంచివాళ్ళ జాబితాలోకే పోతారు శారదా! మావయ్యకూడా ఆ గుణాలు లేకపోతే మనం అసహ్యించుకునే వాళ్ళమా చెప్పు? మనమే కాదు... నాన్నగారుకూడాను. మంచివాళ్ళ జాబితాలో వుంటే, మనిద్దరిలో ఒకరు అతని అర్ధాంగి అయ్యేవారమేమో!"

"అదీ నిజమే మరి! పాపం మావయ్య దుష్టసహవాసాలు చేసి, తన జీవితాన్ని పాడుచేసుకున్నాడు. లేకుంటే,

చీకూ చింతా లేని బ్రతుకు సాగిస్తూ, ఒక అంతస్తులో వుండే వాడు. ఒక్కొక్కప్పుడు అతన్ని తల్చుకుంటే, నాకు జాలి వేస్తుంది నిజంగా!" సానుభూతి వుప్పొంగిపోతూ వుండగా అంది శారద.

అరుణకి మరింత ఆశ్చర్యం కలిగింది చెల్లెలి ప్రవర్తనికి. మావయ్యంటే హఠాత్తుగా యెందుకంత సానుభూతి కలిగింది? మనసులో ప్రశ్నించుకుంది. కాని జవాబు రాలేదు. చెల్లెలి మనోభావం యేవిటో తెలుసుకోవాలనిపించింది.

"పాపం, అంత సానుభూతి కనబరుస్తున్నావు... పోనీ అతని బ్రతుకును బాగుచెయ్యటానికి ప్రయత్నించగూడదూ" అంది అరుణ.

అక్క హఠాత్తుగా ఆ ప్రశ్న వేసేసరికి; తత్తరపాటు చెందింది శారద. తనని గురించి అక్క యేవిధమైన అభిప్రాయాన్ని యేర్పర్చుకుంటుందో ననే సందేహం కలిగింది.

"నేనా? నేనా, అతని బ్రతుకును బాగుచెయ్యడానికి ప్రయత్నించడం? ఏవిటి నువ్వంటున్నది అక్కా?" అదో లాంటి స్వరంతో అంది శారద.

ఒక్కసారిగా మబ్బు వేసింది. ఎండ తీవ్రత తగ్గినట్లుగ కిటికీగుండా అగుపిస్తోంది. గాలి సంభించి పోయింది.

అరుణ పెదాలపై మందహాసం చిన్నగా వెల్లివిరిసింది.

"మరేం గాభరాపడకు. మావయ్యపట్ల నువ్వంత జాలి కనబరుస్తున్నావుకదా, పోనీ అతన్ని పెళ్ళి చేసుకుని, అతని జీవితాన్ని బాగుచెయ్యడానికి ప్రయత్నించకూడదా అనే నే నంటున్నాను."

శారద, ఒక్క ఫ్రుమటున లేచి కూచుంది. ఆమె మొహం వున్నపాటున రాగరంజిత మయింది.

"ఒక వ్యక్తిపై సానుభూతి చూపిస్తున్నంతమాత్రాన, ఆ వ్యక్తిపై అనురాగం యేర్పడినట్లేనన్న మాట?" విసురుగా అంది.

అరుణకూడ లేచి కూచుంది.

"ఆవేశం తెచ్చుకోకే! వూరికనే అన్నాను." నవ్వుతూ అనేసి, చెల్లెలి కోపాగ్ని ఉపశమింపజేసింది.

బైట 'పోస్ట్' అంటూ కేక వినబడింది. శారద వెళ్ళి ఓ కవరు తీసుకొచ్చింది. దాన్ని విప్పి చదువుతూనే, తెల్ల మొహం వేసింది.

"ఏమయ్యిందే? ఏమిటలా అయిపోయావు? విషాద వార్త యేం కాదుకదా?" ఆతృతగా అంటూ చెల్లెలి దగ్గరకు వచ్చి ఆమె చేతిలోని వుత్తరం తీసుకొని చదివింది. ఆమె మొహమూ పాలిపోయింది.

"ఈరోజు మావయ్య నీకు జ్ఞప్తికి రావటం, యిదే సమయంలో ఈ వుత్తరం రావడం, యెంత గమ్మత్తుగా వున్నాయో చూశావా శారదా!" అంది అరుణ మెల్లగా.

"గమ్మత్తు మాటకేంగాని, రేపు మావయ్య వస్తున్నట్టు రాశాడు గదా, యేం చేస్తావు?" పరిష్కారం గాని సమస్య అయినట్లుగా బేలమొహం పెడుతూ అంది శారద.

"అదే ఆలోచిస్తున్నానే!" అంటూ నిస్సహాయంగా మంచంమీద కూలబడింది అరుణ.

"నిర్మొహమాటంగా యిక్కడికి రావద్దని చెప్పేస్తే పోతుంది" అంది శారద. ఆమెకి క్షణం క్రితం, అక్క మాటలు జ్ఞాపికి వచ్చాయి. అందుకే యిప్పుడు సానుభూతికి తావివ్వలేదు.

"అప్పుడే నీ సానుభూతి మంచుముక్కలా కరిగిపోయిందన్నమాట శారదా!" చిన్నగా మందహాసం చేస్తూ అంది.

"అది కాదే అక్కా! మనం ఒంటరిగా వుంటున్నామా మరి! అందుకే..." నీళ్ళు నమిలింది.

"అతని గుణాలు మంచివి కావని అనుకోవడంగానీ, మావయ్య మనకి పరాయివాడు కాదుగా!"

"అయితే, మనింట్లోనే వుంటాడన్నమాట..."

"మావయ్య రానీయ్. అప్పటి పరిస్థితులు చూసి ఆలోచిద్దాం. ఏ మాత్రం జుగుప్సాకరంగా ప్రవర్తించినా, బైటికి పొమ్మందాం. మొదటే అవమానానికి గురిచెయ్యడం, ఆయన బాధపడ్డం అటుంచి, తాతయ్యకి తెలిస్తే, యెంతో వ్యథచెందుతాడు. అదికూడా ఆలోచించాలిగా!" శాస్త్రదూరం యోచించి అంది అరుణ.

అక్క చెప్పింది సబబుగా వుందనిపించింది శారదకి.

"సరే! అలాగే చేద్దాం..." అంటూ మంచంమీద ఒరిగింది, ఆవులింత తీస్తూ.

అరుణ కూడా వెళ్ళి తన మంచంమీద ఒరిగింది. క్షణం సేపు యెవ్వరూ మాట్లాడలేదు. క్రమంగా వాళ్ళిద్దరూ నిద్రాదేవత ఒడిలోకి ఒరిగిపోయారు, ఒకరికి తెలియని కలలు

మరొకరు కంటూ మరోలోకంలో విహరిస్తూన్నారు. ఆశలు లేకపోయినా అనుభూతులంటూ వుంటాయిగా మరి!"

# 7

ఉదయం యెనిమిది దాటింది. పక్కింట్లో హిందీపాటలు వినిపిస్తున్నాయి, రేడియోలో. తమయింట్లో రేడియో వున్నా ప్రస్తుతానికి దాన్ని వినియోగించడం యిష్టం లేకపోయింది అరుణకి. సహజంగా యీ బలహీనత ప్రతి మానవులలోనూ వున్నదే. ఏవో కష్టాల్లో వున్నప్పుడు, ఆవేదనలో వున్నప్పుడు అంతర్గత అభిరుచులను అణచుకోవడం పరిపాటి. అదే జరిగింది అరుణ_ శారదల విషయంలోనూ. ఇరువురూ ముందుగదిలో కూచుని, పాటలు వింటున్నారు. లతా మంగేష్కర్ కంఠ మాధుర్యాన్ని మెచ్చుకుంటున్నారు. ఆ తన్మయత్వంలోపడి, మావయ్య ఆరోజే వస్తున్నాడన్న విషయాన్ని మర్చిపోయారు.

'టింగ్' మంటూ గడియారం ఒకటి కొట్టింది. సిలోన్ రేడియో సేవన్నుంచి, యెనిమిదిన్నరయినట్టు ప్రకటిస్తున్నాడు అనౌన్సరప్పుడే.

వీధిలో రిక్షా ఆగింది. అరుణదృష్టి రిక్షామీదపడింది. అప్పుడు జ్ఞప్తికి వచ్చింది_ మావయ్య వస్తున్నట్టు.

"మావయ్యొ వచ్చేశాడే!" అంది. ఆ కంఠస్వరంలో వుత్సుకత స్ఫురించడం లేదు. ఇరువురూ అటు కేసే చూశారు.

మాధవరావు రిక్షాదిగి, రిక్షావాడికి డబ్బులిచ్చేస్తూ, టూరిస్టుబేగ్‌లాంటిది చేతపట్టుకుని వచ్చాడు.

అతణ్ణి ఆహ్వానిస్తున్నట్టుగా యిద్దరు అక్కచెల్లెళ్ళూ అక్కడ నుంచోవడం చూసేసరికి, అతని కళ్ళు చెదిరి పోయాయనే చెప్పాలి.

"ఏం మావయ్యా?" అంది అరుణ, యింటికొచ్చిన వాణ్ణి పలుకరించాలి గనుక.

"నేను రాసిన వుత్తరం అందింది కదూ?" అన్నాడు మాధవరావు. ఉత్తరం అందకపోతే, తన రాకకోసం యెందుకలా కాచుక్కూచుంటారని, అతని అభిప్రాయం! పాపం, అతనికి తెలీదు, వాళ్ళ ఆంతర్యం!

"అందింది మావయ్యా! కూచో" అంది అరుణ.

మాధవరావు కూచున్నాడు. అతనికేసి చూసింది అరుణ. మునుపటిలా లేనట్టనిపించిం దామెకి. ఇంతకుముందు యెప్పుడు అగుపించినా, యేదో మైకంలో, మరో లోకంలో వున్నట్టే కన్పించేవాడు. ఎప్పుడూ జుత్తు రేగివుండేది... మొహం జిడ్డుగా వుండేది. కళ్లు చింతనిప్పుల్లా వుండేవి భయం గొల్పుతూ. ఇప్పుడా ఛాయలేలేవు. నీటుగా ముస్తాబయ్యాడు. మొహంలో యేదో కొత్తకాంతి వెలుగుతున్నట్టనిపించింది. బహుశా, వుదయంపూట యిలాగేవుండి, సాయంకాలపు వేళల్లో మైకంలోకి పోతాడేమో!... అనుకుంది, మరో నమ్మకంలేక.

"తాతయ్య కులాసాయేనా?" అడిగింది అరుణ.

"కులాసాయే! వుత్తరాలు రాస్తున్నారుగా!"

"ఔను" ముక్తసరిగ అంది.

అరుణ, చాలాముభావంగా మాట్లాడటం గమనించాడు మాధవరావు. శారద, అసలు మాట్లాడమే లేదు. అతని మనస్సు చివుక్కుమంది. బహుశా, తనని మునుపటి మాధవ రావే అనుకుని అసహ్యాన్ని పెంచుకుని అంత ముభావంగా వున్నారేమో! అదే నిజమైతే, ఆశ్చర్యమేమీ లేదనుకు న్నాడు. కొన్నాళ్ళక్రితం తన ప్రవర్తన చాలమంది బంధువు లకు, స్నేహితులకు జుగుప్స కలిగించినమాట వాస్తవమే. ఆ జుగుప్స, వారిలో తనపట్ల ద్వేషాన్ని రేకెత్తించింది. కొం దరు తనతో మాట్లాడమే మానుకున్నారు. కొందరు ముభా వంగా మాట్లాడేవారు; మరికొందరు తనని తప్పించుకుని తిరిగే వారు. అది తను గ్రహించినా, అప్పట్లో రవంతయినా బాధపడేవాడు కాదు. అదొక విచిత్రమైన స్థితి. అదంతా తల్చుకుంటే, యిప్పుడు నవ్వొస్తుందతనికి. అయితే, తనిప్పుడు ఆ మాధవరావు కాదు. ఆ విషయం అందరికీ తెలీదు. ఆ 'అందరు'లో అరుణ, శారదకూడా వున్నారు మరి. వాళ్లు తన ప్రవర్తన గురించి తెలుసుకోవాలి. అది యెంతో అవస రం ప్రస్తుతానికి...అనుకున్నాడు.

"శారదా! మావయ్యకు కాఫీతీసుకురా!" అతను ఆలో చనలు సాగిస్తుంటే, శారదకు పని పురమాయించింది అరుణ.

శారద అకర్ణించి నిష్క్రమించింది.

మాధవరావు తననుగురించి యెలా చెప్పడమా అని తటపటాయిస్తూ, కాస్సేపు చేతులు నులుముకున్నాడు. ఏదో విధంగా చెప్పాలి మరి.

"అరుణ! మీ నాన్న మరణం నన్ను బాగా కృంగ దీసిందంటే, నువ్వు నమ్ముతావా?" మెల్లగా అన్నాడు జీర వోయిన స్వరంతో.

"నమ్మ మంటావా?" యెదురు ప్రశ్న వేసింది అరుణ. మాధవరావులో—అతను తన మేనమామే కావచ్చు- మాన వత్వమున్నది. ఉందని ఆమె అనుకోవడంలేదు. అందుకే అలా ప్రశ్నించింది.

మాధవరావు, గట్టిగా ఓ నిశ్వాసం వదిలాడు.

"నాకు తెలుసు, నువ్వు నమ్మవని; కాని పరిస్థితుల్ని ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో. నేనేగాని ఆరోజు వచ్చివుండక పోతే, వచ్చినా మీ నాన్నతో మొండిగా వాదించకపోతే ఆయన మరణించి వుండరని, యిప్పటికీ నేను అనుకుంటూ వుంటాను. అందుకే, ఆ సంఘటన కళ్ళారా చూశాకనే నాలో యెటువంటి సంఘర్షణ జరిగిందో _ నాకు తప్పించి యింకెవ్వరికీ తెలీదు. ఆ సంఘర్షణఫలితంగా, అగాధంలాంటి ఆవేదనలో పడి, కృంగిపోయాను. నేనే యేదో తప్పు చేసి నట్టుగా బాధపడ్డాను. ఆ బాధ, నన్ను యిప్పటికీ రగుల్చు తుందంటే, నువ్వు నమ్మవు. ఆబాధాజ్వాలల్లో, పతనావస్థలో

వున్న నా దురలవాట్లన్నీ దగ్ధమయ్యాయి. ఇదో విచిత్రమైన సంఘటన అరుణా! ఎవరూ నమ్మశక్యం కానిది. కాని, నా విషయంలో అక్షరాలా జరిగింది. నేనిప్పుడు కొత్త మాధవ రావుని. పతనానికి హేతువైన దురలవాట్లన్నింటినీ దూరం చేసుకుని, పునీతుడనైన మాధవరావుని" అన్నాడు వుత్సాహంగా. అతని మాటల్లో కాస్తంత గర్వం, గాంభీర్యంకూడా ప్రస్ఫుటమౌతోంది.

అరుణ మొహం, ఆశ్చర్యంతో అదోలా మారింది. ఆమె కనురెప్పలు, మీదికి యెగసినయ్. తదేకంగా మావయ్యకేసి చూసింది. ఆ మొహంలో ప్రసన్నత గోచ రిస్తోంది. కళ్ళల్లో యేదో కొత్తకాంతి, కొట్టొచ్చినట్టు కనిపించింది. పొందికగా దువ్వుకున్న జుత్తు, మిలమిల మెరుస్తోంది.

అరుణ, తనకేసి అదేపనిగా కళ్ళప్పగించి చూస్తుంటే సిగ్గుపడిపోయాడు మాధవరావు.

"అదేమిటలా చూస్తున్నావు అరుణా? నేను చెప్పింది నమ్మలేకపోతున్నావా?" అన్నాడు, కాస్తంత బాధపడుతూ. తను నిజం చెప్పినా యిప్పుడెవరూ నమ్మే స్థితిలో లేరెందుకో అర్థం చేసుకోలేక పోతున్నాడు.

"నమ్మలేకపోవడం కాదు మావయ్యా! తప్పకుండా నమ్ముతాను. నీలో యెన్ని దుర్గుణాలున్నా, నువ్వు యెప్పుడూ అబద్ధం చెప్పేవాడివికాదు. అందుకే, నేను నమ్ముతున్నాను.

ఇందుకు నేనెంతగానో ఆనందిస్తున్నాను మావయ్యా!నాన్న, మనల్నందర్నీ విడిచి హఠాత్తుగా పోయాడన్న బాధలోనే, నీలో పరివర్తన వచ్చిందన్న సంతోషంకూడా మిళితమై, వుక్కిరిబిక్కిరి చేస్తోంది. సినీమాల్లోనూ, కథలలోనూ; యిటువంటి సంఘటనలు చూశాం, చదివాంగాని, యిప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నందుకు, అదీ నీ విషయంలోనే జరిగినందుకు—యెంతో గర్విస్తున్నాను కూడాను. బహుశా తాతయ్య సంతోషంతో గంతులు వేసుంటారు. కాదూమరి—పతన మైపోతున్న కొడుకు, తనని మానసికంగా అగాధాల్లోకి తీసుకుపోతున్న కొడుకు, ఒక్కసారి పరివర్తన చెందితే, ఆ అనుభూతి కలగకుండా వుంటుందా?" మందహాసంతో అంది అరుణ.

అరుణ, అప్పటికైనా తనని అర్ధం చేసుకున్నందుకు, నమ్మినందుకు, సంతోషించి తృప్తిగా నిట్టూర్పు వదిలాడు.

"హమ్మయ్య! నన్ను నమ్మావు. అంతేచాలు అరుణా" అన్నాడు మోస్తున్న అమిత భారాన్ని దించుకున్నట్టుగా ఫీలవుతూ.

శారద కాఫీ తెచ్చి అందించింది.

"శారదకి నా మీద కోపం గామోసు!" అన్నాడు, ఆమె కేసి ఓరగాచూస్తూ కాఫీ తీసుకుంటూనే.

శారద, అదోలా మొహం పెట్టుకుని అంది;

"నీమీద నా కెందుకు మావయ్యా కోపం? ఏమీ లేదు."

"కోపం లేకపోతే మరింకేం? సంతోషమే!" ఖాళీ కప్పు అక్కడ పెట్టేసి, నవ్వుతూ అన్నాడు.

"శారదా, మావయ్య మునుపటి మావయ్యకాదు తెలుసా?" అంది అరుణ చెల్లెలికేసి ప్రశ్నార్థకంగా చూస్తూ.

"అంటే?" శారదకేమీ అర్థంకాలేదు గాబట్టి, ప్రశ్న వేయక తప్పలేదు.

"ఇప్పుడు చాలా బుద్ధిమంతుడై పోయాట్ట."

"అలాగా! అయితే సంతోషమే!" అంది వుట్టిపడే ఆనందంతో. నిజానికి, ఆమెకి మావయ్యపట్ల యెప్పుడూ ద్వేషంలేదు. అతను పతనోన్ముఖుడౌతున్నందుకు, యెంతో సానుభూతి చూపేది... జాలిచెందేది. అయితే, ఆ సాను భూతిని అక్క మరోరూపంలో అర్థంచేసుకుందని, పరిహాస మాడిందని ముభావంగా వుంది. ఇప్పుడు మావయ్య, దురల వాట్లకు దూరమయ్యాడని వింటుంటే, ఆమెకంటె సంతోషించే వాళ్ళెవరుంటారు!

"ఉద్యోగం మాటేమిటి మావయ్యా! మళ్ళీ ఆ వుద్యోగం దొరుకుతుందా?" ప్రశ్నించింది అరుణ.

మావయ్య మారిపోయాడని తెలిశాక, సన్నిహితంగా మాట్లాడుతోంది అరుణ. మాధవరావు అది గమనించకపో లేదు. మనిషి ప్రవర్తనబట్టే యెదుటి వ్యక్తులనుండి ఆదరణ లభిస్తుందేమోనన్న నిర్ణయానికి రాకుండా వుండలేకపోయాడు.

"ఉద్యోగం చెయ్యాలన్న ఆసక్తి మరిలేదు అరుణా! ఏదో ఒక వ్యాసంగం పెట్టుకోవాలిగాని, పూరకనే కూచుని విలువైన కాలాన్ని వృథా చెయ్యలేనుకదా! అందుకే, నా దృష్టి వ్యాపారం మీదికి పోయింది..." అని మాధవరావు అంటుంటే, అక్కచెల్లెళ్ళిద్దరూ విస్తుపోయి కళ్ళప్పగించి చూశారు. మావయ్య వింతధోరణిలో పోతున్నందుకే ఆ ఆశ్చర్యం. అరుణ వుండబట్టలేక అంది:

"ఏమిటి మావయ్యా! జీవితం గురించి యింతదూరం ఆలోచించే అంతస్తు వచ్చేశావన్నమాట..." నవ్వుతూనే అంది.

"నన్నో పనికిమాలిన దద్దమ్మగా జమకట్టారా ఏమిటి అరుణా యిన్నాళ్ళూ" అని అంటూ తన మాటల్ని తనే సరి దిద్దుకోవాలనుకుని "Of course, యీ మధ్య నా ప్రవర్తన అలాగే అనిపించి వుంటుంది మరి! అయినా నేను మొదటే. నివేదించుకున్నానుగా—ఆ మాధవరావుని పూర్తిగా మర్చి పొమ్మని; అప్పటి పరిస్థితులే వేరు..."

"ఆ పరిస్థితులు మళ్ళీ యేర్పడవన్న నమ్మకం ఏముంది మావయ్యా?" అతని మనోబలాన్ని, అధికం చెయ్యాలన్న తలంపుతోనే ప్రశ్నించింది అరుణ.

"ఏర్పడే అవకాశాలు లేకుండానే నేను జాగ్రత్త పడ్డాను. నా పాతస్నేహితులంతా యిప్పుడు నాకు విరోధులే! ఐమీన్... నన్ను అగాధంలోకి లాగిన స్నేహితులంతా; శ్రీకాకుళంలోనే. అక్కడే ఫాన్సీస్టోర్సు పెడుతున్నా. ఎవరూ

నన్ను మళ్ళీ వేలెత్తి చూపని విధంగా జీవితాన్ని సాగించా లన్నదృఢనిశ్చయాన్ని యేర్పర్చుకున్నాను. బ్రహ్మరుద్రాదులు కూడా నా నిశ్చయాన్ని సడలింపచేయలేరు.” హుందాగా చెప్పాడు మాధవరావు. అతని మనోనిబ్బరానికి, సంబర పడింది అరుణ. శారద సంగతి సరేసరి!

“చూశావా మావయ్యా, మనిషికి యే విధమైన బలహీనతగా లేకపోతే యెంత ధైర్యం, మనోనిబ్బరం వస్తుందో! అందుకు నువ్వే తార్కాణం కాదామరి! నీ యీ మార్పుకి మేమెంతో ఆనందిస్తున్నాం మావయ్యా; ఇవి నా హృదయాంతరాళంనుండి వచ్చిన మాటలు.” అంది అరుణ వుత్సాహంతో.

తొమ్మిది గంటలుకొట్టింది గడియారం. మాధవరావు ఓసారి చేతివాచీ చూసుకున్నాడు, అలవాటు ప్రకారం. తను మధ్యాహ్నం బండికి పోవాలి. మార్కెట్టులో తీసుకోవల్సిన సామాన్లు చాలా వున్నాయి. ఇంక జాప్యం చెయ్యకూడదను కున్నాడు.

“అరుణా! ఏదో మిమ్మల్ని చూసిపోదామనివచ్చాను. చూసేశాను. మరి, వెళ్లొస్తా” అంటూ లేచాడు.

అరుణ తెల్లబోయింది. శారద అక్కకేసి అదోలా చూసింది. అప్పుడే మావయ్య వెళ్ళిపోతానంటుంటే, వాళ్ళ కేం అర్థంకాలేదు. తాము అతన్ని చిన్నచూపు చూశామన్న అనుమానం వచ్చి, వెళ్ళిపోతున్నాడేమిటోనన్న సందేహం అక్కచెల్లెళ్ళిద్దరికీ కలిగింది.

8)

"అదేమిటి మావయ్యా, అప్పుడే వెళ్ళిపోతానంటావు? ఈ ఒక్కరోజు వుండి వెళ్ళు...వచ్చి ఓ గంటయినా కాలేదు కదా!" అంది అరుణ.

"ఉండడానికేంలే అరుణా! వుంటేనేగాని, ఆత్మీయత వెల్లడికాదా? అయినా యిందులో పరాయివాళ్ళ మెవరం? మీ మేనమామనేగా! మనలో మనకి అరమరిక లేవిటిలే! అసలు సంగతి అదికాదు. నేను ఫ్యాన్సీ స్టోర్సు పెడుతున్నా నన్నానుగా. కొన్ని సామాన్లు కొనుక్కుని వెళ్ళాలి. మధ్యాహ్నం ఒంటిగంటకి కాబోలు బండి వుంది. మార్కెట్టులోనే కనీసం రెండు మూడు గంటలు తీసుకుంటుంది... అందుకే నా తొందర..."

"పోనీ, మాతో కలిసి భోజనం చేసి వెళ్దువుగాని..." అంటూ మరింక అతని మాటకైనా యెదురు చూడకుండా లోపలికి వెళ్ళిపోయింది. అక్కవెంట శారద కూడా నడిచింది.

మాధవరావు మురిసిపోయాడు వారి ఆత్మీయతకు. మంచిని యిచ్చి, పుచ్చుకోవడంలోనే వుంది మానవత్వం— అనుకున్నాడు.

క్షణంలో భోజనాలు యేర్పాటుచేసింది తాయారు. భోజనాలు ముగిశాక మాధవరావు వెళ్ళిపోయాడు. అరుణ, శారద కూడా బైలుదేరారు...ఆ రోజు అరుణ డ్యూటీలో చేరాలి, శారద కాలేజీకి వెళ్ళాలి మరి!

* * *

అరుణ, శారద రిక్షాలో పోతున్నారు. శారద మన

సులో యింకా మావయ్యే మెసుల్తున్నాడు. అతనిలో పరివర్తన వచ్చినందుకు, ఆమె యెంతో సంతోషిస్తోంది.

"మావయ్య యిప్పుడు పూర్తిగా మారిపోయాడే అక్కా!" అంది.

"ఔను చెల్లీ! నిజంగా హర్షించదగ్గ పరివర్తన యిది. చాలా అరుదుగా యిటువంటివి సంభవిస్తూ వుంటాయి. పోనీలే! అతను అగాధంలోకి పూర్తిగా జారిపోకుండా తనని తను కాపాడుకున్నాడు_ తాతయ్యకి మనఃక్షోభ లేకుండా చేశాడు. అంతకంటే కావాల్సిం దేవిఁటి?" అంది అరుణ.

"ఆ త్రాగుడు మానేశాడు గాబట్టే, మావయ్య మొహంలో కొత్తకాంతి వచ్చినట్టుంది కదక్కా" యదాలాపంగా అంది శారద.

"ఏవిఁటే, అప్పుడే వర్ణనలోకి దిగిపోతున్నావు?" చెల్లెలి కేసి చిలిపిగా చూస్తూ నవ్వుతూ అంది అరుణ.

శారదకి సిగ్గూ, కోపం ఒకేసారి వచ్చాయి. ఆ మధ్య తను మావయ్యపట్ల సానుభూతి ప్రకటిస్తే, అక్క అన్న మాటలు జ్ఞప్తికి వచ్చాయి.

"ఏవిఁటక్కా నువ్వు మరీను!" చిన్న బుచ్చుకున్నట్టు మూతి బిగించుకుంది.

"పోనీలేవే! మరేం అనను....సరా?" అంటూ నవ్వేసింది తేలిగ్గా అరుణ.

శారద మరింకేమీ మాట్లాడలేదు. చెల్లెలిపసితనానికి, అరుణ నవ్వుకుంది.

* * *

# 8

ఇంగ్లీషు లెక్చరర్ క్లాసులోపల అడుగు పెట్టాడు.

"క్రొత్తగా వచ్చాడేవిఁటే పద్మా, ఈయన ?" అంది శారద, పక్కనే వున్న పద్మతో.

"ఔనే! మొదటున్న లెక్చరర్ మూర్తిగారికి అకస్మాత్తుగా జబ్బు చేసిందట, ఆయన స్థానే యీయనొచ్చారు ... పదిరోజులవుతుంది... పేరు ఆనందరావుగారు. పాఠాలు మాత్రం చాలా బాగా చెబుతున్నారులే ! లాంగ్వేజీలో మాంచి కమాండ్ వుంది" జవాబిస్తూ; అతని పేరు, టీచింగ్ కపాసిటీ కూడా వ్యక్తపర్చింది.

శారద, మరికేం ప్రశ్నలు వెయ్యలేదు.

ఆనందం హుందాగా వచ్చి, టేబిలుముందు నుంచొని చప్పున చూసే వాళికి ఆకర్షణీయంగా అగుపిస్తాడు. టెర్లిన్ పాంట్‌లో టెర్లిన్ షర్టు టక్ చేసి, నీలంరంగు 'టై' కట్టుకున్నా డారోజు. ఎంతో వుత్సాహంగా కన్పిస్తున్నాడు. మాట్లాడేటప్పుడు, యేదో ఆలోచిస్తున్నట్టుగా అప్పుడప్పుడు కళ్ళుమూసుకోవడం అతనికి అలవాటు. సిన్సియారిటీగలవ్యక్తి. ఆ కాలేజీకి వచ్చిన ఈ కొద్ది దినాలకే, చాలా మంది అభిమానాన్ని సంపాదించాడంటే, అతిశయోక్తిలేదు.

పాఠం ప్రారంభించే ముందు, ఓ సారి చుట్టూ కలయ

జూశాడు. అతని దృష్టి శారదపై కేంద్రీకరించింది. ఆమెను చూడ్డం యిదే ప్రథమం అతనికి.

"మీరు యీ రోజే వచ్చారా?" అన్నాడు ఆమెను వుద్దేశించి.

శారద లేచినుంచుంటూనే 'ఔను సార్' అంది.

"ఈ మధ్యను రాకపోవడానికి కారణం?" అడిగాడు.

"మా నాన్నగారు పోయారు..."

"ఓ! ఐసీ...మీ పేరు?"

"శారద..."

"దట్స్ రైట్! కూచోండి..."

కూచుంది శారద.

"ఏమిటే శారదా! లెక్చరర్‌గారు నీ పేరు కూడా అడిగి తెలుసుకున్నారేమిటీ?" మెల్లగా గొణిగింది పద్మ నవ్వుతూ.

"పేరు అడిగి తెలుసుకోవడమూ తప్పేనా యేమిటే? అపార్థాలకీ, అనుమానాలకీ మనల్నే చెప్పుకోవాలి ముందు. అందుకే, మన పురోగమనం యిలా కుంటువడుతోంది..." చిరుకోపంతో అంది శారద.

"పోనీలే! ఇంక వూరుకో! లెక్చరివ్వకు."

ఆనందం పాఠం ప్రారంభించాడు. పద్మ చెప్పింది నిజమే నన్పించింది శారదకి. అతను పాఠం చెపుతూ తన్మయత్వంలో పడిపోతున్నాడు. అందరికీ అర్థమయ్యేలా చక్కని భాషలో

చెబుతున్నాడు. విసుగు, విరామం లేకుండా, యెవరు యే మడిగినా విపులీకరిస్తున్నాడు విషయాన్ని. అందుకే అందరూ అతన్ని అభిమానిస్తున్నారు.

*  *  *

ఒక్కో వ్యక్తికి, ఒక్కొక్కర్ని చూసిన వేళావిశేషం యేమిటోగాని, వారిపై అవ్యాజమైన అభిమానం యేర్పడు తుంది యెక్కువ పరిచయం లేకపోయినాను. ఎందుకలా జరుగుతుందో, ఎవరూ చెప్పలేరు.

ఆనందం విషయంలో అదే జరిగింది. ఎంతోమంది విద్యార్థినులు తన క్లాసుల్లో వున్నారుగాని శారదను చూసిన మరుక్షణంలోనే ఆమెపట్ల అతని కొకవిధమైన అభిమానం యేర్పడింది. అప్పుడామె కేసి చూస్తున్నప్పుడంతా అతని వాక్ధోరణికి యేదో అంతరాయం కలిగినట్టుగా అనిపించే తలపులు వచ్చేవి. సంబాళించుకునేవాడు.

శారద పసిమిరంగులో వుంటుంది. రెండు జడలు వేసు కుని ఓ జడ ముందుకు పడేస్తుంది యధాలాపంగా. పెద్దకళ్ళు, పొందిగ్గా సంపెంగ పూవులా వుండే నాసికా ఆమె మొహానికి నిండుదనాన్ని, అందాన్ని ఇస్తున్నాయి. ఎడమ చెక్కిలి మీదున్న ఆవగింజలాంటి పుట్టుమచ్చ ఆమె అందానికి ఒక ప్రత్యేకమైన మెరుగు పెడుతోంది. అందుకే ఆమె ఆనందంని ఆకర్షించి వుంటుందంటే, అతిశయోక్తి వుండదు.

ఓ రోజు కాలేజీ విడిచిపెట్టే సరికే, వాతావరణం మబ్బుగా వుండి చిన్న చిన్న తుంపర్లు ప్రారంభమయ్యాయి.

పల్చని మేఘాలతో నింగి నిండుకున్న ఆ వా గా అంది.
చూస్తే, క్రమంగా జల్లు అధికం కావచ్చునేమో ం దంటారు
అందుకే శారద వడిగా నడుస్తోంది. రిక్షా కోస ఆనందం.
ం చేసిం దని
ఎక్కడా దొరకనేలేదు ఆరోజు. విసుగుపుట్టి మరీ ప స్కూటర్ అని
నడిచేస్తోంది. క్రమంగా జల్లు అధికం కాసాగింది.
చెయ్యాలో ఆమెకి బోధపడలేదు. ఏ యింటిముందైనా స్కూవు!"
చోవడానికి ఆమెకి మనస్కరించలేదు. అప్పటికే కాస్త తడిసి పోయింది. ఇంక ముందుకు పోవడం యిష్టం లేకపోయింది. ఓ చెట్టు కిందకిపోయి తల దాచుకోవాలన్న ప్రయత్నంలో దగ్గరలో వున్న చెట్టు కిందకిపోయింది. అప్పటికే అక్కడ చాలామంది చేరారు. వారిలో తనూ ఒకతెగా వుండక తప్పలే దామెకి.

కొన్ని నిముషాలు గడిచాయి. జల్లు ఎప్పటికీ తగ్గడం లేదు. ఖాళీ రిక్షాలు కూడా రావటంలేదు. తడుచుకొనిపోతే అక్క కోప్పడుతుం దేమోననే భయమూ వుంది... ఇప్పుడేం చెయ్యడమూ, అనే సందిగ్ధంగా వుంది శారదకి.

చిన్న చిన్న ఉరుములూ, మెరుపులూ ప్రారంభ మయ్యాయి. శారదకి భయం పట్టుకుంది.

అప్పుడే ఆనందం స్కూటర్ మీద అటుగా పోతూ, చెట్టుకింద నుంచున్న అంతమందిలోనూ శారదను చూశాడు. చప్పున ఆపేశాడు స్కూటర్ని.

"ఏం శారదా, రిక్షా దొరకలేదా?" అన్నాడు.

అంతమంది సమక్షంలో ఆయన తనతో యెంతో పరి

చెబుతున్నావ్న వ్యక్తిలా ఆ ప్రశ్న వేస్తుంటే యేవిటోలా అని మడిగినా హిమెకి.
అతన్ని అర్థారకలేదు మాస్టారూ !" మొహం దించుకునే

ఆమెపై చాలా జాలికగినట్టుగా చూశాడు ఆనందం.

షే "నీకేం అభ్యంతరం లేకపోతే నేను 'లిఫ్ట్' యిస్తాను_ మీ యిల్లు కొత్తాగ్రహారంలోనేగా! వచ్చేయ్... రెండు మూడు నిముషాల్లో చేరిపోతావు" అన్నాడు ఉత్సాహంగా.

అతను అంత చనువుగా మాట్లాడం ఆశ్చర్యమేసింది శారదకి. తను యే వీధిలో వుంటున్నదీ అతనికి తెలీడం మరీ వింతగా తోచింది.

"ఏవిటా సందేహం శారదా! చదువుకుంటున్న దానివి... కాస్త నాగరికత అలవర్చుకోవాలి. కమాన్."

అక్కడున్న మిగతా వ్యక్తుల దృక్కులు శారదమీదే కేంద్రీకరించి వున్నయ్. మరీ సిగ్గుపడిపోయిందామె. ఆ క్షణంలో మేష్టారిమీద చెప్పలేనంత కోపం వచ్చింది. అయితే వెళ్ళకపోతే వాళ్ళంతా వేసే ప్రశ్నలకు జవాబు చెప్పలేక చావాలేమోనన్న భయం పట్టుకుంది. అందుకే మారు మాటాడకుండా స్కూటర్ వెనక సీట్లో కూచుంది. స్కూటర్ బుర్ర్ మంటూ కదిలింది. అక్కడున్నవాళ్లు ఎవరి మట్టుకువారే లోలోపల నవ్వుకున్నారు.

"నా ప్రవర్తన అసభ్యంగా వుందంటావా శారదా?" అన్నాడు మెల్లగా ఆనందం.

"ఆ సంగతి మీకే తెలియాలి" విసురుగా అంది.

"మంచికి పోతే, చెడు యెదురవుతుం దంటారు పెద్దలు...కదూ?" మందహాసంతో అన్నాడు ఆనందం.

"స్వార్థంతో చేసేపని యేదీ మంచికోసం చేసిం దని పించుకోదని మీకు తెలీదేమో!" అతను తనకి లెక్చరర్ అని తెలిసికూడాను, కటువుగానే మాట్లాడుతోంది శారద.

"అయితే, యిప్పుడు నాలో స్వార్థం వుందంటావు!"

"అది మీకే తెలియాలి మరి!"

"నాలో స్వార్థ ముందని నువ్వెలా భావించావో చెప్పకపోతే నాకెట్లా తెలుస్తుంది?"

"మీకు తెలీక కాదు. నాచేత చెప్పించాలని మీ తాపత్రయం. నాకేం భయంలేదు చెప్పడానికి. నాఅభిమానం సంపాదించాలనే స్వార్థం మీలో వుంది. మీ మగాళ్ళందరికీ వున్న గుణమే యిది."

ఆనందం చిన్నగా నవ్వుకున్నాడు.

"ఓ! ఇదేనా స్వార్థం! ఒకవేళ ఆ అభిప్రాయం వుందే అనుకో నాలో, అది తప్పా?" చిలిపిగా ప్రశ్న వేశాడు.

అప్పటికే తమ యిల్లు దగ్గర పడ్డం, గమనించింది శారద. మలుపు దగ్గర దిగిపోవడమే మంచిదనుకుంది.

"తప్పొప్పుల పట్టిక తర్వాత మీరేతయారుచెయ్యండి గాని మేష్టారూ, ఆపండిక...దిగిపోతాను..." అంది.

"మీ యింటివరకూ తీసుకుపోవద్దా?"

9)

"ఇంకానయం...మా యింట్లోకి తీసుకువెళ్ళి, మా వాళ్ళకి అప్పజెప్తా మన్నారుకాదు. ఆపండి చాలు."

"అంతేనా?"

"ఈ చిన్న విషయం మీకు అర్థంగాకపోతే, మీరెలా లెక్చరర్‌గా రూపొందారో నాకు బోధపడడంలేదుమేష్టారూ!"

ఆనందం వ్యక్తిత్వానికి దెబ్బతగిలించాయా మాటలు. స్కూటర్ ఆపేశాడు. శారద దిగిపోయి 'వస్తా' నంటూ మలుపు తిరిగింది. ఆమె 'థాంక్స్' యివ్వనందుకు యెంతో బాధపడ్డాడు ఆనందం. ఆమె చరచరా నడిచి పోతూంటే, చూస్తూ క్షణం వుండిపోయాడు. ఆమె వెనుదిరిగి చూస్తుం దేమోనని రెప్పవేయకుండా చూశాడు. లాభంలేకపోయింది. స్కూటర్‌ని స్టార్ట్ చేసి ముందుకు సాగిపోయాడు.

శారద యింట్లో అడుగుపెట్టేసరికి, అరుణ కాఫీ తీసుకుంటోంది.

"తడిశావా?"

"ఎక్కువగా తడవలేదులే అక్కా!"

"రిక్షాలో వచ్చావా?"

"లేదు...అసలు రిక్షా దొరికితేగా?"

"ఏమిటో యివ్వాళ రిక్షాలకే కరువొచ్చింది. నాకూ దొరకలేదు. నడిచే వచ్చాను. సరేలే; నువ్వెళ్ళి బట్టలు మార్చుకురా! ఫ్లాస్కులో కాఫీ వుంది...తీసుకుందువుగాని."

శారద అక్కణ్ణించి వెళ్ళిపోయింది తన గదిలోకి. నడుస్తూ వచ్చి కూడా, పూర్తిగా తడిసియకుండా యెలా రాగలిగిందా అన్న సందేహం అక్కయ్యకు రాకపోయినందుకు

ఆనందించింది. క్షణంలో బట్టలు మార్చుకుని వచ్చి కాఫీ తీసుకుంది అక్కయ్యకు అభిముఖంగా కూచుని.

క్షణం నిశ్శబ్దం. శారద కాఫీ తాగడం ముగించింది.

"చెల్లీ; ఈవాళ ఓ సంఘటన జరిగిందే!" నిశ్శబ్దాన్ని చీలుస్తూ అంది అరుణ.

"ఏవిఁటది అక్కా?" ఆసక్తిగా అడిగింది శారద.

"మా స్కూలు కమిటీలో ఓ డాక్టరుగారున్నారులే! ఈ రోజు ఆయన స్కూలుకి వచ్చారు. అప్పుడప్పుడూ వస్తూ వుండటం, నాతో మాట్లాడుతూ వుండటం కద్దు. అయితే' యీరోజు మాత్రం ! నాతో మాట్లాడుతూన్నప్పుడు' యిన్నాళ్ళూ అతను అనుభవిస్తున్న విరహాన్ని వ్యక్తంచేస్తూ నన్ను వివాహం చేసుకోవడానికి తను సిద్ధంగా వున్నట్టు, నా అంగీకారానికై ఆసక్తితో వేచివున్నట్టూ వ్యక్తీకరించారు" అంటూ ఆగిపోయింది.

శారద ఆసక్తి, ఆతృత పెరిగాయి. అక్క ఆ వివాహానికి అంగీకరించి వుంటుందేమో నన్న నిర్ణయానికి రాబోయి చప్పున అడిగింది.

"మరి, నువ్వేమన్నావు?" కాస్త ముందుకు వంగి, ఆసక్తితో ప్రశ్నించింది.

"మరొకరైతే, అటువంటి అవకాశం కాళ్ళదగ్గరికి వచ్చినందుకు, జారవిడుచుకునే వాళ్ళుకాదు. కారణం డాక్టర్ రఘు యువకుడు. మంచి ప్రాక్టీసు వున్నవాడు... రెండు

చేతులతో ఆర్జిస్తున్నాడు. కాని... కాని... నేను మాత్రం నా అనంగీకారాన్ని తెలిపాను."

ఆశ్చర్యపోయింది శారద.

"అనంగీకారాన్ని తెలిపావా! ఎందుకని?"

అరుణ నవ్వింది.

"పాతకారణమే శారదా! ఇంతకుముందు నాన్నగారు నా వివాహ ప్రసక్తి తెచ్చినప్పుడు నేనెందుకు నిరాకరించానో నీకోసారి చెప్పానుకూడాను కారణం. అదే కారణం వల్ల యిప్పుడూ అనంగీకారాన్ని తెలిపాను. మళ్ళీ నా మనసు మారడానికి కొంత వ్యవధి పడుతుందేమో! అది నామనస్సుకి సంబంధించిన విషయం."

"ఏవిటో అక్కా! నీ ధోరణి నాకేం అర్థం కాలేదు. పాత జ్ఞాపకాల్ని పదిల పర్చుకొని, యెన్నాళ్ళీ విముఖత? ఎప్పటికైనా స్త్రీ వివాహం చేసుకుని సంసారసాగరం యీదవల్సిందే కదా!"

చెల్లాయి మాటలకి నవ్వొచ్చింది అరుణకి.

"ఏవిటే శారదా! అప్పుడే పెద్దఆరిందాలామాట్లాడేస్తున్నావేవిటి? స్త్రీ తప్పనిసరిగ వివాహం చేసుకోవాలన్న నిబంధనగాని, చట్టంగాని యెక్కడా లేదు."

"నిబంధన యెక్కడా లేదనుకో; అయినా..." అని యేదో అనబోయింది గాని, నీళ్ళు నమిలేసింది.

"ఏవిటో చెప్పు మరి..."

"అబ్బే! యేం లేదు. అందరి లాంటి వాళ్ళమే మనమూ నని."

"కాని, వ్యక్తిగతాభిప్రాయాలు కొన్ని వుంటాయి కదా! వివాహం పట్ల విముఖత వున్నప్పుడు, దానిపై సదభిప్రాయం లేనపుడు బ్రహ్మచారిణిగా వుండగలగడంలో పెద్ద యిబ్బందేమీ లేదు."

"సరే! నీ యిష్టం. నీకంటే నేను చిన్నదాన్ని. నీకు చెప్పాల్సిన దాన్ని కాదుకూడాను" అంది శారద.

అరుణ మరింకేమీ మాట్లాడలేదు. తన మనసులో యేమీ దాచుకోకుండా చెల్లాయితో అన్నీ చెప్పాలనుకుని చెప్పిందిగాని, ఆమె తిరిగి తన అభిప్రాయాన్ని ఖండిస్తుందని వూహించలేదు. అందుకే ఆ ప్రస్తావన అక్కడితో ఆపేసింది.

శారద అక్కణ్ణించి లేచివెళ్ళి రేడియో ఆన్ చేసింది.

# 9

మరుసటి రోజు కాలేజీ విడిచిపెట్టాక, శారద యింటికేసి నడుస్తూ బైలుదేరింది. ఉదయంపూట సాధారణంగా అక్క చెల్లెళ్ళిద్దరూ రిక్షాలో బైలుదేరుతారు. అరుణ స్కూలుకి వెళ్ళిపోతే, అక్కణ్ణించి శారద నడిచివస్తుంది కాలేజీకి. సాయంత్రపు వేళల్లో యిరువురూ నడిచే యింటికి

పోతారు విడివిడిగా. అది అలవాటయ్యింది వారికి. రోజూ రిక్షాలకి పొయ్యడం కష్టమే మరి!

శారద రోడ్డుకి పక్కగా నడుస్తూ పోతోంది. ఆమెకి యిటీవల నడిచి వెళ్ళడమంటే కష్టమన్పిస్తోంది. ఇంతకు ముందు స్నేహితురాలు పద్మకూడా వుండేదిగాబట్టి, నడక అంత శ్రమ అనిపించేదికాదు. కాని యిప్పుడామె రావడం లేదు. నెలరోజులకు సెలవుచీటీ మాత్రం పంపించింది. పద్మ వచ్చే వరకూ తనకి యీ ఒంటరితనం తప్పదేమోనని ఆలోచిస్తోంది.

స్కూటరు శబ్దం వినడంతోనే, యెందుకో భయం వేసింది శారదకి. వెనుదిరిగి చూడలేదుగాని స్కూటరు మాత్రం తనని దాసుకుపోతూ అయిదు గజాల దూరంలో ఆగింది. ఆనందం మేష్టారు మందస్మిత వదనుడై ఆమెకేసి చూశాడు. శారదకి వొళ్ళు మండిపోయింది. ఆమె మొహం, కోపంతో యెరుపుదనాన్ని పుంజుకుంది.

"ఏం శారదా, నన్ను చూసేసరికి కోపం వచ్చిందే విటి?" నవ్వుతూనే అంటూ ఆమెకి సమాంతరంగానే నడుస్తున్నాడు ఆనందం.

"కోపమెందుకూ?సంతోషం వుప్పొంగిపోతోంది..." మొహం చిట్లించుకుని అంటూ "అయినా నాకు తెలీక అడుగుతాను మేష్టారూ — మీరు నా వెంటబడి, యెందుకు నన్నిలా బాధిస్తారు చెప్పండి?" అంది విసుగ్గా.

ఆనందం మనస్సు చివుక్కుమంది. శారద తనని యెలా అర్థం చేసుకుంటుందో అవగాహన కావటం లేదు.

"నిన్ను బాధిస్తున్నానా శారదా?" మెల్లగాఅన్నాడు. కృత్రిమంగా చిరునవ్వు తెచ్చిపెట్టుకుంటూ.

"కాకపోతే మరేవిటిచెప్పండి? మీరిలా నాతోపాటు నడుస్తూ, అవకాశం చిక్కించికదా అని పరిచయం చేసుకో ప్రయత్నించడం యేం బావుంది? ఎవరైనా చూస్తే యేమను కుంటారు చెప్పండి?" అంది శారద.

ఆమెకి అక్క విషయం జ్ఞాపికి వచ్చింది. బహుశా ఆమెనుకూడా ఆ వ్యక్తి యిలాగే వెంటబడి పరిచయం చేసు కుని వుండివుంటాడని, ఆమె భావన. అందుకని మరింతకోపం వచ్చిం దామెకి. అసహ్యంకూడా కలిగిం దతనిపై.

శారద భయమేవిటో యిప్పుడర్థమయింది ఆనందంకి.

"ఓ! అదా నీ భయం! చదువుకుంటున్న దానివి; ఇంతగా యీ చిన్న విషయానికి భయపడితే యెట్లా చెప్పు! పరిచయం వుండటం పొరపాటు కాదు. ఇక లోకుల విషయ మంటావా? వాళ్ళకేం—విమర్శించడానికి 'పన్ను' లేదుగా! అందుకే, అదో హాబీ అయిపోయింది వాళ్ళకి. మనంమాత్రం యెవర్నీ విమర్శించకుండామా నేస్తున్నామా? విమర్శిస్తున్నాం. అయితే ఆ తరుణంలో మరేం ఆలోచించడమే మానేస్తు న్నాం. అందుకని, లోకుల గురించి మనం ఆలోచించ వద్దంటాను."

ఆనందం, యెంత నచ్చజెప్పడానికి ప్రయత్నించినా, శారదకి అతనిమీద నమ్మకం యేర్పడ్డంలేదు.

"ఎవరితోనూ నాకు పన్లేదు. కాని మీరంటే నాకస హ్యం" అంది విసురుగా. నిజానికి, అది ఆమె హృదయాంత

గాళ్ళోంచి వచ్చిన మాటకాదు. కేవలం అతణ్ణి నిరుత్సాహ పర్చాలన్న ధోరణిలోనే అంది.

ఆమె కేసి అద్దోలా చూశాడు ఆనందం. ఆమె మన స్ఫూర్తిగ అన్న మాటలు కావని అతనికి తెలుసు.

"నిజంచెప్పు శారదా! నేనంటే నీకు అసహ్యమా?" యెంతో చనువున్నవాడిలా అడిగాడు.

"నిజమే మరి!" తడుముర్కోకుండా అంది శారద.

"అబద్దం. నా కళ్ళలోకి చూసి చెప్పు, ఆ మాట! మనకి వున్న పరిచయం, చాలా స్వల్పమే కావచ్చు. ఒక విధంగా చూస్తే, అది పరిచయ మన్పించుకోదుకూడాను. నా చోరవే! నేనెంతోమంది యువతుల్ని చూశాను. కాని, నీవు నన్నాకర్షించినట్టుగా యెవరూ ఆకర్షించ లేదంటే, నమ్ము తావా? నిన్ను ప్రప్రథమంగా చూసిన క్షణంలో, నాలో కలి గిన భావాలు చెప్పలేను. ఆ క్షణంనుంచీ నీ రూపాన్ని నాలో నింపుకున్నాను. నా మనసు విప్పి చెప్పాలని అవ కాశం కోసంనిరీక్షిస్తున్నాను. నిన్నను నాకా అవకాశం లభిం చినా యేమీ చెప్పలేక పోయాను. నీకోసం యింతగా పరిత పిస్తున్న వ్యక్తిని నువ్వు అసహ్యించుకుంటున్నావంటే, నేను నమ్ముతానా?...లేదు. నేను నమ్మను. చాలారోజులకి నా హృదయంలో ఒక ప్రేమజ్యోతి వెలిగింది. ఆ జ్యోతిని ఆర్పే యకు శారదా! ఇది నా అభ్యర్థన..."ప్రాధేయపూర్వకంగా అంటున్నట్టే అన్నాడు.

"మీ పరిచయాభిలాషకి అర్థం యిదన్నమాట... ఏం మాషారూ?" అతని కేసి తీక్షణంగా చూడాలనే అనుకుంది

గాని, చూళ్లేకపోయింది. అతని ప్రసన్నత వదనం ఆమెను బంధించేసింది.

"నిజం శారదా! నా మనసులోని మాట చెప్పేశానుగా! ఇందులో రహస్యమేం లేదు."

"మగాళ్ళకేమీ రహస్యాలుండవు...కాని, అంతా అబద్ధ జీవితం" అక్కసుగా అంది అక్కయ్య విఫలప్రేమను గుర్తులో వుంచుకొని.

"అదేవిటలా దాడిచేస్తున్నావు మగాళ్ళమీద?"అతని కో సందేహం వచ్చింది, ఆమె యింతకుముందే యెవరినో ప్రేమించి మోసపోయిందేమోనని.

"స్వానుభవమని మీరు సందేహ పడకండి. కాని, విన్న విషయాన్నిబట్టి చెప్తున్నాను. మగాళ్ళదంతా మోసం."

"అదే కూడదు. ఎవరో మోసగాళ్లున్నారని అందర్నీ ఆ కోవకే చేర్చడం భావ్యంకాదు శారదా! ఎవరి వ్యక్తిత్వం వారిది. ఆడవాళ్ళలోమాత్రం మోసగత్తెలులేరా? వున్నారు... అలా అని అందర్నీ ఆ కోవకే చేర్చితే యెలా?"

"పోనీలెండి మేష్టారూ! ఇక్కడితో మీవాదంచాలించి నన్నిలా ఒంటరిగా పోనివ్వండి" అంది కాస్త బెరుకుగా. అక్కయ్య యీరోజు స్కూలుకి వెళ్ళడం లేదుగాబట్టి సరి పోయిందిగాని, లేకుంటే ఆమె స్కూలునుండి ఈ సరికి తిరిగి వస్తూ తమనిచూస్తే యేమనుకుండేది?...అనుకుంది శారద.

ఆమెను యింక విసిగించడం యిష్టంలేక పోయింది ఆనందంకి.

"సరేలే శారదా! పోనీ మీ యింటి మలుపుదగ్గర 'డ్రాప్' చేస్తాను వస్తావా?" అన్నాడు వుండబట్టలేక.

శారద ఈసారిమాత్రం తీక్ష్ణంగా చూసింది. ఆమె దృక్కులు విద్యుత్తులా అతన్ని తాకాయన్నా అతిశయోక్తి లేదు.

"మేష్టారూ! నిన్నను యేదో ఆ వాతావరణం నుండి బైటపడాలనీ ఒకవేళ నేనా సమయంలో నిరాకరించిన పక్షంలో మీరు వెళ్ళిపోయినా అక్కడున్నవాళ్ళంతా నన్ను ప్రశ్నలతో చూపులతో చిత్రవధ చేస్తారనే తలంపుతో మీతో వచ్చాననీ—రోజూ యిదే పొరపాటు చెయ్యకండి ...సెలవ్..." అంటూ నడక వేగాన్ని హెచ్చించింది.

ఆనందం ఒక్క నిట్టూర్పు విడిచి స్కూటరు స్టార్టు చేశాడు.

"వస్తా శారదా!" అంటూ వెళ్ళిపోయాడు.

శారద పెద్ద ఆపదనుండి బైటపడినట్టుగా తృప్తిగా నిశ్వాసం వదిలింది. అంతలోనే ఆమెకి ఆనందం మాటలన్నీ నెమరుకి వచ్చాయి. అతని ధోరణికి ఆమె లోలోన నవ్వుకోకుండా వుండలేక పోయింది. అప్రయత్నంగా ఆమె కళ్ళ ముందు ఆనందం రూపం లీలగా మెదిలినట్టు ఫీలయ్యింది. తాను యెంత కోపం ప్రకటిస్తున్నా; అతనిపట్ల అసహ్యాన్ని వెల్లడి చేస్తున్నా అంతంలేని ఓ సన్నిహితమేదో అతని గురించి ఆలోచింపజేసోంది. అదో వింతలా తోచింది శారదకి. తాను

ఆనందం మేషాన్ని ప్రేమించడం లేదుకదా? ఆ సందేహం ఆమెలో కలిగిందంటే ఆశ్చర్యంలేదు. తనలో ఏదో బల హీనత లేకపోతే నిన్నను అతని స్కూటర్ మీద పోవడం; ఈరోజు అతనితో మాట్లాడడం యేమిటి? అతనిపట్ల నిజంగా ద్వేషమే వుంటే పబ్లిక్ రోడ్డుమీద అతణ్ని అవమానపర్చి వుండేదిగా!...ఇవన్నీ ఆలోచిస్తుంటే శారదకి ఒక్కసారి శరీరమంతా కంపించింది. ఇక తాను ఈ బలహీనతకు లోను కాకూడదు...అనుకుంటూ ఏవిధమైన ఆలోచనలూ సాగించ కుండానే వడివడిగా నడిచిపోయింది శారద.

శారద యింట్లో అడుగుపెట్టేసరికి తాయారు యెదు రుగా వచ్చింది. ఆమె మొహం చూస్తూనే దిగులు పడింది శారద.

"ఏం యిలా వున్నావు తాయారూ ? అక్కకి వంట్లో యెలావుంది?" అడిగింది ఆత్రంగా. తాను బైలుదేరేసరికి ఒంట్లో నలతగా వుందని చెప్పింది అక్క. అందుకే ఆ ప్రశ్న వేసింది.

"జ్వరం విపరీతంగా వుందమ్మా శారదా ! నిన్నను తడిచారుగా మరి—అందుకే వచ్చిందో యేమో! ఎందుకైనా మంచిది—వెంటనే డాక్టర్ని రప్పించితే బావుంటుందని అను కుంటున్నాను..." అంది తాయారు.

శారద మొహం మ్లానమయింది. హఠాత్తుగా తండ్రి గుర్తుకొచ్చాడు. నాన్న బ్రతికుండగా యే చీకూ చింతా వుండేదికాదు. ఒకవేళ యెవరికైనా వంట్లో బాగులేకపోతే

ఆయనే వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చేవారు దగ్గరుండి. ఇప్పుడలా తీసుకొచ్చే వాళ్ళింక యెవరున్నారు? వెళ్తే తను వెళ్ళాలి— లేకుంటే తాయారు వెళ్ళాలి. మగదిక్కంటూ లేకపోతే యిటువంటి సమయాల్లో కాస్త యిబ్బందిగానే వుంటుం దేవిటో నన్పించిందామెకి. ఈ అనుకోవడంకంటె అక్కయ్య అనారోగ్యం మరీ కలవర పర్చింది.

"తాయారూ, నువ్వెళ్ళి మన డాక్టరుగారిని రమ్మని చెప్పు... తెలుసుగా?"

"తెలీకేమమ్మా! సుబ్బారావు గారే కదూ?"

"ఔను! వెళ్ళి వేగిరం రా!" అంటూ పుస్తకాలు అక్కడేవున్న టేబులుమీదికి గిరాటువేసి లోపలికి వెళ్ళింది చరచరా.

"అక్కా! ఎలావుంది ?" అంటూ మంచంమీద కూచుంటూ అడిగింది.

అరుణ భారంగా కనురెప్ప లెత్తుతూ:

"నిన్నను తడిశానుగా! జ్వరమొచ్చింది..." అంది హీన స్వరంతో.

శారద కేడుపొచ్చినట్లయింది. ఒక్కసారి అక్కయ్య యెలా నీరసించి పోయింది?...అనుకుంది ఆమెను అట్టే మాట్లాడించడం యిష్టంలేక మౌనంగా అక్కడే కూచుంది.

కొద్దిసేపటికి డాక్టర్ సుబ్బారావు వచ్చాడు. అరుణని పరీక్షించాడు. 'ఎప్పట్నుంచి జ్వరం?' ప్రశ్నించాడు. ఆరోజే వచ్చిందని చెప్పింది శారద.

"నిన్నను వర్షంలో తడిసిం దేమిటమ్మా?" అన్నాడు.

"ఔనండీ!"

"ఫరవాలేదులే అమ్మా; ఏం కంగారు పడకు. అయితే నయమయ్యేసరికి కొద్దిరోజులు పడుతుంది. మంచిపని చేశావు— వెంటనే నా కోసం కబురు పంపావు" అంటూ యింజక్షను తయారుచేసి యిచ్చాడు.

"మందుకోసం పంపించు ఎవర్నయినా...యిస్తాను."

"ఇంకెవరొస్తారండీ? మా తాయారే వస్తుంది..."

"సరే! ఆమెనే పంపు. నువ్వుమాత్రం రెండురోజులు కనిపెట్టుకుని వుండు... సరిగ్గా వేళకి మందివ్వాలి. నేను వివరాలన్నీ కాగితమ్మీద రాసిస్తానే" అంటూ నిష్క్రమించాడు డాక్టర్ సుబ్బారావు. తాయారు అతనితోపాటు వెళ్ళింది మందుకోసం.

"డాక్టర్ మరేమన్నాడే శారదా?" మెల్లగా అడిగింది అరుణ. డాక్టర్ చెప్పింది ఆమె వింటున్నా మరోసారి తెలుసుకోవాలన్న తాపత్రయంతో అడిగింది.

"ఏం భయపడ నవసరం లేదన్నాడు."

"నేను చావుకి భయపడ్డం లేదే! నీకోసమే బెంగ పడు న్నాను..." అంది చెల్లాయి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

శారద కళ్ళు నీటి పర్యంత మయ్యాయి.

"ఛా! యివేం మాటలే అక్కా! కొద్ది దినాల్లో నయమై పోతావు ఫరవాలేదు" అంది శారద.

అంగా అనోలా నవ్వుకుంది... అది జీవంలేని నవ్వు. ఇప్పుడే మొందు కామె కా నిరాశో అర్ధంకాదు. నిజంగా అది తెలివి హీనతే!

# 10

మాధవరావు వ్యాపారం బాగానే సాగుతోంది. వ్యాపారం ప్రారంభించి యెక్కువ రోజులు కాకపోయినా చాలామంది అభిమానాన్ని సంపాదించడమే గాకుండా సరస మైన ధరలకు సామాగ్రి అమ్ముతున్నాడనే నమ్మకాన్ని పెంపొందించుకున్నాడు.

ఆరోజు దుకాణం మూసుకుని యిల్లు చేరుకునే సరికి తొమ్మి దయ్యింది. గంగాధరం యిప్పుడే భోజనం ముగించి చుట్టకాల్చుకుంటూ బైట వాలు కుర్చీలో కూర్చున్నాడు. కొడుకు రాకకోసం అతనూ యెదురు చూస్తుండటం వల్ల, కొడుకు రాగానే—

"శారద ఉత్తరం రాసిందిరా!" అన్నాడు.

ఎప్పుడైనా అరుణే ఉత్తరాలు రాసేది. ఇప్పుడు శారద రాయడానికి కారణం యేమిటో మాధవరావుకి బోధ పడలేదు.

"ఏమిటి రాసింది నాన్నా?"

"అరుణకి బాగులేదట."

మాధవరావు నిశ్చేష్టుడయ్యాడు. పిడుగుపాటులా విన్పించిందా మాట.

"ఏమిటా బాగులేక పోవడం నాన్నా?"

"అదేం రాయలేదు... ఒంటరిగా తనకేదో భయంగా వుందంటూ నన్ను రమ్మని రాసింది. ఇక్కడి వ్యవహారాలు చూస్తే, అడుగు కదపటానికి వీల్లేదు. వాళ్ళ పరిస్థితిని తల్చుకుంటే నాకే హృదయం ద్రవించి పోతోంది. ఆడపిల్లలు... వాళ్ళెలా వుంటున్నారో యేమిటో భయంగావుంది. ఏమిటి చెయ్యడమో నాకేం బోధపడంలేదు. పోనీ ఓలా చెయ్యరా! నువ్వు వెళ్ళి అక్కడి స్థితిగతులు అవగాహన చేసుకుని నాకు తరం రాయకూడదూ? నేను రావడం అంత అవసరమైతే యిక్కడి వ్యవహారాలన్నీ వదులుకొని వస్తాను. ఏమంటావ్?" గంగాధరం అన్నాడు.

తనే వెళ్ళా లనుకుంటుండగా తండ్రి కూడా తన అభిప్రాయానికి దోహదమిస్తుండే సరికి: యెంతో సంతోషం కలిగింది మాధవరావుకి. ఈ పరిస్థితిలో అరుణకి దగ్గరగా వుండక పోతే, ఒక్క శారద, అదీ అబల___ ఏం చెయ్యగలదు?

"అలాగే నాన్నా! రేపు ఉదయమే బైలుదేరు తాను..." అన్నాడు.

తృప్తిగా నిశ్వాసం విడిచిపెట్టాడు గంగాధరం.

"ఎంత చెప్పినా వాళ్ళిద్దరూ విన్నారుకాదు, మనతో వచ్చి వుండమంటే! అంతకంటే మనం మాత్రం యింకేం

చెయ్యగలం? ఇప్పుడు చూడు_ మగదక్షత లేకుండా యెన్ని చికాకులు పడుతున్నారో యేమిటో !" బాధగా అన్నాడు గంగాధరం.

"నిజమే నాన్నా! కాని వాళ్ళు గ్రహించాలి ఆ విషయాన్ని. అదే జరగలేదు... ఏం చేస్తాం మరి? నేను వెళ్ళి అక్కడి పరిస్థితులు సవిస్తరంగా రాస్తాను" అన్నాడు మాధవరావు.

గంగాధరం వాలుకుర్చీ వెనక్కి జేరబడి, తృప్తిగా గట్టిగా ఓ సారి పొగపీల్చాడు. మాధవరావు లోలికి వెళ్ళిపోయాడు.

* * *

శారద కాలేజీకి వెళ్ళడంలేదు. ఆమె దగ్గర లేకపోతే అక్క మరీ, బెంగపెట్టుకుంటుందని భావించింది. అందుకే పది రోజులపాటు సెలవు పెట్టింది.

శారద కనిపించకపోవడం, ఆనందంకి అంతులేని నిరుత్సాహం కలిగింది. అతనిలో విరహం నాందీగీతం పాడింది. రోజూ ఆమె అగుపిస్తుందేమోనని అదే వీధిలోంచి వెళ్ళడం ప్రారంభించాడు సాయంత్రపు వేళల్లో. కాని, లాభం లేకపోయింది. శారద ఒక్కరోజుకూడా అగుపించలేదు. ఈ కొద్ది రోజులూ, కొన్ని యుగాలుగా గడిచాయి ఆనందంకి. అందుకే నాలుగోరోజు ఆమెను యెలాగైనా కలుసుకోవాలనుకుని నిర్ధారణ చేసుకున్నాడు.

సాయంకాలం ఆరుగంటలు కావస్తోంది. ఇంకా చీకటి పడలేదు. స్కూటర్‌ని అక్కడే స్టాండు వేసి, యింటి ముందు నుంచుని, కేక వేశాడు ఆనందం. ఇంట్లోంచి యెవరు వస్తారో, యేమిటోనన్న ఆతృత, ఆందోళన అతనిలో లేకపోలేదు. నిజానికి ఆమె కుటుంబ వివరాలేమీ అతనికి తెలీవు. తల్లి దండ్రులున్నారో లేదో, అన్నదమ్ములున్నారో, అక్కచెల్లెళ్ళున్నారో యివేమీ తెలీవు. అవన్నీ తెలుసుకోవలసిన అవసరమూ రాలేదు_ అవకాశమూ చిక్కలేదు. అవేమీ తెలుసుకోకుండా యిలా చొరవతీసుకొని రావడం, పొరపాటే అయిందేమో ననుకున్నాడు... వెనక్కి తిరిగి పోదామను కుంటూండగా తాయారు వచ్చింది లోపల్నించి. ఆమె ఎవరో వూహించుకోలేక పోయాడు.

"ఎవరు కావాలి బాబూ?" అంది తాయారు.

"శారద వుందాండీ?" కాస్తంత తడబడుతూనే అడిగాడు.

తాయారు విస్తుపోయింది. తనెదుటనున్న వాడు యువకుడు...చదువు, సంస్కారమున్న వాడు. అటువంటి వాడు శారద గురించి అడగడం, ఆమెలో సందేహాన్ని రేకెత్తించింది. శారద, చాలా ముభావంగా వుండే వ్యక్తి. అలాంటి శారద యెవరితోనైనా పరిచయం చేసుకుంటుందని, చప్పున నమ్మలేకపోయింది తాయారు.

"శారద మీకెలా తెలుసునండీ?" అంది తాయారు అదోలా చూస్తూ. చెప్పిందేదో వినేసి, చప్పునపోయి శార

దను పంపుతుందనుకున్న వ్యక్తి, యిలా యెదురు ప్రశ్న వేసే సరికి, ఆనందంకి పచ్చివెలక్కాయ గొంతులో పడింది. గుటక మింగాడు. అప్పుడే పాలభాగంమీద చిరుచెమట మెల్ల మెల్లగా చోటు చేసుకుంటోంది...కొద్దిగా కంగారుపడినా, చప్పున తమాయించుకొని, ధైర్యాన్ని కూడగట్టుకున్నాడు.

"నేనామె మేష్టార్ని లెండి... కాలేజీకి యెందుకు రావడంలేదో తెలుసుకుందుకు వచ్చాను."

"ఓ! అలా చెప్పండి...వచ్చి కూచోండి..." అంది వుత్సాహంగా.

"ఫరవాలేదు లెండి...పిలవండామెను..." అన్నాడు స్మితపడి.

తాయారు లోపలికివెళ్తుంటే, శారద యెదురుపడింది అక్క గదిలోంచి వస్తూ.

"శారదా! మీ మేష్టారట...వచ్చారు. వెళ్ళమ్మా" అంది తాయారు.

శారదకి గుండె ఆగిపోయినట్టయింది! వచ్చింది, ఆనందం మేష్టారే అయుంటుందని వూహించేందుకు ఆమెకి యెక్కువసేపు పట్టలేదు. అతని చొరవకి, యెంతో కోపం వచ్చిందామెకి. అయితే ఆ కోపాన్ని ఏవిధంగానూ తాయారు సమక్షంలో వ్యక్తం చెయ్యలేదు.

"సరే, ..నేను వెళ్తానుగాని, నువ్వు మాత్రం అక్కయ్యకి హార్లిక్స్ కలిపి యివ్వు."

"అలాగే నమ్మా!" తాయారు వెళ్ళిపోయింది.

శారద వీధి ద్వారందగ్గరికి వచ్చింది. ఆనందం, ఆసక్తిగా చూస్తూ నుంచుని వుండటం గమనించింది. శారదను చూడంతోనే, ఆనందం మొహంలో వింత తేజస్సు ప్రజ్వరిల్లింది. మందహాసం చేశాడు. ఆమెమాత్రం మూతిముడుచుకునే వుంది.

"సెలవు పెట్టావేం శారదా? ఏమయింది?" మెల్లిగా ప్రశ్నించాడు.

"నా సెలవు మాటకేంగాని, మొదట మీరు చెప్పండి మేష్టారూ—యిక్కడికి యెందుకొచ్చారు?" విసురుగానే అడిగింది.

ఆనందం మొదటే వూహించాడు, శారద తప్పకుండా కోపగించుకుంటుందని. అందుకే ఆమె ప్రశ్న విని ఆశ్చర్యపోలేదు. చిన్నగా మందహాసం చేశాడు.

"ఎందుకొస్తాను శారదా? నీకు మాత్రం తెలీదూ? నువ్వు కనిపించకపోయేసరికి, రోజూ ఒక యుగంగా గడుస్తోందంటేనమ్ము. ఈ మూడు నాలుగు రోజులూ యీ వీధినే వస్తూ పోతున్నాను...నువ్వు అగుపిస్తావేమోనన్న ఆశతో మీ యింటివేపు చూసేవాణ్ణి. ఆఅదృష్టం నాకు కలగలేదు. చివరికి యీరోజు ధైర్యం చేసుకుని, స్వయంగా వచ్చాను—"

అతని పిచ్చి ధోరణికి శారద లోలోన నవ్వుకుంది. అయినా తన బలహీనత బైటపడకూడదని నిశ్చయించుకుని—

"ఉద్ధరించారులెండి. నాకోసం మీ రిలా రావడంలో, మీ ఆంతర్యం కనిపించడంలేదూ?"

"పొరపాటు యెందుకవుతుంది శారదా?"

"క్షొనుమరి! నా గ్రహపాటు అవుతుంది గాని, మీ పొరపాటెందుకవుతుంది? మీరు రావడం మా అక్క చూస్తే, యేమనుకుంటుందో ఆలోచించారా?" వెటకారంగా అంది శారద.

ఆనందం యిప్పుడు అర్థం చేసుకున్నాడు — శారదకి పెద్ద దిక్కు 'అక్కే' నని. కాస్త ధైర్యమొచ్చింది. అయినా, అడిగి తెలుసుకోవడం మంచిదనిపించింది.

"అంటే, మీ అమ్మా, నాన్నా..." సంధిగ్ధంలో నీళ్ల నమిలేశాడు. అలా అడిగితేనే సమస్యా పూరణలా జవాబు సన్యంగా దొరికిపోతుం దనుకున్నాడు.

"అమ్మా, నాన్నా లేరు...వారిలో ఏ ఒక్కరు సజీవంగా వున్నా, మీ రింత ధైర్యంగా వచ్చేవారేనా? వచ్చినా తగిన శాస్తితో తిరుగు ముఖం పట్టేవారు. అయినా, ఇదేం అన్యాయం చెప్పండి? మీ రెంత లెక్చరర్ అయినా మీ స్టూడెంటు వెంటబడి అల్లరిచెయ్యడం బావుందా చెప్పండి?"

"అల్లరి చేశానా?" కలవరపాటుతో అన్నాడు ఆనందం.

"ఇది అల్లరి కాక మరేవిటి?"

"అలా నువ్వనుకుంటే, యింక నేనేం చేసేది? నీ అందానికి తగ్గ సున్నిత హృదయాన్ని భగవంతుడు నీకు ప్రసాదించ నందుకు నే నెంతో విచారిస్తున్నాను. స్త్రీజాతి అంతా యెప్పుడూ మగవాళ్ళనే కఠినహృదయులని నిందిస్తుంది

గాని తనలోని కాఠిన్యతను చెప్పుకుంటారా? అదే శోచనీయం. సరేగాని నువ్విప్పుడెందుకు సెలవు పెట్టావ్?"

"తెలుసుకోవడం, అంత అవసరమంటారా!"

"మొదటే చెప్పాను దానికి కారణం! పోనీ, తోటి మానవుడితో నీ కష్టసుఖాల్ని చెప్పుకోవడంలో తప్పేవిటి?"

— "తేటలన్నీ యిక్కడే ఉపయోగించేస్తే రేపేంటి మేష్టారూ?"

ఆనందంకి యీ మాట కాస్త చుర్రు మన్పించింది.

"చాలా తేలిగ్గా మాట్లాడుతున్నావు శారదా?" కొద్దిగా చిన్నబుచ్చుకున్నట్టుగా మొహంపెడుతూ అన్నాడు.

శారదకి, ఆ క్షణంలో జాలివేసింది అతనిపై. ఇంతా శ్రమతీసుకుని వచ్చినవ్యక్తికి, తను సెలవుపెట్టడానికిగల కారణం ఏవిటో చెబితే తప్పేవిటి?... అనుకుంది.

"క్షమించండి మేష్టారూ! మా అక్కకి బాగులేదు. అందుకే, నేను సెలవు పెట్టి యింట్లో వుండాల్సి వచ్చింది" అంది మెల్లగా.

ఆమె అంత సౌమ్యంగా సమాధానం చెప్పినందుకు, మురిసిపోయాడు ఆనందం మనసులో.

"ఓ! అలాగా! ఏవిటా బాగు?"

"అడిగోండి... ప్రశ్నలు పెరిగిపోతున్నాయి..."

"ఇదీ తప్పేనా? సాటిమానవుణ్ణి కష్టాల్లోఆదుకోవడం, ప్రతీమానవుని కర్తవ్యం. నేను సహకరించగల్గింది, ఏమైనా వుందేమోనని అడిగానంతే!"

"ధన్యవాదాలు... ప్రస్తుతానికి ఆ అవసరం రాలేదు లెండి..."

"అయితే, సంతోషమే!"

"నాకు చాలా పనుంది... మీరిక వెళ్ళొచ్చు.. " అంటూ వెనక్కి తిరిగింది శారద.

"శారదా!" మెల్లగా సంబోధించాడు. ఆ పిలుపులో అమృతం కురుస్తోంది.

"ఏమండీ?"

"ఒక్కమాట..."

"చెప్పండి."

"కారణం లేకుండా, ఏదో నేను తప్పు చేసినట్టుగానే, నా మీద రుసరుస లాడుతూవుంటే, నా కెలాగో వుంది. అప్పుడప్పు డనిపిస్తుంటుంది– ఉద్యోగానికి రాజీనామా యిచ్చి నీకు దూరంగా, నీ ఆలోచనలుకూడా రాని వాతావరణంలోకి పోవాలనిపిస్తుంది. నేనేం తప్పు చేశానని నాకీ శిక్ష చెప్పు?" ప్రాధేయ పూర్వకంగా అన్నాడు ఆనందం. అతని స్వరం రెండు మూడుచోట్ల కంపించింది.

శారద జవాబు చెప్పలేదు. కాని, తెల్లని నవ్వు నవ్వుతూ ముందుకి సాగిపోయింది.

ఆనందం హృదయం, వెన్నెలతో నిండిపోయింది. తన ప్రేమ దేవత కరుణించినందుకు ఉప్పొంగిపోతూ వెనక్కి తిరిగాడు ఉత్సాహంగా.

"ఛూాండడి మేష్టారూ!" మళ్ళీ వచ్చింది శారద.

"ఏవిటి శారదా!" ఈసారి అతని స్వరమే ఒక ప్రేమగీత మయింది.

"ఇకమీదట యింటికి రాకండి. ఇది నా అభ్యర్థన. మరో నాలుగయిదు రోజుల్లో వచ్చేస్తాను కాలేజీకి."

"ఓ. కే." అంటూ చెయ్యి గాలిలో తేలుస్తూ, నిండుగా నవ్వేడు ఆనందం.

శారద వెళ్ళిపోయింది— ఆనందం స్కూటరూ కదిలింది ఉత్సాహంతో ఉరకలు వేస్తూ.

శారద తిన్నగా అక్కగదికే వెళ్ళింది. అరుణకి ఇప్పుడు కాస్త నయంగావుంది. దిండును మంచంమీద యేటవాలుగా వేసి లేచి కూచుంది.

"ఎవరే శారదా?" అంది అరుణ.

"మా లెక్చరర్ లే అక్కా!"

"ఎందుకు వచ్చాడట...?"

"నేను సెలవు పెట్టానుగా; నాకేవిటయ్యిందో నని ఆతృతకొద్దీ యింటికిపోతూ వచ్చారు..."

"చాలా మంచివాడిలా వున్నాడు..."

"ఆ! మంచివారే ఆయన... సరేగాని, హార్లిక్స్ తీసుకున్నావా?" ప్రస్తావన చప్పున మార్చేసింది.

"ఆ! తీసుకున్నాను... తాతయ్య దగ్గర్నించి ఉత్తరం మరి లేదుకదూ?"

"రాయడమే ఆలస్యమయిందా మరి! రేపో మాపో వస్తుంది. ఆయన ఉత్తరాలు రాయడంలో జాప్యం చెయ్యరు."

"ఏమో లే! తాతయ్యే వస్తారేమో!"

"అదీ అవ్వొచ్చును..."

"అన్నట్టు, డాక్టరేమంటున్నాడు?"

"మరేం కంగారు పడనవసరం లేదంటున్నాడు."

"నా సెలవుచీటీ పంపినట్టేనా స్కూలుకి?"

"పంపేశా!"

"మళ్ళీ సెలవు పొడిగించాల్సి వస్తుందేమోలే! ఏమిటో చాలా నీరసంగావుంది."

"సెలవు పొడిగిస్తావు_ దానికేం?"

తాయారు వచ్చింది.

"శారదమ్మా! వచ్చి భోజనం చేసెయ్యకూడదూ?"

"అప్పుడేనా?"

"మీకు అలవాటే కదమ్మా!"

"ఔనే! కొత్తలా అడుగుతావేం? ఏమయ్యిం దీవేళ? వెళ్ళి భోజనంచేసి రా!" అంది అరుణ.

శారద చిరునవ్వు ఒలకబోస్తూ అక్కణ్ణించి జారుకుంది తాయారు వెంట.

# 11

మాధవరావు వస్తూనే అరుణవుండే గదిలోకి వెళ్ళాడు. అక్కచెల్లెళ్ళిద్దరూ అతణ్ణి చూసి విస్తుపోయారు___ కనీసం ఉత్తరమైనా రాయకుండా యింత హఠాత్తుగా యెందు కొచ్చాడా అని.

"ఇదే రావడమా మావయ్యా?" అంది శారద.

"ఔను శారదా! నిన్ననే నువ్వు నాన్నకి రాసిన ఉత్తరం అందింది. అరుణకి బాగులేదని రాశావుగా! అది తెలుసుకున్నాక నాన్న మరీ కంగారు పడ్డారు. ఆయనే స్వయంగ రావాలనుకున్నారుగాని యేవో తప్పనిసరి కారణాలవల రాలేకపోయారు. నన్ను పంపించారు యిక్కడి పరిస్థితులు తెలుసుకొని రమ్మని" అంటూ అరుణకేసి తిరిగి "ఏం అరుణా, యెలావుంది యిప్పుడు నీ వంట్లో?" అన్నాడు.

"ఈ రోజుకి, కాస్త నయంగా వుందిలే మావయ్యా!"

"మేం అదే గాభరా పడ్డాం. మగదక్షత లేకుంటే, యిటువంటి పరిస్థితుల్లో మరీ యిబ్బందిగా వుంటుంది. నాన్న అదే అంటారు—— మీరు అక్కడికి వచ్చేస్తే యెవరికీ యీ ఆత్రుతలూ ఆరాటాలూ, వుండేవికావని. కాని, మీరు వినిపించుకున్నారు కాదు."

"ఇప్పుడైనా యిబ్బంది యేమిటి మావయ్యా! తాయారు వుందిగా!" అంది శారద, తమ బలహీనతను బైట పెట్టుకోవడం యిష్టంలేక.

"అయినా సరే... యెందుకే చికాకులు చెప్పు...?"

"ఏ చికాకులూ లేవు. మేం హాయిగానే వున్నాం..." మళ్ళీ అంది శారద.

అరుణ అంతా వింటోంది మౌనంగా. మాధవరావు, యింకా ఆ విషయాన్ని గుచ్చిగుచ్చి చెప్పడం అర్థం లేదను కున్నాడు.

అయితే అరుణా: ఏవిఁటి నీకు బాగులేక పోవడం?" అన్నాడు.

"అబ్బే ఏమీ లేదు. ఓ రోజు వర్షంలో తడిశాను కాస. మరునాటినుంచీ జ్వరం... అయితే మొదటి రోజు మాత్రం తీవ్రంగా వుంది జ్వరం. నాకు చైతన్యంకూడా లేక పోయినట్లయిపోయింది. అది చూసి, చెల్లెలు మరీ గాభరా పడింది. అందుకే, తాతయ్యకి ఉత్తరంరాసింది" అంది అరుణ.

"రాయడంలో తప్పేం లేదనుకో! పోనీ, ఇప్పటికైనా పరిస్థితి గ్రహించి అక్కడికి వచ్చేయకూడదూ అరుణా?" అన్నాడు.

"ఆ తలంపే ప్రస్తుతానికి లేదు మావఁయ్యా!"

"సరే!" అనేశాడు, మరేం మాట్లాడకుండా.

"శారదా! వెళ్ళి మావఁయ్య కోసం కాఫీ తీసుకు రావే!" అంది అరుణ. శారద అక్కణ్ణించి నిష్క్రమించింది.

"నీ వ్యాపారం ఇప్పుడెలా సాగుతోంది మావఁయ్యా" ప్రశ్నించింది అరుణ.

"బాగానే వుంది. ఈ రోజుల్లో వ్యాపారమే లాభ సాటిగా వుంది— డబ్బుం టేసుమా! ఉద్యోగాల్లో ఏముంది లే

వత్తి బానిసత్వం తప్పించి" ఉత్సాహంతో చెప్పాడు మాధవ రావు.

"ఈ కొన్ని రోజుల అనుభవంతో, అప్పుడే యీ నిర్ణయానికి వచ్చేశా వన్నమాట...!"

"ఔను అరుణా! కాస్త జాగ్రత్తగా వుండాలి గాని, వ్యాపారమే యెంతో బాగున్నట్టుంది."

"మావయ్యా! ఒక్క విషయం అడుగుతాను_ కోపగించుకోవు కదా?"

"అడుగు అరుణా! నీ మీద కోపగించుకోవడమా? అదెప్పటికీ జరగనిమాట."

"పాత అలవాట్లు యేమైనా..." అని యింకేమో అడగా లనుకుంటూండగానే, మాధవరావు అందుకున్నాడు.

"ఇంకా నామీద నీకు నమ్మకం కలుగ లేదన్నమాట! భగవత్సాక్షిగా చెప్తున్నాను... అవన్నీ యేనాడో వదులుకున్నాను..."

"సంతోషమే! అయితే, అన్నీ బాగానే వున్నాయి గాని, తాతయ్య నిన్నో యింటివాడిని చెయ్యలేదేం? ఆ ప్రయత్నాలే జరపలేదా?" మావయ్య ఓ యింటివాడైతే, మళ్ళీ అతనిమనస్సు పరివర్తన చెందకుండా వుంటుందని, ఆమె భావం.

మాధవరావు మొహం దించుకున్నాడు.

"నాన్న, ఆ తలంపుతోనే వున్నారు. కాని, నేను విముఖత చూపిస్తున్నాను" మెల్లగా అన్నాడు.

"విముఖత యెందుకు మావయ్యా? భగ్నప్రేమి కుడివా యేవిటి?" నీరసంగా వున్నా, చిన్నగా మందహాసం చేస్తూ అంది. తనలానే మావయ్యకూడా విఫలప్రేమికుడే నేమో నన్న సందేహం కలిగి అడిగింది.

"అబ్బే! అదేం కాదు అరుణా! నా మనసుకి నచ్చిన వ్యక్తి, నా హృదయంలో చోటు చేసుకున్నంత వరకూ, నా నిర్ణయం మారదు...

"నీ మనసుకి నచ్చినవ్యక్తి యింక తారసపడనేలేదా?"

"పడింది. కాని, ఆమె అంగీకరించాలి కదా..."

"ఎవరా వ్యక్తి..." ఆ అమ్మాయి యెవరో తెలుసుకోవాలన్న ఆసక్తి ఆమెలో ప్రబలింది.

"అబ్బే... యిప్పుడు చెప్పను... తర్వాత తెలుసుకుంటావులే!" కాస్త బిడియపడుతూ అన్నాడు. తన హృదయాంతరాళంలో పొంచివున్న మాట వెల్లడి చెయ్యాలనుకున్నాడు గాని, ఏదో అవ్యక్తమైన బలహీనతకు లొంగిపోయి, అలా అనేశాడు.

శారద అప్పుడే కాఫీ తీసుకుని వచ్చింది. అరుణ యింకేమీ బలవంతంచేసి అడగలేదు_ ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకోవాలన్న వాంఛ లోలోన వున్నాను.

"నువ్వు కాలేజికి సెలవు పెట్టావేమిటి శారదా?" కాఫీ తీసుకుంటూనే అడిగాడు.

"ఔను మావయ్యా! ఒంటరిగా వుంటే, అక్క మరీ దిగులు పడిపోతుందని సెలవు తీసుకున్నాను..."

"మంచిపని చేశావు శారదా!" కప్పు ఖాళీచేసి ఆమెకి అందించాడు.

"అరుణా! నేను మధ్యాహ్నం బండికి వెళ్ళిపోతాను" అన్నాడు మళ్ళీ.

"మధ్యాహ్నం భోజనం చేసి వెళ్ళిపోవచ్చున్లే మావయ్యా!"

"అలాగేలే! నేనలా మార్కెట్టుకి వెళ్ళివస్తాను..." అంటూ లేచి వెళ్ళిపోయాడు.

"సూట్ కేస్‌తో బట్టలు తెచ్చినట్లున్నాడు – అప్పుడే వెళ్ళిపోతానంటా డేమిటే అక్కా?" అంది శారద క్షణం పోయాక.

"వుండమని చెప్పు పోనీ..." మందహాసంతో అంది అరుణ.

"పోదూ! ఎప్పుడూ నామీద దాడియాత్రే!" బుంగ మూతి పెట్టింది శారద.

"అప్పుడే కోపం వచ్చేసిందే! అబ్బే నాకు వంటో బాగులేదంటే తాతయ్య పంపిస్తుంటారు, నాలుగు రోజులుండి రమ్మని. ఇప్పుడు నేను కోలుకోవడం చూశాడుగా! అదీగాక అతని అవసరం యింకేం లేదని డొంకతిరుగుడుగా చెప్పేశావుగా యిందాక. వూరికనే కూచుని యేం చేస్తాననుకుని, వెళ్ళిపోతున్నాడేమో!"

"అదే అయుంటుందిలే!" అక్కణ్నించి వెళ్ళిపోయింది శారద.

అరుణ ఆలోచనలో పడింది. మామయ్య మనసుకి నచ్చిన వ్యక్తి యెవరా? అని...అంతు చిక్కలేదు.

*　　*　　*

మాధవరావు వెళ్ళిపోయి, మూడు రోజులయింది. అరుణ యిప్పుడు బాగానే కోలుకుంది. శారద కాలేజీకి వెళ్ళింది ఆరోజే. అరుణ ముందు గదిలో కూచుని బుచ్చిబాబుగారి 'చివరకు మిగిలేది' నవల చదువుతూంది. అంత పూర్వం, రెండు మూడుసార్లు చదివిన పుస్తకమే! అయినా, మరోసారి చదవాలనిపించిం దామెకి. ఆ కథలో లీనమై పోయింది.

"పోస్ట్!" అంటూ పోస్టుమాను ప్రత్యక్షం.

అరుణ వెళ్ళి ఉత్తరం తీసుకుంది. అదో కవరువుత్తరం. అడ్రసు చూసి యెవరురాశారో, చప్పున గుర్తుపట్టలేక పోయింది. తాతయ్య రాసింది కాదని ఆమెకి తెలుసు. అందుకే ఆత్రుతగా కవరుచించి, ఉత్తరాన్ని తీసింది. అప్రియత్నంగా ఆమె దృష్టి ఆ ఉత్తరం దిగువ సంతకం మీదికిపోయింది. 'మాధవరావు' అని వుంది. విస్తుపోయింది అరుణ. ఉత్తరం రాసినందుకుకాదు... కవరు వుత్తరం రాసినందుకు. ఏదో విశేషం లేకపోతే రాయడనిపించింది. ఉత్తరాన్ని చదవడానికి వుపక్రమించింది.

"చిరంజీవి అరుణకి ఆశీస్సులు—

క్షేమంగా చేరాను. నాన్న కులాసాగానే వున్నారు. నీ ఆరోగ్యం ప్రస్తుతానికి బాగుందని భావిస్తున్నాను. శారద కాలేజీకి పోతుందా?

ప్రస్తుతం నేను నీ ఉత్తరం రాయడానికి ప్రబల కారణం, నా మనోభిప్రాయాన్ని నీ ముందు వ్యక్తం చేసుకోలేక పోయిన నా బలహీనత. సమక్షంలో వెల్లడిచేయలేని విషయాన్ని పరోక్షంలో ప్రస్తావించడం సులభంకదా! అందుకే, యీ ఉత్తరాన్ని రాస్తున్నాను. ఏమిటో విషయమని నీకు ఆత్రుతగా వుండొచ్చు. అది సహజమే! నాలో యీ మార్పు యెలా వచ్చిందీ, నీకు వివరించాను. పరివర్తన చెందిన నా జీవితంలో, యేదో వెలితి పరోక్షంగా కన్పిస్తోంది. అర్థం గాని అశాంతి, అప్పుడప్పుడూ అల్లకల్లోలం చేస్తోంది నామీద దును. ఆ కల్లోలానికి కళ్లెం వేసి, నా జీవితంలో శాంతిని, ఒక విధమైన తృప్తిని ఏర్పర్చగల సహచరిణి కావాలేమో నన్పించింది. అయితే, వివాహం చేయాలన్న తలంపుతో వున్న నాన్న భావాలకు ఒక రూపాన్నివ్వలేను. ఏదో కారణాలు చెప్పాను. ఎందుకు? ప్రతి మనిషికీ యేవో కొన్ని ఆశయాలూ, ఆశలూ వుంటాయి. నిశ్చితమైన అభిప్రాయాలూ వుంటాయి. ఆ అభిప్రాయాలు, ఆచరణీయంగా వుండాలనే కోరుకుంటాడు. అలాగే నేనూ కొన్ని అభిప్రాయాలతో వున్నాను. కొన్ని ఆశలున్నాయి నాకూనూ. అందుకే నాన్నగారి అభిప్రాయాన్ని చప్పున అంగీకరించలేక పోయాను. నా సహచరిణిగా నా ఊహాలోకాల్లో సృష్టించుకున్న వ్యక్తి ఒక్కరే వున్నారు.

ఆమె నా జీవితంలో అడుగుపెడితే, యింక నాకేం భయముం డదు స్వర్గతుల్యమౌతుంది, నా సంసారం. ఈ విషయమే మొన్నను నువ్వు అడిగావు. కాని, నీ యెదుట చెప్పలేక పోయాను—నా వూహా పత్ని పేరు. అదే నా బలహీనత. ఆమె యెప్పుడూ నా కళ్ళల్లోనే మెదుల్తూంది. నా హృద యంలో శాశ్వత స్థానాన్ని ఆక్రమించుకుంది. అయితేనేం— ఆమెకి నా మీద అనుగ్రహం కలగొద్దు? నా మీద నమ్మక మేర్పడొద్దూ? అదే నేనిప్పుడు కోరేది!

ఇంతకీ, ఆమె యెవరని కదూ నీ ఆసక్తి...? ఇంకా నిన్ను సస్పెన్సులో వుంచడమెందుకు? ఆ వ్యక్తి నువ్వే అరుణా! నా మనసులో జ్యోతిని వెలిగించిన వ్యక్తివి నువ్వే! నీ అనుగ్రహం కోసం వేచివున్నాను. నాలో మార్పు రాక ముందు నీతో అనేవాణ్ణి గుర్తుందా? 'అరుణా! నన్ను పెళ్ళి చేసుకోకూడదూ?' అని. అప్పటో నేను మైకంలో వున్నా, మనసారా అన్న మాటలే అవి. అరుణా! నేను నీ మేనమావంనే అయినా, నిన్ను అర్థిస్తున్నాను—నా జీవితానికి ఒక అర్థం కల్పించమని! వుంటాను మరి...

నీ మావయ్య,
మాధవరావు."

ఉత్తరం చదవడం పూర్తిచేశాక, గట్టిగా ఓసారి నిశ్వాసం వదిలింది అరుణ. మావయ్యపై కోపం రాలేదు. జాలివేసింది. ఉత్తరం చదివాక, అతని మనస్తత్వంమరీబాగా ఆకళింపు చేసుకుందామె. మాధవరావు అప్రయత్నంగా ఆమె

మనోనేత్రంలో మెదిలాడు. డాక్టర్ రఘు కూడా అదే సమయంలో గుర్తుకొచ్చాడు. డాక్టర్ రఘుని తిరస్కరించింది తను. మావయ్యకి ఏం సమాధానం రాయాలి? సందిగ్ధంలో పడి, సతమతమైపోతోంది. ఇంతవరకూ లేని సమస్య మరొకటి ఆమెముందు నుంచుం దిప్పుడు.

# 12

ఆనందం ఆరోజు స్కూటర్ తేలేదు. రెండు రోజుల క్రితం యాక్సిడెంటు జరగడంవల్ల మడ్ గార్డులు దెబ్బతిన్నాయి. అందుకే, దాన్ని రిపేర్ కిచ్చాడు.

అతను కాలేజి విడిచిపెట్టడం, కాస్త అలస్యమయింది. అందుకే వడివడిగా ముందుకు నడుస్తున్నాడు. అతని కళ్ళు మాత్రం శారదను వెదుకుతున్నాయి. కాస్తంత దూరంలో ఆమె అగుపించింది. నడక వేగాన్ని హెచ్చించాడు. ఆ రోజు ఆమెతో మనసువిప్పి మాట్లాడాలని నిశ్చయించుకున్నాడు.

"శారదా!" మూడుగజాల దూరంలోవున్న ఆమెను కేకవేశాడు మెలగా.

శారద వెనుదిరిగి చూసింది. ఆనందం! చూసి ముసిముసిగా నవ్వుకుంటూ, మొహం తిప్పుకుంది. ఆమెకి తెలుసు-

అతను వస్తాడని! ఆనందం వచ్చి కలిశాడు. ఆమెకి సమాంతరంగా నడుస్తున్నాడు.

"ఈవేళ నేను ఏకాగ్రతతో పాఠం చెప్పలేకపోయాను శారదా. నమ్ముతావా?"

"ఔను మరి! అదేపనిగ నాకేసి చూస్తుంటే, యేకాగ్రతగ యెలా వస్తుంది? మెదడు యెలా పనిచేస్తుంది? అయినా, మిగతా వాళ్ళంతా యేమనుకుంటారో నన్న భయంకూడా మీకు లేకపోయిందా?"

"నిజం శారదా! ఆ క్షణంలో నా కేవిధమైన భయమూ, బిడియమూ లేకపోయింది. బహుశా, ప్రేమకి భయం లేదేమో!" నవ్వుతూ అన్నాడు.

శారద మొహం, సిగ్గుతో ఎర్రబారింది.

"ప్రేమంటే నాకు నమ్మకలేదు మేష్టారూ!" మొహం దించుకుని అంది.

ఆనందం గతుక్కుమన్నాడు. అతని మొహంలో మబ్బుతెర వచ్చినట్లయింది. తన ప్రేమను తిరస్కరిస్తుందేమోనని, అతని భయం.

"అదేవిటి శారదా, అప్పుడే యిటువంటి అభిప్రాయాన్ని యేర్పర్చుకున్నావు?"

"ఇప్పుడు చాలా సంఘటనలు చూస్తున్నాం కదా మేష్టారూ! ప్రేమ సఫలత చెందేది యే కొద్దిమంది విషయంలోనో! సాధారణంగా ప్రేమికుల్లో యెవరో ఒకరు భగ్న ప్రేమికులై బాధపడుతున్న వాళ్ళే!"

"అంత తేలిగ్గా నిర్ణయించుకోకు శారదా! భగ్న

ప్రేమికులు లేరనికాదు. అయితే, అలా జరగడానికి, వాళ్ళ తెలివితక్కువ తనమేకారణమంటాను. ప్రేమికులు, ప్రేమికులు గానే వుండకూడదు. అలా వుండి, ఒకరినొకరు నమ్మకూడదు. వెంటనే పెళ్ళిచేసుకోవాలి. అప్పుడే వాళ్ళ ప్రేమకు ఒక విధ మైన స్థిరత్వం యేర్పడుతుంది_ ఓ విలువ వస్తుంది. అలాగే జరిగితే, భగ్నప్రేమికుల జాబితా తగ్గుతుందేమోననిపిస్తుంది" అన్నాడు ఆనందం, తను ప్రేమమీద ఓ థీసిస్ రాసినట్టుగా.

శారద క్షణం ఆలోచన సాగించింది. ఆనందం మేస్టారు చెప్పిందాంట్లో, సత్యం కాస్తయినా లేకపోలేదని పించింది. కాని, వివాహానికి అవకాశాలుకూడా సమకూడాలిగా!

"మీరు చెప్పింది బాగానే వుంది మేస్టారూ! కాని, వివాహానికి అవకాశాలు అందుబాటులో వుండాలికదా? అవ కాశాలు యే మాత్రం యెదురు నిల్చినా, మళ్ళీ సమస్యే!"

"కాదని నేనూ అనను శారదా! అయితే, అవకాశాలు లేకపోతే, వాటిని సుముఖంగా తిప్పుకోవాలి. పరిస్థితుల్ని అను కూలంగా మార్చుకోవాలి."

శారద మరేం అనలేదు. అది పరిష్కారం కాజాలని సమస్య. అందుకే వూరుకుంది.

"అలా పార్కుకి వెళ్ళి కాస్సేపు అక్కడ కూచుందాం రాకూడదా శారదా?" ప్రాధేయపూర్వకంగా అన్నాడు. ఆ క్షణంలో అలా అనక తప్పిందికాదు.

"ఆలస్యమైతే, మా అక్క కోపగించుకుంటుంది మేస్టారూ!" బిత్తగ్గా అంది.

"ఏమాత్రం ఆలస్యమవుతుందని? మహా అయితే పది పదిహేను నిముషాలు. అంతేగా! ఏ స్నేహితురా లింటికో వెళ్ళినట్టు చెప్పెయొచ్చునుగా! మనసే వుండాలిగాని, మార్గా లకి కొదవలేదు...

"అబ్బే! అబద్ధ చెప్పడం నా కిష్టంలేదు..."

"జ్ఞాపకం తెచ్చుకో శారదా! ఎప్పుడో అబద్ధం చెప్పి వుంటావు...తప్పనిసరి: ఈకాలంలో అబద్ధాలు చెప్పనివ్యక్తులు చాలా అరుదు. ఎవరంత సత్యసంధులుంటారని? ఇటువంటి నియమాన్ని పాటించడం కేవలం తెలివితక్కువతనం. ఏం భయంలేదు. నువ్వేం చెప్పినా, మీ అక్క నమ్ముతుంది. నా కోరిక కాదనకు శారదా! నీతో యెన్నో విషయాలు మాట్లాడాలనుకున్నానీవేళ. అందుకే నా యీ అభ్యర్థన... నా కోసం, యీ ఒక్కసారి అబద్ధం చెప్పు..."

శారదకి చప్పున గుర్తుకొచ్చింది, ఆ రోజు వర్షం పడు తున్నప్పుడు, స్కూటర్ మీద వచ్చినా, నడిచి వచ్చినట్టు చెప్పడం అబద్ధం కాదా మరి... అనుకుంది— లోలోన నవ్వొస్తుంది కూడాను.

"అబ్బ! మీతో గొప్ప చిక్కు సుమండీ?" విసుగ్గా అంది.

ఆ మాటల్లోనే అంగీకారం గ్రహించి, పార్కు కేసి దారితీశాడు ఆనందం.

అప్పటికే పార్కు జనంతో నిండివుంది. రేడియో తన పని సాగించుకుంటూ పోతోంది. ఆ సంజవెలుగులో ఆకు పచ్చని చెట్లు, తెల్లని పూలూ, చాలా అందంగా అగుపిస్తు

న్నాయి. ఆనందం, శారద ఓ మూలకి పోయి కూచున్నారు. చాలామంది దృష్టి, వాళ్ళమీద పడింది. అయితే, వాళ్ళేమీ పట్టించుకోలేదు. దగ్గర్లోనేవున్న సన్నజాజి చెట్టు తన పూల సౌరభాన్ని విరజిమ్ముతూ, మత్తుకలిగిస్తోంది.

క్షణం నిశ్శబ్దం. శారద మొహం దించుకునికూచుంది. ఆనందం, ఆమె మొహంలోకి ఆశగా చూస్తున్నాడు. అలా మౌనంగా కూచోవడం శారదకి విసుగు కలిగించింది.

"ఇలా యెంతసేపు మౌనంగా కూచుంటాం మేస్టారూ? అంది.

శారద అందాన్ని ఆస్వాదిస్తూ, తన్మయత్వంతో మరో లోకంలో విహరిస్తున్న ఆనందం, శారద ప్రశ్న విని వాస్తవిక లోకానికి వచ్చేశాడు.

"ఆ! ఆఁ! అదే శారదా! నీతో చెప్పాలనుకున్న విషయం, నిన్ను చూడంతోనే మర్చిపోయా. నీ అందం చూస్తుంటే, మరో తలంపే వుండదు..."

"చాల్లెండి...మీ మనసులోని మాటేమిటో చెప్తామన్నారు—చెబుదురూ!" సిగ్గుపడిపోతూ అంది.

"ప్రేమికులు సాధారణంగా భగ్న హృదయు లవుతారనే భయం నీలో వుందికదూ శారదా!"

"ఔను మేస్టారూ!"

"ఆ భయం అనవసరం శారదా! నేను శాశ్వతంగా ప్రేమికుడిగానే వుండిపోదల్చుకోలేదుగా! నువ్వు అంగీకరిస్తే, నేను నిన్ను వివాహం చేసుకుంటాను. నా ఆశలకు రూపాన్ని యేర్పరుచుకుంటాను. నా జన్మ తరించిందని భావించు

కుంటాను. ఏమంటావు శారదా?" ఆమెలో భయాందోళనలకు చోటులేకుండా చెయ్యాలని అతని ప్రయత్నం.

శారద మొహం వికసించింది. ఆనందం నుండీ ఆ మాటలే రావాలని యెదురు చూస్తోంది. నిజానికి, అతనంటే యిప్పుడామెకి ఒకవిధమైన అనురాగం యేర్పడింది. ఇంతకు ముందులా ద్వేషభావం గాని, అసహ్యభావంగాని, ఆమెలో లేదు. తనెంత చీదరించుకుంటున్నా, అతను దగ్గరవ్వడానికి ప్రయత్నిస్తుండటం, ఆమెను మార్చివేసింది. అయితే, కేవలం ప్రేమలోపడి, అక్కలా భగ్నహృదయ కావడం ఆమెకి యిష్టంలేదు. అయితే, ఆ క్షణంలో ఆనందం అన్న మాటలు ఆమె ప్రేమను ద్విగుణీకృతం చేశాయి. అతణ్ణి వివాహంచేసుకోవడం కంటే, తనకి కావల్సిన దేముంది? ఎలాగూ తను పై చదువులు చదువదల్చుకోలేదు. తన మనోవాంఛను వెల్లడించేస్తే అక్కయ్య తనని నిరుత్సాహపర్చదనే విశ్వాసం, ధైర్యం శారదకి కలిగాయి. ఎటొచ్చీ, ఆనందం తలిదండ్రులు యేం గొడవపెడతారో? తర్వాత ఏం అవాంతరాలు వస్తాయో?...ఈ సందేహాలు ఆమెను కాస్త కలవరపర్చాయనే చెప్పాలి.

"మేస్టారూ! మీరింత ధైర్యంగా చెబుతున్నారు,వివాహం చేసుకుందామని...కాని, మీ తలిదండ్రులు అంగీకరిస్తారన్న నమ్మకముందా?" అంది ఓరగా చూస్తూ.

ఆనందంకి ఆమె మన స్తత్వం అవగాహనయింది. అతనిలో ఆనందం వెలివిరిసింది.

"నువ్వు అంగీకరిస్తే, మరింకే సమస్యా లేదు శారదా!" మందహాసంతో అన్నాడు.

"అంటే?..." అతనికేసి చూస్తూ అంది.

ఆనందం గట్టిగా నిట్టూర్చాడు. అతనిలో పాత జ్ఞాపకాలు నెమరుకి వచ్చాయి.

"మా అమ్మ నాచిన్నతనంలోనే పోయింది శారదా! మా నాన్నకూడా యీ మధ్యనే చనిపోయారు. ఈ విశాల విశ్వంలో ప్రస్తుతానికి నేను యేకాకిని. అందుకే నేను స్వతంత్రుణ్ణి. నా విషయంలో జోక్యం కలిగించుకునే వాళ్ళెవరూ లేరు. అందుకే ధైర్యంగా చెప్పగలిగాను" మెల్లగా చెప్పాడు. తలిదండ్రులు జ్ఞప్తికి రావటంతో అతని కళ్ళు ఒక్కసారి చెమ్మగిల్లాయి. చేతి రుమాలుతో ఒత్తుకున్నాడు.

శారద క్షణం మౌనం వహించింది. ఏం చెప్పాలో ఆమెకి అర్థం కాలేదు.

"చెప్పు శారదా! నువ్వు అంగీకరించానని చెప్పు. నువ్వు నా జీవితంలో అడుగుపెట్టకపోతే యిప్పటికే మోడు బారి, కృశించి పోతున్న నా బ్రతుకు నాశనమౌతుంది. నా ఆశలన్నీ నీ మీదే పెట్టుకున్నాను. కాదనకు శారదా!" బ్రతిమలాడుతున్న ధోరణిలో అన్నాడు.

శారదకి జాలివేసింది, అతని అమాయకత్వానికి. ప్రేమించిన మనిషి జీవితంలో అడుగు పెట్టలేకపోతే, బ్రతుకు నాశనమవుతుందా ? ...తనలోనే యీ ప్రశ్న వేసుకుని లోలోన నవ్వుకుంది. అతనికేసి క్రీగంటితో చూసింది. విద్యుద్దీపపు కాంతిలో అతని మొహం మెరిసిపోతోంది. ఆమె

దృష్టికి యెంతో అందంగా కనిపించాడు. ఆ మొహంలో అమాయకత్వం కొట్టొచ్చినట్టు కన్పించింది. ఇంకా బెట్టుసరి చూపించి అతణ్ని బాధించడం యిష్టం లేదు.

"నా అంగీకారం ఎప్పుడూ వుంది మేస్టారూ!"

ఆనందం మురిసిపోయాడు. ఆ ఉత్సాహపు వుధృతంలో ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"నేనెంత అదృష్టవంతుణ్ని శారదా! నా జీవితం ధన్యమయింది. నా ప్రేమమూర్తిని నా స్వంతం చేసుకుంటున్నాను. నా ఆశ నెఱవేరింది" అంటూ సంతోషాన్ని పట్టలేక చెప్పుకుపోయాడు.

"అప్పుడే అంత సంతోషమైతే ఎలా మేస్టారూ?"

"ఏవిటి శారదా అలా అంటున్నావు?" మళ్ళీ నిరుత్సాహపు తెరకప్పు బడిందతని మొహంపై.

"మీ విషయంలో అయితే ఎవరి అనుమతినీ తీసుకోనవసరం లేదు. కాని నా పరిస్థితి అదికాదుగా! నాకంటె పెద్దది, నాకు పెద్దదిక్కు, మా అక్క వుంది...ఆమె అంగీకారాన్ని తీసుకోవడం నా ధర్మంకదూ?"

"అలాగే తీసుకో! దానికేం?" అదో పెద్ద అవాంతరమనిపించ లేదు ఆనందంకి.

"ఒకవేళ అంగీకరించక పోతే ?"

"నాకా సందేహం లేదు శారదా! తప్పకుండా అంగీకరిస్తుంది. చెల్లెలి సుఖసౌఖ్యాల్ని ఏ అక్కయ్య కోరకుండా వుంటుంది చెప్పు?" అంటూ_

"అన్నట్టు, మీ అక్కయ్య వివాహితేనా?" అని ప్రశ్నించాడు. ఇంతవరకూ యీ విషయం ఎప్పుడూ ప్రస్తావనకి రాలేదుగాబట్టి, తెలీదతనికి.

"మంచివారేనండీ! ఇదీ ఒక ప్రశ్నేనా? మా అక్కయ్య వివాహితే అయితే మా బావగారి ప్రసక్తి తీసుకు రాకుండా వుంటానా? నాకు పెద్దదిక్కు అక్కయ్యేనని చెప్పానుగా!"

తను తెలివితక్కువగా ప్రశ్నించానన్పించింది, ఆనంద్‌కి.

"నిజమే శారదా! అంతదూరం ఆలోచించలేదు. సరేగాని, మరేం అనుకోకు— మీ అక్క యెందుకు వివాహం చేసుకోలేదు?"

"ఇష్టంలేదు — వివాహం చేసుకోలేదు — దీనికి వేరే కారణాలేవీంటి," నిజాన్ని చెప్పడం శ్రేయస్కరం కాదనిపించింది. అందుకే, ఒక పెద్ద అబద్ధం చెప్పింది.

"అయితే, మరో సందేహం: ఆమె వివాహం జరగకుండా, నీ పెళ్ళికి అంగీకరిస్తుందా అని..."

"మీావన్నీ వట్టి చచ్చు సందేహాలు వేస్తారూ! ఇంతకు ముందే ఓసారి చెప్పింది కూడాను, తనింక పెళ్ళి చేసుకోనని. అంటే, నా వివాహానికి ఆటంకపర్చదనేగా!"

"అయితే మరింకేం? తప్పకుండా ఒప్పేసుకుంటుంది. మీ అక్క చాలా మంచిమనిషిలా వుంది. ఓసారి నేనూ కలిస్తే బావుంటుందేమో!"

"జానకమ్మ గారూ! మీరు ఓసారి కలుసుకుంటే, నా శ్రమ తగ్గుతుంది. రేపో, యెల్లుండో ఓసారి రాకూడదూ?"

"అలాగే శారదా! ఎల్లుండి వెళ్దాం..."

"ఉహూ! రేపే వెళ్దాం." ఆలసించడం మంచిది కాదని పించింది శారదకి.

"సరే!"

"చాలా వేళయింది. పోదాం పదండి..." లేచింది.

ఆనందం ఆటంకపర్చలేదు. తనూ లేచాడు. ఇద్దరూ వడివడిగా నడుస్తూ పోయారు.

*    *    *

శారద యిల్లు చేరుకుండే సరికి యేడుగంటలు కావస్తోంది. అప్పటికే బాగా చీకటిపడింది. అరుణ వీధిగుమ్మం దగ్గర నుంచుని ఆతృతగా చెల్లెలికోసం యెదురుచూస్తున్న సమయంలో వెళ్ళింది.

శారద పుస్తకాలు పెట్టేసి వచ్చింది.

"ఏం చెల్లీ, యీవేళ యింత ఆలస్యమయింది ?" కుర్చీలో కూచుంటూ అడిగింది అరుణ. ఏరోజూ యీ ఆలస్యం కాలేదు యింతవరకూ. అందుకే గుచ్చి గుచ్చి అడిగింది, ఆమె మొహంలోకి చూస్తూ.

శారద సందిగ్ధంలో పడింది, నిజం చెప్పడమా; మానడమా అని. ఆసందిగ్ధంలో జవాబు చెప్పడం ఆలస్యమయింది.

"ఏమిటే ఆలోచిస్తున్నావు?" చెల్లాయి సందిగ్ధతను శంకించింది అరుణ. ఏదో విశేషం వుండి వుంటుం దనుకుంది.

"అబ్బే యేమిలేదు."

"ఏమీ లేకపోతే, ఆలోచనెందుకు మరి?" సూటిగా చూస్తూ అంది అరుణ.

అక్క తన మొహంలోకి చూస్తూండటం, శారదకి కంగారు కలిగించింది. ఆ పరిస్థితిలో యే సాకుచెప్పి తప్పించుకోవడమో, అర్థంకాలేదామెకి. ఏదో అబద్ధం చెప్పినా నమ్మే స్థితిలో లేదు కూడాను. అందుకే, నిజం చెప్పేయాలనుకుంది.

"అక్కా! నన్నెప్పుడూ అభిమానించి, ఆదరించే నీ సమక్షంలో అబద్ధం చెప్పడానికి మనస్కరించడం లేదు. ఇన్నాళ్ళూ యీ విషయాన్ని నీతో చెప్పకుండా నాలోనే దాచుకున్నాను. అందుకు క్షమాపణ చెప్పుకుంటున్నాను." అంటూ క్షణం ఆగింది శారద.

అరుణ, అయోమయావస్థలో కొట్టుకుంటోంది. ఆమె మొహం వివర్ణమయింది. ఏదో ప్రేమగొడవే అయ్యుంటుందని, సందేహించకుండా వుండలేకపోయింది.

"క్షమాపణ కోరుకునేంతటి పొరపాటు, యేంజేశావు శారదా?" మెల్లగా అడిగింది.

"పొరపాటే అనుకుంటాను అక్కా! బహుశా, ప్రతి స్త్రీ జీవితంలోనూ ప్రేమాధ్యాయం వుంటుందేమో ననిపిస్తుందిప్పుడు..."

"నువ్వు ప్రేమించావా?" అరుణ గొంతు మారింది. తన వూహ, సరైనదే నన్పించింది...

"ఔను. ఆరోజు నీ విఫలప్రేమోదంతం చెప్పావు గుర్తుందా? అది తెలిసికూడా యెంత విముఖతగా వున్నా, పరిస్థితులకు బానిసయ్యాను. నాకు తెలియకుండా, నేనెంత

ప్రతిఘటిస్తున్నా, నా మనస్సు అతనికి దాసోహ మంది. ఇందులో నా తప్పేమీ లేదు. అతని అనురాగబంధాలకు, అతని ప్రాధేయతలకు లొంగిపోయింది నా మనస్సు." మొహం దించుని మెల్లగా చెప్పింది.

అరుణ గట్టిగా నిశ్వాసం వదిలింది విషయం చాలా దూరం వచ్చిందనుకుంది. ఆ పరిస్థితుల్లో క్షోభగించుకున్నా, ఫలితం శూన్యమని, ఆమెకి తెలుసు.

"పర్యవసానం ఆలోచించావా శారదా?"

"ఆ భయం వుండే, యిన్నాళ్ళూ విముఖత చూపుతూ వచ్చా నక్కా!"

"మరిప్పుడు?"

"నేను అంగీకరిస్తే, వివాహం చేసుకుంటా నంటున్నాడు. అది తన అదృష్టంగా యెంచుకుంటా నంటున్నాడు."

"నువ్వేమన్నావు?"

"నీ అంగీకారాన్నీ; అనుమతినీ తీసుకోవాలన్నాను."

"అంటే, నేను అంగీకరిస్తే యీ వివాహం నీకిష్టమే నన్నమాట!"

శారద మాట్లాడలేదు. చీరకొంగ వేలికి చుట్టుకుంటూ, మౌనంగా వుండిపోయింది. మొహందించుకుని మౌనం అంగీకారంగా గ్రహించింది అరుణ.

"నా అనుమతితో సమస్య తీరుతుందా? మరి, అతని తలిదండ్రులమాట...?"

"అతనికి తలిదండ్రులు లేరట ... తనవాళ్ళంటూ, యింకెవ్వరూ ఈప్రపంచంలో లేరట. అతను స్వతంత్రుడట."

అరుణ, క్షణం యోచించింది. చెల్లెలి మనసుకి నొప్పి కలిగించడం, ఆమెకిష్టం లేకపోయింది. తను అసమ్మతి తెలపాల్సిన అవసరం కూడా కూడా లేదనిపించింది.

"సరేనమ్మా శారదా! నువ్వు సుఖపడగలననుకుంటే నాకూ సమ్మతమే! నాకు మాత్రం యింకేం కావాలి! అమ్మా నాన్నా, సజీవంగా లేకపోయినా, వారికి గల బాధ్యత, బరువు, నామీద పడ్డాయిగాబట్టి నాకర్తవ్యాన్ని నేనూ నిర్వహించాలి. అంచేత అతణ్ణి ఓసారి మనింటికి తీసుకురా ?" అంది అరుణ.

శారద ఆనందం, అవధులు దాటింది. ఆమె మొహం అప్పుడే వికసించిన పుష్పంలా విప్పారింది. మనోఫలకం మీద ముద్రితమైవున్న ఆనందం ప్రతిరూపం, ముసిముసి నవ్వులు విరిసింది. అప్రయత్నంగా సిగ్గుపడిపోయింది శారద.

"అలాగే అక్కా! రేపు తీసుకొస్తాలే." అంటూ అక్కణ్ణించి తుర్రుమంది, లోపలికి. గొంతెత్తి పాడాలన్నంత వుత్సాహం, ఆమెని వుక్కిరిబిక్కిరి చేసింది.

చెల్లెలి సంతోషం చూస్తూ, మురిసిపోయింది అరుణ. తన సమ్మతిని తెలుపుతూ, ఒక మంచిపని చేస్తున్నానన్న తృప్తి ఆమెలో మిగిలింది.

# 13

అరుణ ముందుగదిలో కూచుని, అప్పుడే వచ్చిన వారపత్రిక తిరగేస్తోంది. అప్రయత్నంగా మాధవరావు జ్ఞప్తికి వచ్చాడు. అతను రాసిన ఉత్తరానికి తనింకా జవాబివ్వలేదు. ఏమనుకుంటాడో, యేమిటో... వెంటనే రాసేయాలి_ అనుకొని, పత్రిక బల్లమీద పడేసి లోపలికి వెళ్ళి లెటర్ పాడ్, పెన్నూ తెచ్చుకుని ఉత్తరం రాయడానికి ఉపక్రమించింది.

'మావయ్యకు,

నమస్కారములు. నీవుత్తరం చేరింది. వెంటనే జవాబు రాయలేకపోయాను... అన్యథా భావించకు. నా ఆరోగ్యం యిప్పుడు బాగానేవుంది. రెండురోజులు పోయాక డ్యూటీలో జాయినవుతాను ఇంట్లో కూచోవడం కూడా ఒక విధమైన చెఱసాలగా వుంటూ, మరీ విసుగు కన్పిస్తోంది. చెల్లాయి కాలేజీకి వెళ్తోంది. ఇకపోతే, నీమనోభావాన్ని నా సమక్షంలో వెల్లడి చెయ్యలేని నీ బలహీనతకు నేను ఆశ్చర్యపోలేదు మావయ్యా; అది సహజమే అన్పిస్తుంది. ఉత్తరం ద్వారా నీ అభిమతాన్ని వ్యక్తం చేశావు. బహుశా ప్రథమ పర్యాయం కాదనుకుంటాను. అయినా, ఈ విషయంలో ప్రస్తుతం నేనొక నిర్ణయానికిరాలేని అసహాయురాలిని. కారణం కేవలం నామనస్సుకి సంబంధించిందేకాని, యే వ్యక్తికీ సంబంధించిందీ కాదు. నాలోని సంఘర్షణ సమూలంగా నాశనమైన నాడే నా

మనస్సు మారడానికి అవకాశం వుంది. ఆ తరుణం కోసమే నేనూ వేచి వున్నాను. ఎందుకైనా మంచిది - నాగురించి మాత్రం నువ్వేమీ ఆశలు పెంచుకోవద్దు. ఈ విధంగా నీకు నిరుత్సాహం కలిగిస్తున్నందుకు నేనెంతో బాధపడుతున్నాను. కాని, యేం చెయ్యను! పరిస్థితులు నాకు, ప్రతికూలంగా వున్నాయి. ప్రస్తుతానికింతే! తాతయ్య కులాసాగా వున్నా రనుకుంటాను. ఆయనకి నా నమస్కారము లందజెయ్యి.

ఇట్లు,
-అరుణ.

ఉత్తరాన్ని మరోసారి స్వంతం చదువుతుంది. ఎక్కడా పొల్లు అక్షరం ఒక్కటికూడా లేకుండా, విషయాన్ని సవివరంగా, రాసినందుకు తృప్తిగా నిశ్వాసం వదిలి, వుత్తరాన్ని కవరులోపెట్టి అంటించింది. దానిపై మాధవరావు అడ్రసే రాసింది. ఆ వుత్తరం తాతయ్య చేతిలో పడకూడదనే ఆమె భావం.

అప్పుడే తాయారు వచ్చిం దక్కడకి.

"అమ్మా! సాయంత్రం యెవరో వస్తారని చెప్పింది శారద. ఏంచెయ్యమంటావు? ఉప్మా చేసేదా?" వస్తూనే అడిగింది తాయారు.

"ఔను తాయారూ! నేనూ అదే చెప్పాలనుకుంటు న్నాను. మంచి కాఫీకూడా తయారుచేసి వుంచు. ఆఁ... అన్నట్టు వుప్మాలో కాసింత జీడిపప్పు కూడా వెయ్యాలి తెలుసా?"

"అది చెప్పాలా అమ్మా! అలాగే వేస్తాను." అంటూ వెళ్ళిపోబోతూవుంటే అరుణ ఆమెను వెనక్కి పిల్చింది.

"ఏవఁమ్మా."

"ఇదిగో యీ కవరు తీసుకుపోయి పోస్టుబాక్సులో పడేసిరా తాయారూ!" కవర్ని అందించింది.

తాయారు బైటికి వెళ్తుంటే;

"ఎవరైనా కలిస్తే మాట్లాడుతూ వుండిపోగలవు తాయారూ; త్వరగా వచ్చేయాలి సుమా!" అంది అరుణ ముసిముసి నవ్వుల్తో.

తాయారుకూడా నవ్వుకుంటూ నిష్క్రమించింది.

అరుణ మళ్ళీ వారపత్రిక చేతిలోకి తీసుకుంది. అయినా చదవడానికి మనస్కరించలేదు. ఆమె మెదడు పదే పదే మాధవరావుని జ్ఞప్తికి తెస్తోంది. అతన్ని గురించిన ఆలోచనల తరంగాలే ఒకదాని వెనుక మరొకటి లేచి పడుతున్నాయి. తన వుత్తరం చదువుకొని, మావఁయ్య యేమనుకుంటాడో, యేవిఁటో! నిరుత్సాహపడి, నిరాశను పెంచుకొని, మళ్ళీయెలా మారిపోతాడో, యెవరికి తెలుసు? ఈ ఆలోచన వచ్చేసరికి అరుణ ఆపాదమస్తకం కంపించిపోయింది. తను వుత్తరం రాయకుండా వూరుకుంటేనే శ్రేయస్కరంగా వుండేదేమో ననిపించింది. అయినా యెప్పటికయినా తన నిర్ణయం తెలియజేయ వల్సిందేగా! అనుకొని సమాధానపడింది తన వూరటకోసమే.

మనసు, మనసులో లేకపోయింది అరుణకి. ఆలోచనలతో మెదడు బ్రద్దలైపోతోంది. పుస్తకాన్ని బల్లమీద

పడేసి, గదిలోకిపోయి మంచంమీద ఒరిగిపోయింది. తన జీవననౌక యెక్కడికి చేరుకుంటుందో ఆమెకే తెలీడంలేదు.

*  *  *

సాయంత్రం అవుతావస్తోంది. అరుణ స్వయంగా వంట గదిలో వుండి తాయారు చేత కాఫీ తయారు చేయిస్తోంది. ఉప్మా బ్రహ్మాండంగా తయారయ్యిందంటూ క్షణం క్రితమే తాయారుని మెచ్చుకుంది. ఆ మెచ్చుకోలుకి తాయారు మురిసిపోయింది.

"అక్కా!" అనుకుంటూ ఉత్సాహంగా వచ్చింది శారద.

అరుణ ఆసక్తిగా చెల్లెలికేసి పరికించింది.

"అతను వచ్చాడక్కా! నువ్వొళ్ళు... అన్నట్లు పరిచయం చెయ్యాలిగా... పద..." అంటూ అక్కను తీసుకొచ్చింది శారద.

ముందుగదిలో కుర్చీలో కూచుని, గోడలకి తగిలించబడివున్న ఫోటోలకేసి తదేకంగా చూస్తున్నాడు ఆనందం.

"మేష్టారూ! ఇదిగోండి మా అక్కయ్య... ఈయనే నక్కా, మా మేష్టారు, ఆనందంగారు!" అంటూ పరిచయం చేస్తున్నంతలోనే వాళ్ళిద్దరూ ఒకర్నొకరు చూసుకొని, సంభ్రమాశ్చర్యాలతో స్తంభించి పోయారు, క్షణం పాటు.

15)

తన పొరపాటు తెలుసుకుని చప్పున తేరుకుంది అరుణ. "నమస్కారం..." అంది చేతులు జోడిస్తూ. ఆమె గొంతులో సహజత్వం యెందుకు లోపించిందో అర్థంకాలేదు శారదకి.

"నమస్కారం!" జేలమొహం వేస్తూ అన్నాడు ఆనందం నుంచుని.

"శారదా! నువ్వెళ్ళి టిఫిను, కాఫీ పట్రా!" అంది అరుణ...

శారద ఉత్సుకతతో అక్కణ్ణించి వెళ్ళిపోయింది. పాపం, ఆమెకి ఎటువంటి సందేహమూ ఉత్పన్నం కాలేదు— వారి సంభ్రమం చూసికూడా... అమాయకురాలు!

"ఎన్నాళ్ళకి మళ్ళీ కలుసుకున్నాం అరుణా!" మెల్లగా అన్నాడు ఆనందం.

"ఔను ఆనందం. చాలా రోజులకి కలుసుకున్నాం. అదీ విచిత్రపరిస్థితుల్లో" నిర్లిప్తంగా అంది అరుణ. ఆమె హృదయాంతరాళంలో అంతులేని తుఫాను చెలరేగింది. ఒక ప్రక్క కోపం, మరో ప్రక్క ఆవేదన, ఆమెను ఊగిసలాడిస్తున్నాయి. మొహం, అప్రయత్నంగా అరుణారుణ మయింది. ఇప్పుడు తను యేం చెయ్యాలిః అతను తనకి చేసిన అన్యాయానికి ప్రతిగా, అవమానించాలా? లేక ఆవేదననుగుండెల్లో దాచుకొని చెల్లాయి సుఖం చూడాలాః... ఈ సందిగ్ధంలో సతమతమైపోతోంది. తన ఆశలు యేనాడో మట్టిపా

లయ్యాయి. ఆనందం పట్ల తనకిప్పుడు అనురాగం లేదు ద్వేషం తప్ప; అటువంటప్పుడు అతన్ని అవమానించి, చెల్లాయి ఆశల్లో చిచ్చు రగల్చడమెందుకు?... అనుకుంది.

"నిజమే అరుణా! విచిత్ర పరిస్థితే యిది. శారద నీ చెల్లెలని నాకు యింతవరకూ తెలీదు."

"తెలిస్తే, ప్రేమించడం మానేసేవాడి వన్నమాట!"

"అదికాదు నా అభిప్రాయం..."

"మరింకేవిటి?..." ఆమె గొంతు కాస్త కటువుగా విన్పించింది. "నాకు తెలీక అడుగుతాను ఆనందం_ ఆడపిల్లల జీవితాలతో చెలగాటాలాడ్డం, నీకు సరదాగా వుంటుందా?"

ఆనందం మనస్సు చివుక్కు మంది. తను అలాంటివాడు కాదని, అతనికే తెలుసు. కాని, ఆమెకి జరిగిన అన్యాయానికి, ఆమె ఆ విధంగా తలచడంలో తప్పు లేదనిపించింది. అయితే, ఆమెను నమ్మించడ మెలా?...

"నీకు జరిగిన అన్యాయం దృష్ట్యా, యీ నిందకు నేనరు్హణ్ణే అరుణా! కాని, ఇందులో నా తప్పేమీ లేదు. కావాలని నేనిలా ప్రవర్తించలేదు. నిజం తెలుసుకుంటే, నువ్విలా నిందించవు."

"ఏవిటో నిజం ఆనందం?"

"నమ్ముతావా?"

"నమ్మదగినదిగావుంటే, ఎందుకు నమ్మను!"

"ఆనర్సు పూర్తిచేశాక, మా ఊరు వెళ్ళాను. అదీ హఠాత్తుగా వెళ్ళాల్సి వచ్చింది. అందుకే, నీతో కూడా చెప్ప లేను. నేను అక్కడికి చేరుకునేసరికి. మా నాన్న చావు బ్రతుకుల మధ్య కొట్టుకుంటున్నారు. కేవలం నన్ను కళ్ళారా చూడ్డానికే ఆ కాస్త ప్రాణం వుందేమో నన్పించింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఆయన్ని బ్రతికించుకోలేకపోయాను అరుణా! ఈ 'విశ్వం'లో నాకున్న నా అనే వ్యక్తి నాన్న ఒక్కరే! ఆయన కళ్ళుమూశాక, ఎంతగానో కృంగి పోయాను. నా భవిష్యత్తుగురించి ఎన్నో బంగారు కలలుగన్న నాన్న, నా వున్నతిని కళ్ళారా చూడకుండానే కళ్ళు మూసి నందుకు, కుమిలిపోయాను. అంతకంటె నేను చెయ్యగలిగిం దేముంది! రిజల్ట్సు వచ్చాయి. పాసయ్యాను. కాని,పాసయ్యా ననే సంతోషం లేకపోయింది. తర్వాత అక్కడివ్యవహారాల్లో మునిగిపోయాను. ఆ ఊరు విడిచిపెట్టలేని పరిస్థితి యేర్పడింది. అందుకే అక్కడి హైస్కూల్లో కొన్నాళ్ళు టీచరుగా పని చేశాను. ఆ సమయంలో నువ్వు జ్ఞాపికి వచ్చావు. కాని, నీ ఉనికి తెలుసుకోవడం యెలా? నీ అడ్రసు తెలీదు నాకు. పోనీ, ఇక్కడికివచ్చి వెదుకుదామనుకుంటే, నీ యిల్లుకూడా తెలీదు. మన యిద్దర్నీ దూరంచేసిన యీ పరిణామాలకు, వ్యధాభరితుడనై, కుమిలిపోయేవాణ్ణి. అప్పుడప్పుడు జీవిత మ్మీద విరక్తి పుట్టేది కాని, దానివల్ల ప్రయోజనం లేదని నాకు తెలుసు. ఎప్పటికైనా నువ్వు కలుస్తావనే నమ్మకం, నాలో ప్రగాఢంగా యేర్పడింది. అందుకే, హృదయాన్ని రాయిచేసుకొని, ఏదోవిధంగా జీవితాన్ని కొనసాగిస్తున్నాను.

అంతలోనే ఈ ఊళ్లో ఉద్యోగం దొరికింది. చదువుకున్న చోటే ఉద్యోగం దొరకడం, కొత్త అనుభూతిని కలిగించింది. వచ్చే శానిక్కడికి. నువ్వు కనిపిస్తా వనుకున్నాను. నా ఆశ ఫలించింది కాదు. ఓ రోజు క్లాసులో శారదని చూశాక, నా మనస్సు చెదిరిపోయింది. ఆమె నామనస్సుని దోచుకుందంటే అందుకు కారణం ఏమిటో, నే నూహించుకోలేక పోయాను. క్రమంగా హృదయఫలకం మీద నీచిత్తరవు చెరిగిపోసాగింది. ఆ స్థానాన్ని శారద ఆక్రమించుకుంది. ఇదీ కథ... ఇందులో నా తప్పేమిటో ఆలోచించు."

అరుణ గట్టిగా నిశ్వాసం వదిలింది.

"మగాళ్ళ తప్పులు యెప్పుడూ వుండవు ఆనందం! అది స్త్రీ జాతి దురదృష్టమే!"

"ఇంకా నువ్వు నమ్మకపోతే, యేంచేసేది అరుణా? నిన్ను వంచన చెయ్యాలన్న తలంపు, నాకెప్పుడూ లేదు!"

"సరేలే ఆనందం! జరిగిందేదో జరిగింది. నువ్వేవో కారణాలు చెబుతూవుంటే, వాటిని ఖండిస్తూ, ప్రశ్నపరంపరలతో నిన్ను వుక్కిరి బిక్కిరి చెయ్యడం నాకిష్టంలేదు. నేను కోరుకున్నది ఒక్కటే; నన్ను మర్చిపోయినట్టు, యింకేవో సాకులుచెప్తూ, శారదను మర్చిపోకు.అది బొత్తిగా అమాయకురాలు. దాని భవిష్యత్తును, నే నెంతో వున్నతంగా ఊహించుకున్నాను. నా వూహాల్ని వమ్ముచెయ్యకు. అదీ నా అభ్యర్థన" అంది...అరుణ. ఆమె గొంతు బొంగురుపోయింది.

అవ్యక్తమైన ఆవేదన, ఆమె కళ్ళల్లో దోబూచులాడు

తూండటం, గమనించాడు ఆనందం. అతని మనస్సూ వికల మయింది. తను యిటువంటి సమస్యను యెదుర్కోవాల్సి వస్తుందని యెప్పుడూ వూహించలేదు కూడాను. మెదడుని సముద్రతరంగాల్లా, ఆలోచనలు పడిలేస్తూ, చిందరవందర చేస్తున్నాయి. భగవాన్! యిప్పుడు నేనేం చెయ్యడం? ... మనసులో తలపోశాడు. అరుణను పూర్తిగా విస్మరించి శారదను వివాహం చేసుకోవడమా?

"మరి, నీ విషయం?" అన్నాడు మెల్లగా.

అరుణ, పేలవంగా మందహాసం చేసింది.

"నా గురించి నువ్వింక ఆలోచించ కూడదు ఆనందం. ఇది మరుగున పడినగాథ. దాన్ని వెలికి తీస్తే, అనన్యమైన మనస్తాపానికి అందరూ గురికావల్సి వస్తుంది. ముఖ్యంగా శారద హృదయం పగిలిపోతుంది. ఆమె ఆ వేదనను నేను చూళ్ళేను. అందుకే, యీ విషయాన్ని మర్చిపొమ్మంటున్నాను. నా చెల్లెలయినా సుఖంగా వుండటమే నేను కోరుకునేది. మన ప్రణయ జీవితమంతా, ఓ కలలా భావించి, మర్చిపోవడం మంచిది."

"అంతే అంటావా అరుణా?" అన్నాడు ఆనందం. యదాలాపంగా అలా అడిగానేగాని, అరుణ ఏమాత్రం తన అభిప్రాయాన్ని మార్చుకున్నా, శారదను వదులుకొని అరుణను చేసుకుందుకుసంసిద్ధంగాలేడు. అవిఆమెముఖప్రీతికిచెప్పిన మాటలే! అయితే, అరుణ అలా అతణ్ణి శంకించలేదు. అతని మాటలు నిజంగానే నమ్మింది. తనిప్పుడు అతనిపట్ల అభిమా

నాన్ని కనబరిస్తే, శారదకు అన్యాయం చేసినట్టవుతుందని ఆమె భావన. అదీగాక ఆమె కెందుకో యిప్పుడు ఆనందమంటే అనురక్తి లేశమైనా లేకుండా పోయింది.

"అంతే ఆనందం! ఇక మనం ఈ ప్రస్తావనని ఆపడం మంచిది. శారద వచ్చేస్తుంది" అంటూ మౌనం వహించింది అరుణ.

ఆనందం మొహం దించుకుకూర్చున్నాడు. అతనికీ ఆ భయమే వుంది.

అప్పుడే శారద వచ్చింది కాఫీ, టిఫినూ తీసుకుని.

"ఏమిటలా యిద్దరూ మౌనంగా కూచున్నారు! ఎంత పరిచయం లేని వ్యక్తులయినా, ఈ యిరవయ్యో శతాబ్దంలో యిలా మొహాలు ముడుచుకొని మౌనంగా కూచోవడం, సంస్కారానికే తలవంపు" వస్తూనే అంది మందహాసంతో.

తమమాటలేవీ శారద వినలేదని, వాళ్ళకో గట్టి నమ్మకం యేర్పడిపోయింది. అప్రయత్నంగా వాళ్ళు తృప్తిగా నిశ్వాసం వదిలారు. ఎవరిమట్టుకు వాళ్ళు తేలిక పడిన హృదయాలపై చేయి వేసుకున్నారు.

"అదేంకాదే శారదా! మాట్లాడ్డాని కే ముంటాయని చెప్పు? ఏవో మనకి అవసరమైన వివరాలు అడిగేసి వూరుకున్నాను" అంది అరుణ చిన్నగా నవ్వుతూ.

తర్వాత యెవ్వరూ యింకేం మాట్లాలేదు. ఆనందం టిఫిను తీసుకోవడంలో నిమగ్నుడయ్యాడు.

"మీరు మట్లాడుతూ వుండండి శారదా!" అనేసి వెళ్ళి పోయిందక్కణ్ణించి అరుణ.

ఆనందం కళ్ళప్పగించి వెళ్ళిపోతున్న అరుణ కేసి క్షణం చూడకుండా వుండలేక పోయాడు.

"ఏవిఁటి మేస్టారూ అలా చూస్తున్నారు ?" అంది శారద.

"అబ్బే! ఏంలేదు శారదా; మీ అక్కయ్యగారు చాలా వుత్తముల్లా వున్నారు" అన్నాడు.

శారద అదోలా నవ్వింది.

"ఉత్తమురాలు గాబట్టే, ఆమె జీవితం సాఫీగా సాగడంలేదు మేస్టారూ!" అంది నిరుత్సాహంగా.

"ఏమయిందేవిఁటి?" టిఫిను ముగించి, చేయి తుడుచుకుంటూ అన్నాడు.

"అదంతా ఓ పెద్ద గాథలెండి... తర్వాత యెప్పుడో చెబుతా!"

"సరే!"

"మా అక్కకి యెన్నోసార్లు చెప్తూ వుంటాను మేస్టారూ, అంత మంచిగా వుండటం మంచిది కాదని. నా మాట వింటేగా ? ఏమన్నా అంటే, చిన్నదానను నాకేం తెలుసని ఎదురు ప్రశ్న వేస్తుంది. దాంతో నా నోటికి తాళం పడుతుంది."

"అంతకంటె నువ్వు మాత్రం యేం జేస్తావులే!" కాఫీ తీసుకుంటూ అన్నాడు.

"మేస్టారూ, నాకు తెలీక అడుగుతాను—వయసులో చిన్నయినంతమాత్రాన, బుద్ధిలో చిన్నతం ఏర్పడుతుందా?"

"ఇక్కడ 'బుద్ధి' అన్నదానికి నిర్వచనం ప్రపంచానుభవం శారదా! వయస్సుతో పాటే అనుభవం పెరుగుతుంది గాబట్టి, అలా అంటూ వుంటారు."

"నిజం చెప్పారు మేస్టారూ!" చిన్నగా నవ్వుతూ అంది శారద.

"శారదా! మరి నే వస్తా!" బయలుదేరాడు ఆనందం.

"ఇంతకీ, మా అక్క యేమంం దేవిటి?"

"అది తెలుసుకోవడం నీవంతు..."

"సరే!" అంది ముసిముసి నవ్వుల్తో. ఆనవ్వులో అగాధాలు తొంగి చూస్తున్నాయ్.

"మరి వస్తా!"

"మంచిది మేస్టారూ!"

ఆనందం ఉత్సాహంగా నిష్క్రమించాడు. అయితేనేం, అతని హృదయంలో చిన్న చిన్న ముళ్ళు గుచ్చుకున్నట్టుగా యేదో బాధగానే వుంది.

శారద కుర్చీలో కూలబడి పోయింది. ఆమె మెదడులో అంతులేని సంఘర్షణ జరుగుతోంది. రెండు చేతులతో తల పట్టుకుని, దిగులుగా వుండిపోయింది.

# 14

ఆనందం వెళ్ళిపోయిన పావు గంట వరకూ శారద, కూచున్న కుర్చీలోనే అలావుండిపోయింది. అక్క అగుపించాక తనే ప్రశ్నించడమా, మానడమా అనే సందిగ్ధం ఆమెను వుక్కిరి బిక్కిరి చేస్తోంది.

ఆనందం యింకా వుంటాడా! లేకపోతే, శారదఅక్కడే యెందుకుంటుంది?...అనుకున్న అరుణ ఆసక్తిని అణుచుకో లేక ముందు గదిలోకి వచ్చింది. చెల్లెలు ఒంటరిగా, దిగులుగా కూచునుండటం చూసి, నిర్ఘాంత పోయింది. ఆమెలో హాఠాత్తుగా ఆ నిరుత్సాహం యెలా అంకురించిందో అర్థంకాక, సతమతమైపోయి, దగ్గరగా వచ్చింది.

"ఏవిఁటే శారదా, అలా కూచున్నావు?" అంది.

శారద త్రుళ్ళిపడింది. ఆమె ఆలోచనల గొలుసు తెగి పోయింది.

"అబ్బే! ఏం లేదక్కా!" కంగారుగా లేచి నుంచుంది.

"అతను వెళ్ళిపోయాడా?"

"ఆ! యిప్పుడే వెళ్ళిపోయాడు..."

"కూచో!" అంటూ తనూ ఓ కుర్చీలో కూచుంది

అరుణ. శారద, తన కంగారును కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ కూచుంది.

"అతను వెళ్ళిపోతే, యిక్కడేం చేస్తున్నావే?" మళ్ళీ ప్రశ్నించింది అరుణ.

"ఏముంది? ఏంలే...వూరికనే అలా కూచున్నాను."

"అబద్ధం! నువ్వు నా దగ్గర దాస్తున్నావు కదూ? అయినా యీ పాటిదానికి అబద్ధం చెప్పడమెందుకే? నేను అంగీకరిస్తానో, లేదోనని కదూ నీ ఆరాటం? అదేకదూ, నీ ఆలోచనకి కారణం?" మెల్లగా నవ్వుతూ అంది.

శారద మాట్లాడలేదు. మొహం దించుకుంది. ఏం చెప్పడమూ అని, మాటల కోసం వెదుకుతోంది. చెల్లెలి మౌనాన్ని సిగ్గుగా గుర్తించింది అరుణ.

"ఎందుకే, అంతగా సిగ్గుపడిపోతావు? నా మనస్సు నీకు తెలీదూ? నీ మాట నేనెప్పుడన్నా కాదన్నానా? అతణ్ణి నువ్వు వివాహం చేసుకుందుకు, నేను మనస్ఫూర్తిగ సమ్మతిస్తున్నాను శారదా! అన్ని విధాల నీకు అతను తగిన వరుడుగానే భావిస్తున్నాను. అతని నీడలో నువ్వు తప్పకుండా సుఖిస్తావనే నమ్మకం, విశ్వాసం, నాకున్నాయమ్మా!" అంది వుత్సాహంగా.

శారదకి ఒక్కసారి దుఃఖం పెల్లుబుకొచ్చింది. రెండు చేతుల్లో కళ్ళుమూసుకుంటూ "అక్కా!" అంది. ఆమె స్వరం

బొంగురు పోయింది. అక్కడి వాతావరణంలో విషాదచ్ఛాయలు అలముకున్నాయి ఆ ఒక్క పదంతో.

అరుణ నివ్వెరపోయింది. అచ్చెరువందుతూ, చెల్లెలి దగ్గరగా పోయి ఆమె చేతుల్ని కళ్ళమీంచి తీస్తూ అంది:

"ఏవిఁటిది చెల్లాయ్! ఏమయింది? క్షణం క్రితం వుత్సాహంగా వున్నదానివి, ఇప్పుడేవిఁటే ఆవేదనకు గురయ్యావు? ఏవిఁటమ్మా చెప్పు..."

"నేనతణ్ని వివాహం చేసుకోను అక్కా!" అంది రుద్ధ స్వరంతో.

అరుణ మరింత విస్తుపోయింది. చెల్లాయిలో అనుకోని ఈ మార్పు, హఠాత్తుగా యెందుకొచ్చింది? కొంపదీసి ఆనందం, తనూ మాట్లాడినవన్నీ ఆమెవినలేదుకదా!...అన్న సందేహం కలిగిందంటే ఆశ్చర్యంలేదు. ఒకవేళ అదే నిజమైతే...? ...యింక ఆలోచించలేక పోయింది ఆమె హృదయస్పందన అధికమయింది.

"అదేవిఁటే శారదా! మనసిచ్చి, మనువుకోసం తాపత్రయపడుతున్న దానవు...యిప్పుడీ విముఖత యేవిఁటే? ఏం జరిగింది?" యధాలాపంగా ప్రశ్నించింది ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"నీ జీవితాన్ని నాశనం చేసిన వాణ్ణా, నేను పెళ్ళి చేసుకోవడమక్కా? నువ్వు కలకాలం కంట తడిపెట్టుకుంటూ కుములుతూ వుంటే, నీ వ్యధకు కారకుడైన వ్యక్తితోనే నేను కులుకుతూ వుంటానా చెప్పు? వద్దక్కా! అటువంటి

వ్యక్తి, నా జీవితానికి రథసారథి కావద్దు. విషయం తెలిసి కూడా, నేను సహించి వూరుకోలేను..." అంటూ అక్క ఒడిలోకి వాలిపోయింది శారద నిలపిస్తూ.

తన సందేహం, నిజమైనందుకు, అరుణ తల్లడిల్లి పోయింది. ఆమె నోట చెప్పిన మాట రాలేదు. యాదృచ్ఛికంగా ఆమె కళ్ళు నీటిమయ మయ్యాయి.

"మా సంభాషణ విన్నావా చెల్లాయ్?" మెల్లగా ప్రశ్నించింది.

"విన్నానక్కా! నిన్ను వంచించిన ఆ వ్యక్తి, ఇన్నాళ్ళ కయినా మన కంటబడినందుకు యెంతో ఆనందించాను. అతని వంచనను వంచనతోనే బుద్ధిచెప్పాలి. విఫలప్రేమం టేఏమిటో, అతను స్వానుభవంతో తెలుసుకోవాలి... తెలుసుకుని, కుమిలిపోవాలి. అప్పుడే నాకు తృప్తి మిగులుతుంది" ఆవేశంతో చెప్పుకుపోతోంది శారద. ఆనందం పట్ల, ఆమెలో యెంత ద్వేషం ఏర్పడిందో, ఆమె ప్రతీమాటలోనూ వ్యక్తమవుతోంది.

అరుణ గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది.

"వద్దమ్మా శారదా! అంత ఆవేశం వద్దు. ఆవేశం, మంచీచెడుల విచక్షణను మరిపిస్తుందమ్మా! ఆనందం నీ మీద పంచప్రాణాలు పెట్టుకునివున్నాడు. నువ్వు నిరాకరిస్తే, పిచ్చి వాడై పోతాడు."

"అలా అయితేనే నేను ఆనందించే దక్కా!"

"ఆ తలంపే వద్దంటాను, దానివల్ల మనకు కలిగే ప్రయోజనం యేముందని? కాకపోయినా, నన్ను కావాలని

వంచించలేదని వాపోతున్నాడతను. అతని మాటలు నిజమని నమ్మితే, యాదృచ్ఛికంగా కలిగిన యీ పరిణామాలకు అతణ్ణి బాధ్యుడిగా చేసి ప్రతీకారానికి పూనుకోవడం, బుద్ధిమంతుల లక్షణంకాదు. అనవసరమైన అపోహాలకు గురియై, నీ ఆనం దాన్ని నాశనం చేసుకోకు" బోధపర్చే ధోరణిలో అంది అరుణ.

"నేనంత స్వార్థపరురాలను కానక్కా! కాకూడదు కూడాను..." విసురుగా అంది.

అరుణ పేలవంగా నవ్వింది.

"ఇందులో స్వార్థమేముందే పిచ్చిదానా? నువ్వను కుంటున్న యీ స్వార్థాన్ని త్యాగం చేశావే అనుకో! దాని ఫలితం యేవిధంగా నాకు సహకరిస్తుందని నీ అభిప్రాయం? ఆనందం తన తప్పు తెలుసుకుని, మనసు మార్చుకుని, నన్ను చేపట్టడానికి సంకల్పిస్తాడనా, అభిప్రాయపడుతున్నావు?అలా అతను మారినా, నేను అంగీకరిస్తాననా, భావిస్తున్నావు? అదెప్పుడూ జరగదు శారదా! ఆనందం రూపం, యేనాడో నా మనస్సునుండి అదృశ్యమయ్యింది. దానికి మళ్ళీ నా హృదయంలో స్థానం వుండదు, అందుకే చెబుతున్నాను— పిచ్చి పిచ్చి ఆవేశాలకు తావివ్వొద్దని."

శారద క్షణం మౌనంగాయోచించింది. అక్క చెప్పిం దాంట్లో అసత్యం లేదనుకుంది.

"అయితే, ఇటువంటి వ్యక్తులకు గుణపాఠం చెప్పే దెప్పుడు?"

"అతను చెబుతుందే నిజమైనప్పుడు, అతని తప్పేవిటి? తప్పులేనప్పుడు గుణపాఠమేవిటి? అయినా, గుణపాఠం చెప్పినంత మాత్రాన వారిలో శాశ్వతమైన మార్పు వస్తుందనుకోవడం, తెలివితక్కువతనం చెల్లీ! మార్పన్నది స్వతహాగా రావాలి. ఒకరి బలవంతంమీద రాదు. ఉదాహరణకి, మావయ్య విషయమే తీసుకుందాం. ఆయన చెడు మార్గాన పోతూవుంటే, మార్చాలని ఎన్నోవిధాల తాతయ్య, నాన్న చెప్పారు. అబ్బే! యెవరిమాటలూ పనిచేశాయి కావు. కాని, నాన్న మరణాన్ని కళ్ళారా చూశాక తన తప్పేవిటో తనే విటో తెలుసుకుని, స్వతహాగా మారాడు. మళ్ళీ యేదో బలవత్తరమైన సంఘటన యెదురైతేనే తప్పించి, ఆ 'చెడు' వేపుకి మళ్ళీ దృష్టి మరలదు."

"నీతో నేనూ యేకీభవిస్తున్నాను అక్కా? మనిషి మారడానికి, యేదో బలవత్తరమైన సంఘటన కావాలంటావు! ఈ సంఘటన బలవత్తరమైంది కాదని యెవరు చెప్పగలరు? దీంతో ఆనందంలో మార్పెందుకు రాదు?"

"రావచ్చును శారదా! కాదనను. కాని దానివల్ల ప్రయోజనం లేదంటాను" తను యెంత చెబుతూవున్నా, చెల్లెలు తన మనసుని అర్థం చేసుకోనందుకు, కాస్తంత విసుగు కలిగింది అరుణకి. అందుకే చివరిసారి విసుగ్గానే అంది.

శారద మరేం మాట్లాడదల్చుకోలేదు. అయితే ఆమెకి మాత్రం లోలోన ఆనందంపట్ల ద్వేషం పెరుగుతూనేవుంది. అక్క మీద తనకిగల అవ్యాజమైన గౌరవమే తనలో యిటు

వంటి మార్పు తీసుకు వస్తోందని ఆమెకి తెలుసు. అందుకు ఒక విధంగా గర్విస్తోందికూడా.

చెల్లెలి మౌనం అరుణకి తృప్తి కలిగించింది. చెల్లెలు తన మాటను గౌరవిస్తుందనీ, లేనిపోని అపోహలు పెట్టుకోకుండా, ఆనందాన్ని వివాహం చేసుకుంటుందనీ భావించింది. పాపం ఆమెకేం తెలుసు— చెల్లెలి ఆంతర్యం యెలావుందో?

"భోజనం చేద్దాం లేవే శారదా!" అంది అరుణ.

"ఊఁ...పదవృతే..." లేచి కాఫీ కప్పు, టిఫిను ప్లేటు తీసుకుని లోపలికి నడిచింది శారద.

అరుణ నవ్వుకుంది చెల్లెలి చిలిపితనానికి. చెల్లెలు ఆనందం భార్య కాబోతున్నందుకు మురిసిపోయింది. నిజానికి శారద యెంతో అదృష్టవంతు రాలనుకుంది. ఆమె మెడిసిన్ చదవక పోతేనేం... ఓ లెక్చరర్ భార్య కాబోతోంది. ఇంతకంటె అదృష్టం యేం కావాలి?... అనుకుంది కూడా.

ఆ క్షణంలోనే అరుణకి హఠాత్తుగా తలిదండ్రులు గురుకొచ్చారు. వాళ్ళు పరోక్షంగా తనకి శారద బాధ్యతను అప్పజెప్పారు. ఆ బాధ్యత మరి కొద్దిరోజుల్లో తీరిపోతుంది; అదే తనకి జీవితంలో మిగిలిన పెద్ద తృప్తి!... అనుకుంది.

# 15

అరుణ డ్యూటీలో చేరడానికి బైలుదేరిం దారోజు. శారద ఒంట్లో నలతగావుందంటూ ఇంట్లోనే వుండిపోయింది. అరుణ యింకేవిధమైన ప్రశ్నలూ వెయ్యకండా వెళ్ళిపోయింది.

హెడ్ మిస్ట్రెస్ దగ్గరికి వెళ్ళేసరికి, ఆమె చేస్తున్నపని ఓ ప్రక్కకు నెట్టేస్తూ, అరుణని కూచోమంది. అరుణ ఆమెకి అభిముఖంగా కూచుంది.

"ఇప్పుడు నీ ఆరోగ్యం బాగా కోలుకుందనుకుంటాను అరుణా!" అంది హెడ్‌మిస్ట్రెస్.

"ఔనండీ! ప్రస్తుతానికి బాగున్నాను. ఈ రోజు జాయిన్ అవ్వాలనుకుంటున్నాను. సెలవుకూడా నిన్నటితో పూర్తయ్యిందిగా!"

హెడ్‌మిస్ట్రెస్, గట్టిగా ఓ నిశ్వాసం వదిలి కళ్ళద్దాలను తీసి టేబిలుమీద పెట్టింది.

"అమ్మా అరుణా, సెలవు దరఖాస్తుపంపినపుడు, యే రోజునుండయితే నువ్వు రాలేదో ఆరోజే పంపి వుండాల్సింది. మూడు రోజుల తర్వాత పంపితే ఎలా చెప్పు?"

"క్షమించాలి మరి! పంపడానికి మా యింట్లో యెవరున్నారు చెప్పండి? మా వంటావిడకు తీరిక లేకపోయింది. అయినా, మీరున్నారుకదా అన్నధైర్యంకూడా నా బద్ధకానికి దోహదమయ్యింది."

"నిజమేనమ్మా! నా మీద నీకు ఆపాటి నమ్మకం వుండటం సహజమే? అయితే, ఆ నమ్మకానికి న్యాయం చేకూర్చలేని పరిస్థితులు యేర్పడ్డాయి. ఏం చెయ్యను?" నిరుత్సాహంగా చెప్పుకుపోయింది హెడ్‌మిస్ట్రెస్.

ఆమె మాటలు అరుణకి యేమీ అర్థంకాలేదు. అసలు జరిగిం దేవిటో తెలుసుకోవాలన్న ఆసక్తి ఆమెను కలవరపర్చింది.

"ఇంతకీ యేమయ్యిందండీ?"

"నీ సెలవు మంజూరు కాలేదు అరుణా!"

"అంటే?" విస్తుపోతూ అడిగింది ఆమె మొహంలోకి చూస్తూ.

"ఈ స్కూలుకి పేరుకి మాత్రం నేను హెడ్‌మిస్ట్రెస్ నయినా, అస్వతంత్రురాల నన్నవిషయం నీకూ తెలిందికాదు. స్కూలు కమిటీ ఛైర్మన్‌గారు అస్వస్థతగా వుండటంవల్ల, డాక్టర్ రఘుగారే ఆ వ్యవహారాలు చూస్తున్నారు. ప్రస్తానికి ఆయిన నీ సెలవు విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధతీసుకుని, మంజూరుచేయునట్టుగా ఏర్పాట్లుచేసి, నీస్థానే అప్పుడే ఓ కొత్త టీచర్నికూడా వేసుకున్నారు. నువ్వు నిర్ణీత సమయంలో నీకు సెలవుకావాలన్నా విషయం తెలియజెయ్యక పోవడమే నీ తప్పుగా గుర్తించి టెంపరరీగా పనిచేస్తున్న వ్యక్తివిగాబట్టి, ఉద్యోగం నుండి తీసేశారమ్మా! ఆర్డర్సు కూడా నా దగ్గరే ఉన్నయ్..." అంటూ డ్రాయర్లోంచి ఆర్డరుతీసి, అరుణ ముందుంచింది.

అరుణకి నోట మాటరాలేదు. అలాగని ఉద్యోగం పోయినందుకు భయంతో వణికిపోతూ కలవరపడనే లేదు. కళ్ళముందున్న ఆర్డరు చదివింది. సరైన సమయంలో సెలవుకి దరఖాస్తు పెట్టలేదుగాబట్టి, విద్యాబోధన విషయంలో

కొన్ని యిబ్బందులకు విద్యార్థులు గురయ్యారని_ తద్వారా కమిటీవారు కూడా సంజాయిషీ చెప్పుకోవల్సి వచ్చిందికాబట్టి, తన నిర్లక్ష్యాన్ని సహించలేని 'కమిటీ' తనని ఉద్యోగం నుండి బర్తరఫ్ చేస్తున్నట్లుగా అందులో పేర్కోబడింది. అదంతా చదువుకున్నాక, అరుణ గట్టిగా ఓ నిట్టూర్పు విడిచి, పొడిగా నవ్వింది.

"నేను చేసింది, నన్ను ఉద్యోగంనుండి తీయదగినంత పెద్ద తప్పాండి?" అడిగింది మెల్లగా.

అరుణ బాధపడకపోవడమే కాకుండా చాలా నెమ్మదిగా యీ ప్రశ్న వెయ్యడం, హెడ్‌మిస్ట్రెస్‌కి ఆశ్చర్యం కలిగించింది. బహుశా ఆమెకి ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం లేదేమోనన్న నిర్ణయానికి రాకతప్పిందికాదు. నిజానికి ఆమెను ఉద్యోగంనుండి తీసెయ్యడం, తనకీ కష్టంగానే వుంది. కాని తను యేం చెయ్యగలదు; కమిటీ చేతిలో కీలుబొమ్మ తను. ఇలా వుండని పక్షంలో తనకీ అరుణ గతే పడుతుందని హెడ్‌మిస్ట్రెస్ భయం.

"నువ్వు చేసింది అసలు తప్పేకాదమ్మా! హఠాత్తుగా వంట్లో బాగోలేకపోతే యేంచేస్తాం? కాని కమిటీవారి నిర్ణయానికి మనం బద్ధులంకదా!" అని అంటూ కాస్త ముందుకు వంగి "అరుణా! ఒక్క విషయం అడుగుతాను చెప్పు..." అంది మెల్లగా యేదో రహస్యం అడగబోతున్నట్టుగా.

"అడగండి..."

"ఈ స్కూల్లో యిటువంటి సంఘటన జరగడం యిదే

ప్రథమం. ఇలా జరగడానికి తెరవెనుక కారణం ఏదో వుంటుందని నా అంచనా. అయితే అది నిన్ను అడిగి తెలుసుకోవాలనే నా అభిప్రాయం. ఈరోజు నీ విషయంలో జరిగింది; రేపు నాకూ యిదేగతి పట్టొచ్చు. ఏమో, ఎవరు చెప్పగలరు? ఇంతకీ, నా ప్రశ్న యేవిఁటంటే, డాక్టర్ రఘుకీ, నీకూ మన స్పర్ధలేమైనా వున్నాయా? ఇలా అడుగుతున్నానని నన్ను అపార్థం చేసుకోకమ్మా. కేవలం నిజం తెలుసుకోవాలన్న ఆసక్తితోనే అడుగుతున్నాను..."

అరుణ చిన్నగా నవ్వింది. తన ఉద్యోగం పోయినందుకు, ఆమెకి యేపాటి మనస్తాపం లేదు. కాని, అధికారం చేతిలోవున్న అవకాశాల్ని యెలా వినియోగించుకుంటుందో ఆలోచిస్తుంటేనే నవ్వొస్తోందామెకి.

"మీ వూహా గురితప్పలేదండి మేడమ్; సరిగానే గ్రహించారు. అయితే, డాక్టర్ రఘుగారు నా మీద ఇంతటి కక్షపూని, తన అధికారాన్ని వినియోగించి, అపకారం చేస్తారని నే నెప్పుడూ వూహించలేదు. ఆయనకి నేనేం అపకారం చెయ్యలేదు. చేయని అపకారానికి, నామీదెందుకు కక్షవహించారో, నాకే అర్థంగాకుండా వుంది..." అంటూ ఆగింది.

"అపకారం చెయ్యకుండానే, యీ కక్ష యెందుకైతే?" హెడ్‌మిస్ట్రెస్ ప్రశ్న.

"అదే అర్థంకాని ప్రశ్న మేడమ్. విషయం యేవిఁటంటే, ఆయనతో నాకు అట్టే పరిచయం లేకపోయినా, ఓరోజు మాటల సందర్భంలో తనని వివాహం చేసుకోమ్మని

కోరారు. ఆయన బహుశా అభిప్రాయపడుండొచ్చు- నేను కాదననని. అతను యేది వూహించలేదో, అదే జరిగింది. ఆయన కోరికను త్రోసిపుచ్చాను. దానికి కారణాలడగవద్దని కోరాను. ఇంతకుమించి, మాలో యింకేవిధమైన భేదాభిప్రాయాలు రాలేదు. ఇదే నేనుచేసిన ఓ పెద్ద తప్పయితే, వ్యక్తిత్వం వుండాలను కోవడమే పొరపాటేమో! ఆనాటి నా నిరాకరణకి, యిప్పుడిలా ప్రతీకారం తీర్చుకున్నారాయన. అధికారాన్ని అల్పుల పాలుచేస్తే, యిటువంటివే సంభవిస్తాయేమో?" నిట్టూర్పు విడుస్తూ అంది అరుణ.

"ఇదన్నమాట విషయం! మొదటే నేననుకున్నాను, యిటువంటిదేదో కారణం వుండి వుంటుందని. ఎంత ధైర్యంగా వుందామనుకున్నా, ఆడవాళ్లు వుద్యోగాలు చెయ్యడంలో, యిటువంటి బలహీనతలే కొన్ని వుంటాయమ్మా అరుణా! డాక్టర్ రఘుగారుకూడా యింత అసభ్యంగా ప్రవర్తించడం, జుగుప్స కలిగిస్తోంది. ఆయన యింతటి కపట వ్యక్తి అని యింతవరకూ నేననుకోలేదు. మనుషుల నిజరూపం బైటపడే వరకూ, వాళ్ళు పెద్ద మనుషులే! అతని ప్రతీకార జ్వాలకు, నువ్వు ఆహుతి అవుతున్నందుకు, నేను చాలా చింతిస్తున్నాను." సానుభూతితో అంది హెడ్‌మిస్ట్రెస్.

అరుణ చిన్నగా నవ్వింది.

"అబ్బే! అలా మీరు భావించకండి. ఆయన ప్రతీకార వాంఛ నన్నేంచేస్తుంది? నాకేదో ప్రతీకారం చేసినట్టుగా భావించి, ఆయన ఆనందిస్తూ వుండొచ్చు. కాని, యిదినాకు

యేవిధంగానూ నష్టం కలిగించడం లేదు. నిరుత్సాహం అంత కంటె లేదు." అంది వుత్సాహంగా

హెడ్‌మిస్ట్రెస్ విస్తుపోయింది. ఉద్యోగం వూడిపోతే యెవరైనా విచారంతో, చెప్పలేని యేదో భయంతో కృంగి పోతారుగాని, అరుణలా నిశ్చలంగా, వుత్సాహంగా తనకేం జరగనట్టుగానే వున్నవాళ్ళను ఆమె యింతవరకూ చూళ్లేదు. అందుకే ఆశ్చర్యం.

"అయితే నువ్విప్పుడేం చేస్తావ్ అరుణా!" సూటిగా ఆమె కళ్ళల్లోకి పరికిస్తూ అంది.

"యింకేం చేస్తాను మేడమ్? మీరు ఆర్డరిచ్చారుగా; స్కూలుకి గుడ్‌బై కొట్టేసి, యింట్లో కూచుంటాను."

"పోనీ, ఓసారి డాక్టర్ రఘుని కలిసి చూడకూడదూ?"

"అతని కపట ప్రవర్తనని గుర్తించిన మీరుకూడా, ఈ సలహాయివ్వడం వింతగావుంది మేడమ్! యిటువంటి విషపురుగును ప్రాధేయపడం కంటె, వేరే వుద్యోగమేదో చూసుకోవడం మంచిదని భావిస్తాను. ఒకవేళ వ్యక్తిత్వాన్ని చంపుకుని వెళ్ళి అడిగానే అనుకో...మన బలహీనత పెరిగి పోదూ?"

"అదీ నిజమే అరుణా అయితే, వేరే వుద్యోగంకోసం ప్రయత్నిస్తావా?"

అరుణ క్షణం ఆలోచించింది.

"లేదు మేడమ్! యిప్పుడే నేనొక నిర్ణయానికి వచ్చే

శాను! నేను మరీ వుద్యోగం చెయ్యను..." నిశ్చలంగా చెప్పింది.

"మరి, జీవితం గడపడం యెలా? మీ చెల్లెలి చదువు యెలా సాగుతుంది! ఇవి నీ స్వవిషయాలైనా, ఆసక్తికొద్దీ అడుగుతున్నందుకు అన్యథా భావించకు అరుణా !"

అరుణ మెల్లగా మందహాసం చేసింది.

"మిమ్మల్నెప్పుడూ అపార్థం చేసుకోను మేడమ్. మీ హృదయం నాకు తెలీదు గనుకనా? ఇన్నాళ్ళూ నన్నెంతో ఆదరంగా చూశారు. నా కెల్లప్పుడూ తోడు నీడై నిల్చున్నారు. అలాంటి మిమ్మల్నా అపార్థం చేసుకోవడం? మా జీవితాలు గడవడం, ఓ పెద్ద సమస్యకాదు మేడమ్. నేను వుద్యోగం చేస్తున్నానంటే కేవలం వుబుసుపోకకేగాని, మా జీవనాధారానికి కాదు. అక్కడే డాక్టర్ రఘుగారు పొరబడ్డారుపాపం! నన్ను అసహాయస్థితిలో పడేస్తే, జీవనాధారానికి మరోదిక్కుతోచక, ఆయన్ని ప్రాధేయపడతానని భ్రమపడ్డారు. కాని మా నాన్నగారు చెప్పుకోదగ్గ ఆస్తి విడిచిపెట్టిపోయారని అతనికి తెలీదు."

హెడ్‌మిస్ట్రిస్‌కి యిప్పుడర్థమయింది_ అరుణ అంత ధైర్యంగా యెలా వుండగలిగిందో!

"అయితే యింకేం అరుణా! హాయిగాయింటోకూచో. అతనిఊహ అతనికే యెదురుతిరిగిందని తల్చుకుంటూ నుమిలిపోతాడు. సరేగాని ఈ చిరాకులేవీ లేకుండా, పెళ్ళిచేసుకొని, హాయిగా జీవితాన్ని సాగించకూడదూ?"

అరుణ మొహం దించుకుంది కాస్తంత సిగ్గు చిగురించడంతో.

"ఆ విషయం గురించి యింక నేనేం ఆలోచించ లేదండీ!"

"అప్పుడు నన్ను మర్చిపోవుగదా ?" నవ్వింది హెడ్ మిస్ట్రెస్.

"అబ్బే మిమ్మల్ని యెలా మర్చిపోగలను? మరి నాకు సెలవిప్పించండి.ఇన్నాళ్ళూ మీరు నాకు చేసిన సహాయానికి యేవిధంగా కృతజ్ఞతలు తెలియజేసుకోవాలో అర్థంగాకుండా వుంది మేడమ్..." మెల్లగాఅంది లేచి నుంచుంటూ. ఆమె స్వరం మారిపోయింది. ఆ స్కూలునుండి శాశ్వతంగా వెళ్ళి పోతున్నందుకు బాధకలిగింది. అదోవిధమైన అనుబంధం మరి !

"అదేవిఁటమ్మా అరుణా అలా అంటావ్? నేను నీకేం సహాయం చేశానని! ఒకవేళ యేదైనా చేసివుంటే, అది నా వుద్యోగధర్మనిర్వహణే! నువ్వు కలకాలం సుఖంగా 'కల కల లాడుతూ జీవించాలని ఆశీర్వదిస్తున్నానమ్మా!" అంది హెడ్ మిస్ట్రెస్, అరుణ దగ్గరికివచ్చి ఆమె తలను ఆప్యాయంగా నిమురుతూ.

ఆ క్షణంలో అరుణ పొందిన అనుభూతి వర్ణనాతీతం. చెమ్మగిలిన కళ్ళను తుడుచుకుంది.

"వస్తాను మేడమ్;" అంటూ భారంగా అడుగులు వేస్తూ నిష్క్రమించింది.

హెడ్‌మిస్ట్రెస్ గట్టిగా నిశ్వాసం వదిలి, కుర్చీలో కూలబడిపోయింది. అరుణవంటి ఉత్తమురాలు ఆ స్కూలు వదిలిపెట్టినందుకు కాదు_ అటువంటి వ్యక్తిని కమిటీవారే వదులుకున్నందుకు, యెంతో బాధపడింది. విద్యారంగంలో కూడా ద్వేషాలూ, అసూయలూ పెంచుకుని, ప్రతీకారం కోసం కాచుక్కూర్చున్నారంటే, ఆమెకి ఆశ్చర్యం కలిగింది. కాని, ఏం చేస్తుంది? తనేమీ చెయ్యలేదని ఆమెకి బాగా తెలుసు.

* * *

"ఏవక్కా అప్పుడే వచ్చేశావు?" ప్రశ్నించింది శారద.

అరుణ కుర్చీలో కూలబడిపోయింది వస్తూనే. చప్పున జవాబు చెప్పలేదు. శారదకి ఆతృత, ఆసక్తి అధిక మయ్యాయి. అక్క మొహంలోకి తదేకంగా చూసింది. అంత రతమైన బాధేదో ఆ మొహంలోంచి తొంగి చూస్తోంది. ఆమెకేం అర్థంకాలేదు.

"ఏమయ్యిందక్కా? చెప్పు... నాకేవిటో భయంగా వుంది." మళ్ళీ అంది శారద, ఆతృతగా.

"భయపడవల్సిన విషయం కాదులే శారదా! నన్ను ఉద్యోగం నుండి తీసేశారు. అంతే!" నిశ్చలంగా అంది అరుణ.

"తీసేశారా? ఎందుకు? కారణం యేమిటి?" ఆత్రుత పడింది శారద.

"సకాలంలో సెలవుకి పెట్టలేదట. అందుకని నా ప్రవర్తన తృప్తికరంగా లేక, తీసేశారు."

"ఈ మాత్రం దానికి యింత పెద్ద శిక్షా?"

"వాళ్ళదృష్టిలో యిది పెద్ద తప్పు."

"అన్యాయం... నువ్వు వూరుకున్నావా?" విసురుగా అడిగింది శారద, తనైతే ఏదో చేసేద్దు నన్నట్టుగ.

అరుణ తేలిగ్గా నవ్వేసింది.

"ఊరుకోక, ఏం చేస్తామే? అధికారం వాళ్ళ చేతుల్లో వుంది. దీని మూలకారణం ఏమిటో తెలుసా?"

"ఏమిటి?"

"ఆ మధ్య ఓసారి నీతో చెప్పాను, గుర్తుందా— డాక్టర్ రఘు తనని వివాహం చేసుకోమని అర్థించినట్టు..."

"ఔనూ... అయితే?"

"అప్పుడు నేను నిరాకరించానని చెప్పానుగా..."

"ఔను... దానికీ, నీ ఉద్యోగానికీ సంబంధమేముందని?"

"ఉందిగాబట్టే, చెప్పాల్సి వస్తుంది శారదా! డాక్టర్ రఘు ప్రస్తుతం స్కూలుకమిటీ చైర్మన్‌గా వ్యవహరిస్తున్నారు. స్కూలుకి సంబంధించిన అధికారాలన్నీ కమిటీ వేగా! ఈ అవకాశాన్ని బాగా వినియోగించుకున్నాడు డాక్టర్ రఘు. నా నిరాకరణకి యెదురుదెబ్బ తీశాననుకున్నాడు."

"వాడి మొహం! ఈ ఉద్యోగం కాపోతే మరోటి

అవుతుంది." కాస్త కోపంగానే అంది శారద. ఆ క్షణంలో డాక్టర్ రఘు యెదురుగా వుంటే, తీసి లెంపకాయకొట్టా లన్నంత ఉద్రేకం, ఆమె మొహంలో జేవురించింది.

"అది నిజమే అనుకో! అయితేనేం_ నేను మరో నిర్ణయానికి వచ్చాను..."

"ఏవిటక్కా అది?"

"అసలు, ఇంకే వుద్యోగమూ చెయ్యకన్నేను."

"ఆ! అదేవిటా నిర్ణయం?"

"కాదే! ఏవిటో మరి _ ఉద్యోగం చెయ్యాలన్న ఆసక్తి మరి కలగడంలేదు."

శారద మరేం మాట్లాడలేదు. అక్క ఏ నిర్ణయానికి వచ్చినా, ఆలోచించే ఆ నిర్ణయానికి వస్తుంది. ఇక వ్యర్థ ప్రశ్నలతో ఆమెను విసిగించడం, మనస్కరించలేదు. ఇప్పటికే ఆమెలో నిరుత్సాహం, నిస్పృహ, గడ్డకట్టుకొని వున్నాయి. వాటికి తోడుగా యిదో అపశ్రుతి... అక్క యెంతగా బాధ పడుతుందో పాపం!...అనుకుంటూ మనసులో వాపోయింది శారద.

అరుణ లేచి మెల్లగా లోపలికి నడిచింది. శారద నిట్టూరుస్తూ కుర్చీ వెనక్కి చేరగిలబడింది.

## 16

అరుణ ఉత్తరం చదువుకున్న మాధవరావు నిస్పృహ చెందాడు. తన జీవితానికి ఓ వెలుగుజ్యోతిగా వుండి ముం

దుకు తీసుకుపోతుం దనుకున్న అరుణ, తన అభ్యర్థనను మన్నించకపోవడంతో, అతని హృదయం పగిలిపోయింది. ఇతఃపూర్వం తనప్రవర్తన బాగుండక, అప్పట్లో ఆమె నిరాకరించిందన్నా, అసహ్యించుకుందన్నా, అర్థం వుంది. ఇప్పుడు తనని అసహ్యించుకుందంటే, ఏమనుకోవాలో అతనికి బోధపడ లేదు. ఆమె విముఖత అసహ్యతలో కూడిందనే అతని భావం. నిజానికి అరుణలో ఆ భావమే లేదు. అయితేనేం.— ఒకరి మనసులోని మాట మరొకరు యెలా తెలుసుకోగలరు?

మాధవరావు ఆ ఉత్తరాన్ని చదువుతూవుంటే, యెక్కడో ఓ ఆశాకిరణం కూడా కనిపించకపోలేదు. అది అంత ఉత్సాహాన్ని కలిగించలేదు. ఆమెలో జరుగుతున్న సంఘర్షణ ఏమిటో, అదెప్పుడు అంతమవుతుందో, అప్పుడు ఆమె మనస్సు యెలా మారుతుందో, తనపై కరుణ కలుగుతుందో, లేదో_ అది అనూహ్యమయ్యింది. అగుపించిన ఆశాకిరణం 'చప్పున' మాయమైపోతోంది.

మాధవరావు వ్యాపారం బాగా సాగుతోంది. పుష్కలంగా గడిస్తున్నాడు. ఉద్యోగం కంటె వ్యాపారమే బాగున్నట్టనిపించిందప్పట్లో. అతన్నిప్పు డందరూ అభిమానిస్తున్నారు. తన జీవితంలో మార్పు రావడమే గాకుండా, మారిన జీవితం మూడుపువ్వులూ, ఆరుకాయలుగా సాగుతున్నందుకు మురిసిపోతుంటారు అప్పుడప్పుడు. ఎటొచ్చీ, జీవిత భాగస్వామిని గురించే అతని కలవరమంతాను. అతని దృష్టిలోకి అరుణ మినహా మరొక స్త్రీ రావడం లేదు. అందుకే, మరో అభ్య

రన పత్రం పంపించాలని నిర్ణయించుకున్నాడు. ఆరోజు రాత్రి కూచుని ఓ ఉత్తరాన్ని రాసి, మరునటిరోజు పోస్టుచేశాడు.

* * *

శారద యేదో ఒక సాకు చెబుతూ, కాలేజీకి వెళ్ళకండా వుండిపోతూండటం, అరుణకి అర్థంగాని విషయమయ్యింది. చెల్లెలికి చదువుపట్ల ఆస క్తి తగ్గిపోతుందేమోనన్న సందేహం కలిగిందంటె, ఆశ్చర్యం లేదు.

"ఏవిఁటే శారదా, రోజూ యిలా యింట్లో వుండిపోతే, చదువెలా సాగుతుంది?" అంది అరుణ, వుండబట్టలేక.

"నాకింక చదవాలన్న ఆస క్తి లేదక్కా! ఇక్కడితో చదువుకి స్వస్తిచెప్తున్నాను." అంది శారద, ఇంకా ఏవేవో సాకులు చెప్పడం, యిష్టంలేక.

అరుణ నివ్వెరపోయింది. చెల్లెలిచదువుగురించి తను యెన్నో కలలు గన్నది. ఇంతవరకూ, యేవేవో ఆశలు పెట్టుకునే వుంది. అయితేనేం— అనుకోని ఆటంకాలు వచ్చిపడుతూనేవున్నాయి. బహుశా, తన ఆశలు చిగురించవేమో! తన కలలు కల్లే అవుతాయేమో! అనుకుంది నిరుత్సాహంగా.

"ఎన్నిసార్లు చెప్పినా, ఏవిఁటే నీ చిలిపితనం? ఈ సంవత్సరం పూర్తికానీయ్, మానేద్దువుగాని!"

"ఈ ఒక్క విషయంలో నన్ను క్షమించు అక్కా! నా మనస్సు చదువుపై లగ్నం కాకపోతే యేం చెయ్యను? అందుకే, మానేస్తున్నాను."

అరుణ, గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది. తమ జీవితా

లకు అర్థం యేమిటో, ఆమెకి అర్థం కావడంలేదు. వాడిపోయిన తన హృదయకుసుమాన్ని, ఉపాధ్యాయిని వృత్తిలో చిగురించుకుంటూ, తృప్తిగా కాలం గడపాలనుకున్న తనకి ఉద్యోగం పోవడం పెద్ద అఘాతమే! అయినా, ఆ బాధను బాహ్యంగా వ్యక్తం చెయ్యలేదింతవరకూ. చెల్లెలిపై యెన్నో ఆశలు పెట్టుకుని వుంటే యిప్పుడది చదువు మానేస్తానంటోంది. ఇద్దరి జీవితాలు, ఇప్పుడు ఒక లక్ష్యంలేని వయ్యాయి. ఇప్పుడేం చెయ్యడం?... యీ ప్రశ్న అపరిష్కృతంగా నిలిచిందామె ముందు.

"ఇప్పుడు మనిద్దరం యింట్లో కూచోవల్సిన వాళ్ళమేనే! అటువంటప్పుడు, యిక్కడ వుండటం అనవసరమనిపిస్తుంది. తాతయ్యదగ్గరకు పోతే కాదూ?" అంది అరుణ.

ఆనాడు మావయ్యతో తను పలికిన ప్రగల్భాలు, గుర్తుకు వచ్చినయ్ శారదకి. అందుకే ఈ తరుణంలో అక్కడ్నించి పోవాలన్న వుద్దేశం వున్నా, అభిమాన మొకటి అడ్డొచ్చి, తాతయ్యగారింటికి వెళ్ళడానికి మనస్సు యెదురు చెప్పింది.

"అది నాకేం యిష్టంలేదక్కా! ఇక్కడవుంటేమాత్రం మనకొచ్చిన నష్టమేమిటి? మన బ్రతుకులు మనం బ్రతుకుదాం. జీవితాలు గడపడానికి ఆర్థికంగా, మనం యెవరిమీద ఆధారపడి వుండనవసరం లేదుగా!"

"అది నాకూ తెలుసును శారదా! కాని, యిలా యెన్నాళ్ళు! అందుకే, నేనంటున్నాను— నువ్వు ఆనందంని

వివాహం చేసుకో! నీ జీవితానికి శాశ్వతమైన ఆసరా ఏర్పడు తుంది_ నాకూ తృప్తి మిగులుంది" అంది అరుణ.

"అక్కా! నా వివాహ విషయం, ప్రస్తావించకు ప్రస్తుతానికి" మొహంతిప్పుకుని నిర్లక్ష్యంగా అంది శారద.

"అయితే, యింకా నువ్వు ఆనందం పట్ల ద్వేషంతోనే వున్నావన్నమాట..."

"ద్వేషంకాదు...అసహ్యం ... ఇప్పుడు నేనొక్కటే ఆలోచిస్తున్నాను అక్కా" అంటూ ఆగింది.

"ఏమిటది?"

"నా వివాహమే ఒక సమస్యగా నిలబడితే, ఆసమస్యా పరిష్కారమే నీకు తృప్తిని కలిగిస్తే, అందుకు మార్గం నేనాలోచించాను."

"అదే, యేమిటీ?" అని ఆసక్తితో అడిగింది మళ్ళీ అరుణ.

"మాధవరావు మావయ్యను నేను వివాహం చేసుకుంటాను" నిశ్చలంగా అంది శారద.

అరుణ, నిర్ఘాంత పోయింది. చెల్లెలికి యీ తలంపు యెందుకు స్ఫురించిందో, ఆమెకి అనూహ్యమయింది. మావయ్యపట్ల చెల్లాయికి అభిమానం వుందని, ఒకప్పుడు తను అనుకుంది. ఆ అభిమానమే, యిప్పుడు అనురాగంగా మారుతుందని కలలో కూడా వూహించలేదు.

"ఏమిటే శారదా, నువ్వంటున్నది ?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"నిజమే అక్కా! ఇదే నిర్ణయానికి వచ్చాను. ఆనందం

మేష్టారులాంటి వంచకుడు కాదు మావయ్య. నేనేగాని నా అభిమతాన్ని వ్యక్తం చేశానంటే, మావయ్య యెగిరి గంతేస్తాడు. తనలాంటి అదృష్టవంతుడు మరొకడు లేడని మురిసిపోతాడు. తాతయ్యకూడా పరమానంద భరితుడౌతాడు!"

"మరి, ఆనందం విషయం ఆలోచించడం లేదా?"

"అతని గురించి ఆలోచించడం, అవసరమన్పించడం లేదు."

నిరుత్సాహంగా నిట్టూర్చింది అరుణ.

"నీ పట్టుదల నీదే అయితే, యింక నేనేం చెబుతానే శారదా? అకారణంగా ఆనందంని యెందుకు హింసిస్తావు?"

"అకారణం కాదు...కారణం వుండే నేనీ నిర్ణయానికి వచ్చానక్కా!"

"నువ్వనుకున్నది ఒక కారణం కాదు. నాకోసం నువ్వు త్యాగం చేస్తున్నానని అనుకోకు" అంది అరుణ.

శారద నిరుత్తరయింది. అక్కనోట ఆ మాట వస్తుందని ఆమె యెదురు చూళ్లేదు. నిజానికి, తను ఆనందం మేష్టార్ని అసహ్యించుకోవడం యెందుకు? అక్కను వంచించాడనేగా! అంటే, అక్క కోసమే తను అతణ్ణి ద్వేషిస్తోంది. ఇది ఒక విధంగా త్యాగమే అనిపించుకుంటుందేమో! ఇది త్యాగం కాకపోతే, పుష్పించిన తన ప్రేమను నేలపడేసి, తను యెప్పుడూ ప్రేమిస్తున్నానని అనుకోని మావయ్యను పెళ్ళి చేసుకుంటానని అనడమేమిటి?...ఆలోచనలతో ఆమె మస్తిష్కం వేడెక్కింది. ఒకవేళ అదే నిజమైనా, తనెందుకా నిజాన్ని వ్యక్తం చెయ్యాలి?

"నీ వూహ తప్పక్కా! నీ కోసం నేను త్యాగం చేస్తున్నానని అనుకోవడంలేదు. నా కెందుకో ఆనందం మేస్టారు పట్ల, విముఖత పెంపొందింది. మావయ్యంటే అభిమానం పెరుగుతోంది. మనల్ని గౌరవించేవాళ్ళ నీడనే సుఖపడగలమంటే, నువ్వూ కాదన వనుకుంటాను."

"ఆనందం నిన్ను గౌరవించడంలేదని యెందుకు అపోహపడుతున్నావు చెల్లీ? నువ్వంటే అతనికి పంచప్రాణాలు. నిన్ను పువ్వుల్లోపెట్టి పూజిస్తాడన్న నమ్మకం నాలోవుంది."

"అయినా సరే, నాకిష్టంలేదు." మొండిగా అనేసింది.

అరుణకేం పాలుపోవడం లేదు. చెల్లాయి మనసుని రాయిగా చేసుకుని మొండి వాదనకు దిగిందని వూహించడానికి ఆమె యెక్కువ సమయం తీసుకోలేదు. ఆమెకి యెలా నచ్చజెప్పడమో, బోధపడంలేదు.

"సరే! నీ యిష్టం!" బాధగా నిశ్వాసం విడుస్తూ అంది "ఈ సమయంలో మరొక్క విషయం కూడా నువ్వు ఆలోచించాలి శారదా?"

"ఏవిఁటక్కా?"

"నువ్వు మావయ్యను వివాహంచేసుకుందుకు సుముఖత చూపిస్తున్నావు. కాని, అతనికి నీ మీద అనురాగం వుండొద్దూ?"

"ఉండకపోవడ మేవిఁటక్కా? నానిర్ణయాన్ని తెలిపితే గంతులేసుకునివస్తాడు మావయ్య"వుత్సాహంగాఅందిశారద.

"ఊఁ...ఏదియెలా జరగాలో మనమేంచెప్పగలంలే!"

చివరికి వేదాంత ధోరణిలోకి దిగిపోయింది అరుణ. ఆమెకి మాధవరావు రాసిన ప్రత్యుత్తరం జ్ఞప్తికి వచ్చింది. అందులోని ప్రతీపదం స్మృతిపథంలో మెదిలింది. మావయ్య తననిగురించే రాస్తున్నాడుతప్పించి, యెక్కడా శారదా విషయం ప్రస్తావించ లేదు. అటువంటప్పుడు, శారద తన అభీష్టం తెలియ జేసినా సరే, అతని మనస్సు మారిపోతుందన్న నమ్మకం కలగలేదు అరుణకి. మాధవరావు దృఢ నిశ్చయుడు. అతను మొదట్నుంచీ తననే భార్యగా కోరుకొంటున్న వ్యక్తి. శారద ప్రయత్నించితే, నిరాశ యెదుర్కొన్న తర్వాతనైనా, ఆనందం పట్ల సదభిప్రాయం యేర్పడుతుందేమోనని ఆశపడింది అరుణ. ఏది యేమైనా, శారద ఆనందంని వివాహమాడాలి. అతణ్ణి, చెల్లి యింకా అర్థం చేసుకోక పోయినందుకే బాధపడుతోంది.

"ఏమిటంతగా ఆలోచిస్తున్నావక్కా" శారద అడిగింది, అక్క మొహంలోకి తదేకంగా చూస్తూ.

"అబ్బే! ఏమీలేదే! మనం యీ సమస్యల సముద్రం నుండి యెప్పుడు బైట పడతామా అని ఆలోచిస్తున్నానంతే!"

"అనుకుంటే, అన్నీ సమస్యలే! పట్టించుకోకండా ధైర్యంగా ముందుకు సాగిపోతే, యేదీ సమస్యకాదు."

"చాలా తేలిగ్గా చెప్పేశావు చెల్లీ!" చిన్నగానవ్వుతూ అంది అరుణ.

"అది అంతే అక్కా!"

"చెప్పడం చాలా సులువుగాని, ఆచరణ అతికష్టం."

"ఏదీ కష్టంలేదు. చూస్తూండు, యీ సమస్యలన్నీ యెలా విడిపోతాయో!"

"నేను కోరేదీ అదే కదే మరి!" నవ్వుతూ అనేసింది.

"మావయ్యకి ఉత్తరం రాస్తానుండు..." అంటూ లేచింది శారద.

"ఆలోచించు...నీ తరఫుగా నువ్వు రాయడం బావుండదేమో!"

"పరాయి వాడు కాదుగా! స్వయంగా మేనమామ... బావుండక పోవడానికేం లేదు నా ఉత్తరం అందిన వెంటనే రెక్కలుకట్టుకు రాకపోతేచూడు..."

"నీకంత మనోనిబ్బరం వుంటే, యింకేం! అలాగే రాయి" అంది అరుణ.

శారద అక్కణ్ణించి వెళ్ళిపోయింది. అరుణఆలోచనల్లో పడింది. శారద వుంటున్నంత నిశ్చింతగా, ఆమె వుండలేక పోతోంది.

"పోస్ట్!" అంటూ పోస్టుమాన్ కేకవేశాడు. అరుణ బైటికి వెళ్ళి ఉత్తరం తీసుకుంది. మీాది అడ్రసు చూడ్డంతోనే గ్రహించేసింది, మాధవరావు మావయ్య రాసిన ఉత్తర మని. తను రాసిన ఉత్తరానికి జవాబిదని వూహించుకుని, చెల్లి తిరిగి రాకముందే ఉత్తరం బైటికి తీసింది. కవరు ముక్కలు చేసి, దూరంగా విసిరేసింది వీధిలోకి

'చిరంజీవి అరుణకి ఆశీస్సులు—

నీ వుత్తరం చదివాక, యేంరాయాలో తోచక, దిగాలు పడిపోయింది నా మనస్సు. పెనవేసుకున్న ఆశలన్నీ పటాపంచలయ్యాయి. మారిన నా జీవితానికి, మనోవేదనే మిగులుందేమో నన్న భయం నన్ను కలవరపరుస్తోంది. నా

బ్రతుకు బాటలో, నాతో నువ్వు చేరితే, చీకూ, చింతా లేకుండా ముందుకు సాగిపోవచ్చుననే నమ్మకం నా కిప్పటికీ వుంది. అందుకే, నా కోరిక మన్నించమని, నిన్ను అర్థించాను. కాని, నా అభ్యర్థనకి సార్థకత లేకపోయింది. ఎప్పుడో నీ మనస్సు మారితే, ఆలోచిద్దామన్నావు. దానికో కాలనిర్ణయం లేదు గనుక, అది ఆశల్ని పెంచదు. పెంచుకోలేనుకూడాను. ఈ నిరాశ నన్ను వేధిస్తూనే వుంటుంది. ఈ ఆవేదన మళ్ళీ నన్ను యెటు తీసుకుపోతుందో, యెవరు చెప్పగలరు? అరుణా! నా మనస్సుని అర్థం చేసుకో! నాకో వెలుగుబాట చూపించు. అందుకే మళ్ళీ అర్థిస్తున్నాను...

నీ మావయ్య,
మాధవరావు.'

ఉత్తరం చదవడం పూర్తిచేసి, చిన్న నిట్టూర్పు విడిచింది. తనంటే మావయ్యకి యెంత అనురాగమో, ఉత్తరాలే చెప్తున్నాయి. పాపం, నిరాశతో దిగులుపడి పోతున్నాడు. ఈ దిగులుతో యెలా మారిపోతాడో యెవరూహించగలరు? మళ్ళీ తన దురలవాట్లన్నీ అలవర్చుకుంటే...?ఇంక ఆలోచించలేకపోయింది. అలా యెన్నటికీ జరగకూడదని భగవంతుణ్ణి ప్రార్థించుకుంది మనసులో. ఈ పరిస్థితుల్లో శారద ఉత్తరం చేరితే, మావయ్యలో యెటువంటి పరివర్తన వస్తుందో, యెదురు చూడాలనిపించింది. అందుకే, అప్పటికి తనేం జవాబు రాయదల్చుకోలేదు. ఉత్తరాన్ని పదిలంగా మడిచి జాకెట్టులో దాచుకుంటూ, లోపలికి వెళ్ళిపోయింది అరుణ.

# 17

సాయంత్రం ఆరు కావస్తోంది. వీధిలోని విద్యుద్దీపాలు యింకా వెలగలేదు. పక్షులు చెట్లమీదకు చేరుకుంటూ కిల కిల మంటున్నయ్. అరుణ అప్పుడే ఆ వీధిలో వుంటున్న స్నేహితురాలింటికి వెళ్ళింది, ఆమె రమ్మని కబురుపంపితేను. శారద ముందు గదిలో కూచుని రేడియో వింటోంది.

స్కూటర్ శబ్దం వినిపించేసరికి, శారదకి యేదోలా అనిపించింది. లోపలికి పోవాలనుకుంది. కాని, అంతలోనే ఆనందం స్కూటర్ని ఆపాడు యింటిముందు. శారదను చూడ్డంతో, అతని మొహం ప్రసన్నంతో ప్రకాశవంతమైంది.

"హల్లో శారదా!" అంటూ లోపలికి వచ్చాడు, యెంతో చనువున్నవాడిలా.

శారద; మొహం చిట్లించుకుంటూ నుంచుంది. ఆ క్షణంలో యేమనాలో అర్థం కాలేదామెకి. వెళ్ళిపొమ్మని చెప్పాలని మనస్సు చెబుతోంది. కాని, నోటమాట పెగల్లేదు.

ఆనందం ఆమె మొహంలోకి పరిశీలనగా చూస్తున్నాడు. ఆ కళ్ళల్లో అనురాగం, అమృతవర్షంలా కురుస్తోంది. కాని, ఆ అమృతాన్ని ఆస్వాదించే వ్యక్తిమాత్రం, మొహం దించుకుని ముభావంగా వుంది.

"ఏం శారదా, కాలేజీకి రావడం మానేశావు?"

"చదువుకి స్వస్తి చెప్పాను మేష్టారూ!" మొహం దించుకునే చెప్పింది.

విసుపోయాడు ఆనందం. చదువు మానేయాల్సిన పరిస్థితులు యెందుకుయేర్పడ్డాయో, తెలుసుకోవాలనుకున్నాడు.

"ఏమిటి నువ్వు చెబుతోంది శారదా? చదువు మానేశావా? కారణం?"

శారద క్షణం జవాబు చెప్పలేదు. తను యెందుకు మానేసిందో, ఆ కారణం తనకే తెలుసు. ఆనందం మేష్టారుకి దూరమై పోవాలనే యిలా చేసింది. కాని, అదెట్లా చెబుతుంది? చెప్పడాని కిష్టంలేదు.

"ప్రత్యేకించి కారణమంటూ యేమీలేదు మేష్టారూ! చదువుమీద ఆసక్తి తగ్గిపోయి మానేశానంతే!"

"హఠాత్తుగా ఆసక్తి తగ్గిపోయిందంటే, ఆశ్చర్యంగా వుంది శారదా! నిజం చెప్పు..." నమ్మలేదు ఆనందం. ఆమె చెప్పిన కారణం గాకుండా, వేరే కారణం యేదో వుంటుందనిపించిం దతనికి.

"మీరు నమ్మకపోతే యేంజేసేది మేష్టారూ! నేను చెప్పింది నిజమే!" అంది ముక్తసరిగ.

"నువ్వొస్తావని రోజూ నేనెదురుచూసేవాణ్ణి శారదా! ఏమిటో నువ్వు కనిపించకపోతే, ఆ రోజు పాఠం చెప్పడమంటే కష్టంగా వుండేది. రాత్రులు సరిగా నిద్రపట్టేది కాదు. ఎన్నాళ్ళీ బాధ అనుభవించడం! అందుకే, యివ్వాళ వచ్చేశాను" చిన్నగా నవ్వుతూ అన్నాడు.

శారదకి బాధకలుగలేదు. సానుభూతి అంతకంటె లేదు. పైగా కోపం వచ్చింది. అయితే సంబాళించుకుంది. తన విముఖతను నిష్కర్షగా తెలియజెయ్యకుండా, ముఖభావంగా

పూరుకుంటే, ఆనందం తనని కలుసుకుంటూనే వస్తూనే వుంటాడు. తనని మర్చిపోవడానికి అసలు ప్రయత్నించడు. అందుకే నిజం చెప్పేయాలన్న నిశ్చయానికి వచ్చింది. ఆమె కళ్ళల్లో కరుకుదనం కరుడుకట్టింది. అతని కేసి చూసింది తీక్షణంగా. ఆమె యెర్రని చూపులు చుర్రు మన్పించాయి ఆనందంకి. అతని కేం అవగాహనకా లేదు, యెందుకలా వుందో శారద.

"అదేవిటిలా చూస్తున్నావు శారదా!" వింతగా అడిగాడు.

"ఏమీ తెలీని వ్యక్తిలా విసుపోతారెందుకు మేష్టారూ" అంటూ పొడినవ్వు నవ్వింది. "నాచూపు మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు కాని నా హృదయంలోకి తొంగి చూడగలిగితే, యింతకంటె ఆశ్చర్యపోతారు." అంది.

ఆనందం అయోమయంగా చూశాడు. శారదలో యేదో మార్పు వచ్చిందని భావించుకున్నాడు.

"నీ మాటలు, నాకేం అర్థంకాలేదు శారదా!" మెల్లగా అన్నాడు.

"అర్థంకాకుండా వుండటమే మంచిది మేష్టారూ! అయితే నేను కోరేది ఒక్కటే! మీరెప్పుడూ కన్నుకలవడానికి ప్రయత్నించకండి."

ఆనందం తలమీద ఆటంబాంబు పడినట్టయ్యింది. అతని హృదయస్పందన, విపరీతంగ పెరిగింది. తను అగాధంలోకి కూరుకుపోతున్నాడేమో నన్పించింది. కళ్ళల్లో అప్రయత్నంగా అశ్రువులు సుళ్లుతిరిగాయి. తను మనసా ర్పాప్రేమించిన

శారద, తనని ఒక్కసారిలా నిస్పృహాలో ముంచేస్తుందని, కలలోకూడా అనుకోని ఆనందం, నివ్వెరపోతూ ఆమెకేసి జాలిగా చూశాడు.

"శారదా! ఏమిటిది? నీలోని యీ హఠాత్పరిణామా నికి కారణం యేమిటో వూహించుకోలేక పోతున్నాను. నువ్వు నాఅర్థాంగివవుతావన్న ఆశలతో ఆకాశహర్మ్యాలు కట్టాను. అవన్నీ కూలిపోవల్సిందేనా? నేనిలా నిస్పృహాతో కృంగిపోవల్సిందేనా! నీ నవనీతహృదయం, యెందుకిలా బండ బారి పోయింది? నన్ను ఆవేదనతో ముంచడమే నీకు ఆనం దంగా వుంటుందా." జీరవోయిన స్వరంలో చెప్పుకుపోయాడు ఆనందం.

"ఆ ప్రశ్నే నేను వేస్తే; మీరేం సమాధానం చెబు తారు మేష్టారూ?" అతని మొహంలోకి తీక్షణంగా పరికిస్తూ అంది శారద.

ఆనందం కనుబొమలు; దగ్గరకు చేరుకున్నాయి. ఆమె మాటలు; అతనికి అర్థంగాక తెల్లబోయాడు.

"అంటే...? నిన్ను నేను ఆవేదనలో ముంచాననా నీ అభిప్రాయం?"

"ప్రపంచంలో నేనొక్క స్త్రీనే వున్నానా మేష్టారూ? మీ రెవర్ని ఆవేదనలో ముంచివేశారో; యెవరి జీవితాన్ని యెడారిలా చేశారో; ఒక్కసారి గతంలోకి చూసి; గుర్తుకు తెచ్చుకోండి...నన్ను మభ్యపెట్టడానికి మాత్రం ప్రయత్నిం చకండి." విసురుగా అంది. ఆమె గొంతు ఖంగుమంది యీ మాట అంటూవుంటే.

ఆనందం నిర్విణ్ణుడైపోయాడు. శారద తన జీవితంలో అడుగు పెట్టకముందు, తను ప్రేమించిన వ్యక్తి అరుణ. అను కోకుండా ఆమెకి దూరమయ్యాడు. ఆమె జీవితం యెడారిలా అయినందుకు తను బాధ్యుడు కాకపోవచ్చు. కాని, ఇతరులు అనుకుందుకు మాత్రం, అలానే అన్పిస్తుంది. బహుశా, ఇదే విషయాన్ని శారద గుర్తుకు తెస్తుందేమో! ఆ రోజు వాళ్ళింటికి తను వెళ్ళినపుడు, అరుణకీ తనకీ జరిగిన సంభాషణంతా శారద విని వుండొచ్చు. అదే కారణంతో తనని ద్వేషిస్తూ, తనకి దూరమవ్వాలన్న సంకల్పంతో చదువుకి కూడా స్వస్తి చెప్పి వుంటుంది... ఈ ఆలోచన అతనిలో మెదిలేసరికి, అతనికి కళ్ళు తిరిగినట్లయ్యింది. ప్రపంచమంతా, చీకటి మయంగా తోచింది. తన వూహే నిజమైతే, శారద తనని మరి క్షమించదు...అనుకున్నాడు హృదయభారంతో.అతనికి యేడుపొచ్చినట్లయ్యింది. 'భగవాన్! ఏమిటీ పరీక్ష! ఈ విషమ పరిస్థితికి పరిష్కృతి లేదా? నా జీవితంలో ప్రశాంతత రాదా? ఈ కల్లోలానికి అంతమెక్కడ? అరుణకి నేను కావాలని అన్యాయం చెయ్యలేదన్న నిజాన్ని ఎలా శారదకి నచ్చజెప్పడం?... యీ ప్రశ్న పరంపరలతో, అతని మెదడు చిందరవందరయ్యింది. ఫాలభాగం చిరుచెమటలతో నిండి, వెలుతురులో మెరుస్తోంది... మొహం మ్లానమయింది.

ఆనందంలో ఉత్పన్నతమైన సంఘర్షణని వూహించగలిగింది శారద. అతనికేసే చూస్తుంది.

"అయితే శారదా, నువ్వు...నువ్వు...మీ అక్కతో

జరిగిన నా సంభాషణని..." అని యింకా చెప్పలేకపోయాడు. మొహం దించుకున్నాడు.

శారదలో మార్పేమీ రాలేదు. ఆమె మొహంలోని కర్కశత్వం యింకా అలానేవుంది. అతని తడబాటుకి ఆమెలో జాలి కలుగలేదు.

"ఔను మేష్టారూ! మీ సంభాషణవిన్నాను. అప్పుడు గాని, మీ నిజస్వరూపం నాకు తెలుసు. అప్పుడుగాని, మీ కపటప్రవర్తన నాకు అర్థం కాలేదు. మీ తియ్యని మాటల్లో యెంతటి హాలాహలముందో అప్పుడే తెలిసింది. ఆ క్షణంలో నాలో రేగిన భావాలు, నేనిప్పుడు చెప్పలేను. కోపం కట్టలుతెగి ప్రవహించింది. ద్వేషం అగ్నిపర్వతంలా బుసలు కొట్టుకుంటూ యెగిసింది. అయితేనేం — సంబాళించుకున్నాను. నేనేం అసహనం చూపినా, మా అక్క బాధపడుతుందేమోనని యోచించి, తమాయించుకున్నాను. ఆ క్షణంనుంచీ, మీ మీద నమ్మకం అంతరించింది మేష్టారూ! వికసించిన నా అనురాగ పుష్పం, వాడిపోయింది. నా హృదయం పగిలిపోయింది. పగిలిన హృదయం, ఎన్నటికీ అతకదు మేష్టారూ! అందుకే, మీరు నాకు దూరంగా వుండాలని కోరుతున్నాను" అంది శారద బాధగా. ఆమె యెంత ద్వేషంతో వున్నా, తన ప్రేమ ఈ విధంగా విఫలమైనందుకు; బాధపడకపోలేదు. అయితేనేం — ఆ ద్వేషంలో బాధ, వెల్లువలో పూచికపుల్లలా కొట్టుకుపోయింది.

"నువ్వు నన్నర్థం చేసుకోలేదు శారదా! నేను యే పరిస్థితుల్లో అరుణకి దూరమయ్యానో, ఆమెకో చెప్పాను.

నువ్వూ వినే వుంటావు. వినికూడా నువ్విలా అపార్థం చేసుకుంటే యెలా? ఆ విషమపరిస్థితుల్లో నేను ఇరుక్కుని వుండకపోతే, ఈ రోజు యీ సమస్యలే వుండకపోను—మీ అక్కా, నేనూ హాయిగా సంసారసాగరంలో షికారుకొడుతూ వుండేవాళ్ళం. అయితే, ఆ అదృష్టం లేకపోయింది."

"ఈ మొసలి కన్నీళ్ళెందుకండీ మేష్టారూ?" చిరుకోపంతో అంది.

"నువ్వు చాలా క్రూరంగా మాట్లాడుతున్నావు శారదా! నా హృదయపు లోతులు తెలుసుకోకుండా, రాళ్ళు రువ్వుతున్నావు... ఇది నీకు భావ్యంకాదు. అరుణను వంచించాలనే దురుద్దేశం, నా కెన్నడూ లేదు. అది నువ్వు నమ్మితే చాలు..."

"సరేలెండి మేష్టారూ! మీ పాతపాటతో, నన్నుమరి విసిగించకండి. దయచేసి వెళ్ళండి."

ఆనందం కళ్ళల్లోని నీరు చెక్కిళ్ళమీదికి జారింది.

"ఎలా వెళ్ళను శారదా! నిన్ను విడిచి ఎలా వెళ్ళను? ఎక్కడికి వెళ్ళను? నీ హృదయంలో నన్ను బంధించి, నా జీవితంతో చెలగాటమాడుతున్నావా?" రుద్ధస్వరంతో అన్నాడు.

స్త్రీ పట్టుదల, ద్వేషం, ఎటువంటివో, ఆ క్షణంలో శారదను చూస్తే అర్థమైపోతుంది. ఆమె మొహంలో ఎరుపుదనం తగ్గలేదు. సుకుమారత్వం, వెదికితే అగుపించదు. కళ్ళల్లో కరుకుదనం, స్పష్టంగా కనిపిస్తోంది.

"మా అక్కజీవితంతో మీ రిలానే చెలగాటమాడారా మేష్టారూ?" సూటిగా అంది.

ఆమాటలింకా పదేపదే వినలేకపోయాడు ఆనందం.

"ఇంక నన్ను చిత్రవధ చెయ్యొద్దు శారదా! ఇది చాలు..." అనుకుంటూ చరచరా బైటికి వెళ్ళిపోయాడు. అతను యెంత కలవరపడుతున్నాడో దగ్గరికి వెళ్ళి చూస్తే, కన్నీరుచారలు స్పష్టంగా అగుపిస్తాయి. స్కూటర్ బుర్రు మంటూ సాగిపోయింది.

శారద ద్వారం దగ్గర నుంచుని చూస్తోంది. ఆమెలో యెటువంటి మార్పూ రాలేదు. పాడినవ్వ నవ్వుకొని పడక కుర్చీలో కూలబడింది.

అప్పుడే స్నేహితురాలింటినుండి తిరిగివస్తూ, వెళ్ళి పోతున్న ఆనందంని దూరంనుండి చూసింది అరుణ. ఏంజరి గిందో, యేమిటోనన్న ఆతృత, ఆమెను కలవరపర్చింది. చరచరా నడిచి లోపలికి వచ్చింది. నిశ్చింతంగా కుర్చీలో కూచున్న చెల్లెల్ని చూసింది. తృప్తిగా నిట్టూర్చింది. ఆమె వూహించుకోలేక పోయింది, ఇక్కడేం జరిగిందో, పాపం!

"ఆనందం వచ్చినట్టున్నాడు...?" అంది, చెల్లెలికి అభిముఖంగా కూచుని.

"ఔను. వచ్చాడక్కా!"

"ఏమంటాడేం?"

"ఏమంటాడు? మగాళ్ళకి వున్న దేగా ప్రేమపిచ్చి... ఆపిచ్చి వదుల్చుకోమన్నాను" అక్కవేపు చూడకుండా అంది.

అరుణ విస్తుపోయింది. ఏం జరిగిందోనని మొదట్లో తను కలవరపడ్డం పొరపాటు కాదనుకొంది.

"అంటే?"

"ఇంకెప్పుడూ, నన్ను కలవడానికి ప్రయత్నించొద్దని, నిష్కర్షంగా చెప్పేశాను."

అరుణ మొహం వాడిపోయింది. చెల్లెలిపై కోపం చెప్పలేనంతగా వచ్చింది.

"ఉద్ధరించావు... నీ పొరపాటు నీకు తెలీటం లేదా చెల్లీ?" అంది సూటిగా చెల్లెలి మొహంలోకి చూస్తూ.

"నేనేం పొరపాటు చెయ్యడంలేదనే, అనుకుంటున్నానక్కా!" అనేసి, అక్కణ్ణించి లేచి వెళ్ళిపోయింది లోపలికి శారద.

అరుణ విసుగ్గా, నిరుత్సాహంగా నిశ్వాసం వదుల్తూ, మెల్లగా లోపలికి నడిచింది. ఆమెకి అంతా అయోమయంగా వుంది.

# 18

శారద రాసిన వుత్తరం చదువుతున్న మాధవరావు, తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. ఆమె మనసారా తనని వివాహం చేసుకోవాలని కోరుతున్నందుకు ఆశ్చర్యపోయాడు. తనపై ఆమెకి అనురాగముందన్న విషయం యింతవరకూ యెప్పుడూ బైటపడలేదు. అసలు, తనకి ఆ ఆలోచనే లేదు. తన మనస్సెప్పుడూ అరుణమీదే కేంద్రీకరించి వుండేది తప్పించి, శారద గురించి తలంచనైనా లేదు. ఆమె భవిష్యత్తు పెద్ద పెద్ద వూహాలతో ఆశలతో నిండి వుంటుందని, తనే

ప్పుడూ అనుకునేవాడు. అందుకే 'నిరాడంబర వ్యక్తి' అయిన అరుణపట్ల అనురాగాన్ని పెంచుకున్నాడు. అయితే, అరుణ తనకి నిరాశకలిగిస్తున్నా అందుబాటులో వున్న శారదను కోరుకోలేకపోతున్నాడు. అతని సంకల్పం యెప్పుడూ చెదరదు అదే అతనిలోని గొప్పదనం! అయితే, ఇప్పుడేం చెయ్యడం! శారద హఠాత్తుగా యిలా వుత్తరం రాయడానికి కారణం యేమిటి? ఏ స్త్రీ అయినా అంత చొరవగా రాస్తుందా? తను మేనమామ గాబట్టి అలా రాసిందేమో! తనేం జవాబు రాయాలి?...అన్నీ ప్రశ్నలే యెదురయ్యాయి. ఒక్క ప్రశ్నకీ జవాబు సమాధానం లభించలేదు. చివరికి ఒక నిర్ణయానికి వచ్చాడు. తను స్వయంగా వెళ్ళి, పరిస్థితుల్ని గ్రహించాలి. లేకుంటే, యీ సమస్య పరిష్కృతమవ్వదు అనుకున్నాడు.

మరుచటిరోజే విజయనగరం బైలుదేరాడు.

* * *

అందుబాటులో వున్నవి అవసరంలేదు మానవుడికి. అందని వాటికై అర్రులు చాచడం, అలవాటైపోయింది. అది మానవ స్వభావం. మాధవరావు పరిస్థితి, అప్పుడలాగేవుంది. అతనూమనిషే మరి! వలచివచ్చిన శారదను వరించలేక పోతున్నాడు. ఇదమిత్థమని తేల్చకుండా, తనని ఆశల్లో పడేసిన అరుణని మర్చిపోలేకపోతున్నాడు. తన మనస్సులోని మాట శారదకు చెప్పి, తన అసహాయతను వ్యక్తం చెయ్యాలని, శారద వ్యక్తీకరణను ఆధారం చేసుకొని, తనేస్థితిలో ఊగిస లాడుతున్నాడో అరుణకు వెల్లడిచేసి, ఆమె అభిమానాన్ని

సంపాదించాలనీ నిర్ణయించుకున్నాడు, అరుణకోసం, తన సర్వస్వాన్నీ వదులుకోవడానికి సంసిద్ధంగా వున్న వ్యక్తి మాధవరావు.

రైలు, వేగంగా సాగిపోతోంది! మాధవరావు కిటికీ దగ్గర కూచుని, ప్రకృతి అందాన్ని పరికిస్తున్నాడు. అయితే అతని మెదడుమాత్రం ప్రకృతిని గురించి ఆలోచన సాగించడం లేదు. రైలువేగంతో పోటీపడుతూ, యేవేవో ఆలోచనలు పరుగెడుతున్నాయ్, ఒక గమ్యమంటూ లేక.

విజయనగరం దగ్గరపడుతున్న కొద్దీ, మాధవరావు గుండెలు జోరుగా కొట్టుకోసాగాయి. అక్కడికి వెళ్ళి తను యేం చెయ్యాలో, ఓసారి మననం చేసుకున్నాడు ఈ పర్యాయం యెలాగైనా తను యీ సమస్యకు పరిష్కారం చెయ్యాలని నిర్ణయించుకున్నాడు.

* * *

మాధవరావు వెళ్ళేసరికి, తాయారమ్మ అగుపించింది ముందుగదిలో.

"ఏం బాబూ, యిదే రావడమా ?" అంది అతణ్ణి చూస్తూనే.

"ఔను తాయారూ, ఇప్పుడే వస్తున్నా!బండి లేటుగా వచ్చిం దీవేళ..."

"ఈ రోజేవిటి బాబూ! రోజూ యిదేవరస! కూర్చోండి..."

"అరుణ, శారద, యేరీ? వెళ్ళిపోయారా అప్పుడే ?" కూచుంటూ అడిగాడు.

తాయారు గట్టిగా ఓ నిట్టూర్పు విడిచింది." చదువు మానేసింది" అంది.

మాధవరావు వింతగా చూశాడామెకేసి. ఈ పరిణామాలెందుకు వచ్చాయో అతను వూహించలేక పోయాడు.

"ఆశ్చర్యంగా ఉందే! ఈ విషయాలెవ్వరూ తెలియజెయ్యలేదు ఉత్తరాల్లో."

అరుణ అప్పుడే లోపలి గదిలోంచి వస్తూ, మావయ్యను చూసింది. అతణ్ణి చూడగానే, యింతకు ముందులా కాకుండా, యేవో కొత్తభావాలు మొలకెత్తాయి. ఒకించుక సిగ్గుకూడా ఆమెను ఆవరించి, చెక్కిళ్ళు యెఱ్ఱదనాన్ని సంతరించుకున్నాయి.

"ఏం మావయ్యా, ఉత్తరమైనా రాయకుండా వచ్చేశావు?" అంటూ ముందుకు వచ్చింది.

"ఉత్తరం రాయడానికి వ్యవధి లేకపోయిందిఅరుణా!"

"తాతయ్య కులాసా యేనా?"

"ఆ! కులాసాయే!"

"ఇక్కడికి మరి రావడమే మానేశారు..."

"ఈ మధ్య వస్తారనుకుంటాను... అలా నుంచుండి పోయావేం? కూచో!"

అరుణ, అతనికి అభిముఖంగా కూచుంది. ఇప్పుడతని కేసి చూడ్డానికే, సిగ్గేసోంది.

"తాయారూ, వెళ్ళి కాఫీ పట్రా!" అంది అరుణ.

తాయారు అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

క్షణం నిశ్శబ్దం. శారద ఉత్తరం విషయం అరుణతో చెప్పాలని ముందుగా నిశ్చయించుకున్నాడు. అయితే, ఆ ప్రస్తావన యెలా ప్రారంభించడమో అర్థంగాక, తికమక పడుతున్నాడు.

"శారద రాసిన వుత్తరం అందిందా మావయ్యా?" అరుణ ప్రశ్నించింది, నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

మాధవరావుకి, పచ్చివెలక్కాయ గొంతులో పడినట్లయ్యింది. శారద వుత్తరం రాసిన విషయం అరుణకి యెలా తెలిసిందో, అంతుచిక్కలేదతనికి. ఎంత అక్కచెల్లెళ్ళయినా, ఆడవాళ్ళు యిటువంటి విషయాల్ని రహస్యంగానే వుంచుతారని అతనికి తెలుసు.

"ఈ విషయం నీకెట్లా తెలుసు అరుణా?" మెల్లగా అన్నాడు.

"నువ్వు ఆశ్చర్యపోతున్నావని, నాకు తెలుసు మావయ్యా! కాని, యిది జరగని విధంగా జరిగింది. నీకు వుత్తరం రాస్తున్నట్లు, నువ్వు దాని వుత్తరం చూసుకుని సమాధానం రాస్తే ఆలస్యమవుతుందని రెక్కలు కట్టుకు వాలిపోతావనీ, ఢంకామీద దెబ్బకొట్టి చెప్పింది. అది చెప్పినట్లే జరిగింది." అంది అరుణ ఓరగచూస్తూ. మావయ్య మనస్సు తెలుసుకుందుకే అలా అందిగాని, ఆమెకీ తెలుసు_ అతని సంకల్పమేమిటో!

అరుణ మాటల్లోని అంతరార్థం గ్రహించ గలిగాడు మాధవరావు.

"నిజంగా శారద వుత్తరం నన్ను ఆశ్చర్యంలోముంచిన మాట వాస్తవమే! ఎప్పుడూ వూహించని యీ నిర్ణయానికి కారణం యేవిటో తెలుసుకోవాలనే వున్నపాటుగ వచ్చాను. ఏకారణాలవల్ల శారద యీ నిర్ణయానికివచ్చినా, నాజవాబు మాత్రం ఆమెకి నిస్పృహ కలిగిస్తుంది. ఏం చెయ్యను? నా ప్రేమను సమయానుకూలంగా మార్చుకోగలిగే చపలచిత్తుణ్ణి కాదు." అంటూ మొహం దించుకుని "నిన్ను నేను మర్చిపోలేను అరుణా! నీ స్థానంలో మరొకరికి, నా హృదయంలో చోటుండదు." అన్నాడు. చివరి రెండువాక్యాలూ మెల్లగా చెబుతూ.

మాధవరావు పట్ల, అరుణకి యేకొద్దిపాటి అభిమానం వున్నా, యిప్పుడది యినుమడించిందనే చెప్పాలి. మావయ్య ప్రేమ నిర్మలమైనందుకు, అతణ్ణి మనస్సులో అభినందించుకోకండా వుండలేక పోయింది. ఆ అభిమానం అనురాగంగా మారుతోందిప్పుడిప్పుడే! తనని మనసారా వాంఛించిన వ్యక్తిని తనెందుకు దూరంచేసుకోవాలి? తనకింక జీవితంలో మిగిలిన ఆశలేమున్నాయి గనుక? అదీగాక మావయ్యను వివాహం చేసుకుంటే, అతణ్ణి తృప్తిపర్చడమే కాకుండా, తను మోడు గులాబిగా వుండిపోయానన్న బాధ తనకీ వుండదు...శారదకీ వుండదు. అప్పుడైనా ఆనందంపై ఆమెకి యేర్పడ్డకసి, ద్వేషం, చల్లారతాయేమో! ఇది చాలా ముఖ్యమైన పరిష్కారంగా అగుపించింది అరుణకి. ఇంకా మావయ్యను అకారణంగా, అనవసరంగా సందిగ్ధావస్థలో పెట్టి వుంచడం, భావ్యంకాదనుకుంది.

"మావయ్యా! ఒక్కవిషయం అడుగుతాను చెబుతావా?" మాధవరావు కళ్ళల్లోకి చూస్తూ అంది.

"అడుగు అరుణా! నువ్వేం ప్రశ్నించినా, కపటం లేకుండా నిజం చెబుతాను" ఉత్సాహంగా అన్నాడు మాధవరావు

"నువ్వు నాలో యేం చూసి, నీ అర్ధాంగిగా కోరుతున్నావు మావయ్యా?"

మాధరావుకి యీ ప్రశ్న కాస్తంత ధైర్యాన్ని చేకూర్చింది. సమస్య పరిష్కారం కావడానికి చక్కని అవకాశం దొరికిందనుకున్నాడు.

"అది నా హృదయానికి తెలుసు అరుణా! ఇంతకంటే నేనేమీ చెప్పలేను. నా భవిష్యత్తు ప్రస్తుతం నీమీద ఆధారపడి వుంది."

"నేను నిరాకరిస్తే?" తమాషాకి అనాలన్పించి అంది.

"నేనే మౌతానో నాకే తెలీదు. నువ్వూహించగలిగితే, నీకు అర్ధమౌతుం దేమో? అయితే, అది నా చరమదశే కాగలదు."

"ఛా! అవేం మాటలు మావయ్యా!" అశుభ వాక్యాలు వినదల్చుకోలేదు అరుణ.

"నిజమే అరుణా! నా మనఃప్రవృత్తి విచిత్రమైంది. అందుకే, నేనంతగా నిన్ను ప్రాధేయపడుతున్నాను" అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

అరుణ యింకేం మాట్లాడలేదు. ఏం జవాబు చెప్పాలో, అర్ధం కాలేదామెకి. ఆమె అప్పుడే ఒక నిర్ణయానికి వచ్చింది.

గౌరవమిచ్చే వ్యక్తి నీడలో గౌరవంగా, గర్వంగా బ్రతక వచ్చునన్న ధీమా యేర్పడింది. మాధవయ్యను తను పెళ్ళి చేసుకోవాలి. ఎంతో ఆలోచించుకున్నమీదట తను నిర్ణయించుకున్నది. తను అంతస్తులకోసం; అధికారాలకోసం-చూడడం లేదు... మనిషి మంచితనం అభిమానం ఈరెండూ మాధవయ్యలో తను గుర్తించిందిప్పుడు. అందుకే; యీ నిర్ణయానికి వచ్చింది. అయితే యెలా ఆనిర్ణయాన్ని వ్యక్తం చెయ్యడం! ముఖాముఖీ వ్యక్తం చెయ్యడం కష్టమే అబల విషయంలో. వొళ్ళంతా సిగ్గుతో గగుర్పొడిచింది. మొహం దించుకుంది.

"జవాబు చెప్పవేం అరుణా? నీ చల్లని మాట ఒక్కటి చాలు— నా జీవితాన్ని పునీతం చెయ్యడానికి. నే నెంతో ఆశతో వచ్చాను అరుణా!"

అరుణ అతనికేసి ఓరగా చూస్తూ మందహాసం చిందిస్తూ; "కాఫీ పంపిస్తానుండు మాధవయ్యా!" అనేసి అక్కణ్ణించి తడబడే నడకతో వెళ్ళిపోయింది లోపలికి.

మాధవరావు; ఆమె ఓరచూపులకు; మత్తుకలిగించే ఆ తియ్యని మందహాసానికి ముగ్ధుడైపోయాడు. ఆమెఅంగీకారం; అందులోనే యిమిడివుందన్న నిర్ణయానికి వచ్చేసి; తన్మయతత్వంతో మైమరచిపోయాడు. ఈజన్మతరించిందనుకున్నాడు. అతని మొహం వికసించింది. హృదయంలో యెన్నోజ్యోతులు వెలిగినట్టయ్యింది.

తాయారమ్మ కాఫీ తీసుకొచ్చి అందించింది.

"అరుణేదీ?" అన్నాడు.

"వంట దగ్గర తను కూచుని; నా చేత కాఫీ పంపింది

బాబూ! ఏవిఁటో గొప్ప వుత్సాహంగా వుంది మీరు వూళ్ళోకి వెళ్తే, వెళ్ళి వేగిరం వచ్చేయమని చెప్పమంది..." అంది తాయారు.

మాధవరావు వుత్సాహంగా లేచినుంచున్నాడు. అప్పుడతనికి జ్ఞాపకమొచ్చింది—యీ సందట్లోపడి, శారద హఠాత్తుగా ఆ ఉత్తరం తనకిరావడంలో గల అంతరార్థం ఏవిఁటో అడుగని అడిగి తెలుసుకోలేదే అని! ఇదే ఆలోచిస్తూ, ముందుకి అడుగు వేసేసరికి. శారద యెదురయ్యింది.

మాధవరావుని చూడగానే, ఆమెకెందుకో అదోలాంటి పిరికితనం ఆవహించింది. తన తొందరపాటుకి, పశ్చాత్తాప పడుతుందో యేమో యెవరికి తెలుసు?

"ఎంతసేపయ్యింది మావఁయ్యా వచ్చి?" అందిశారద.

"కొన్నిసేపటి క్రితమే వచ్చా శారదా!"

"అక్క కలిసిందా?"

"వూఁ... కలిసింది..."

అంతే? శారద తన ఉత్తరం అందిందా, లేదా, అని కూడా అడగలేదు. మౌనంగా నుంచుంది. ఆమె అడగక పోయినా, ఆ విషయాన్ని తను వీలున్నంత త్వరలో తేల్చుకోవాలనుకున్నాడు గాబట్టి, తనే చెప్పేశాడు మాధవరావు.

"నీ ఉత్తరం అందింది శారదా!"

శారద మాట్లాడలేదు. మొహం దించుకుంది.

"హఠాత్తుగా నువ్వీ నిర్ణయానికి రావడం, నన్ను వుక్కిరిబిక్కిరి చేసిందంటేనమ్ము. నిజం చెప్పాలంటే, నీకు నేను తగిన వాణ్ణి కాదు శారదా! అదీగాక, అప్పుడే నా

హృదయాన్ని మరొకరికి అర్పించేశాను! నా ప్రేమ దేవత నన్నను గ్రహించింది. అదిచాలు — నాకీ జీవితానికి. నీకు నిరాశ కలిగిస్తున్నందుకు నన్ను క్షమించు..." అంటూ, ఆమె జవాబు యేం చెబుతుందోననైనా యెదురు చూడ కుండా, చరచరా వెళ్ళిపోయాడు.

శారద, శిలాప్రతిమలా వుండిపోయింది నుంచున్న చోటనే. ఆమె లేత హృదయానికి, మరోఘాతం తగిలింది. మావయ్యకి వుత్తరం రాయడంలో తను తొందరపడిం దేమో!... అనుకుంది... ఇప్పుడేం అనుకున్నా ప్రయోజన మేమిటి? ఆమె కళ్లు అశ్రుపూరితాలయ్యాయి. హృదయ స్పందన అధికమయ్యింది. మెదడులో రైళ్ళుథీకొంటున్నాయి. అక్కడే వున్న కుర్చీలో కూలబడి పోయింది.

* * *

# 19

శారదకి మావయ్య చెబుతున్న మాటలువిందిఅరుణ. ఆక్షణంలో రంగంలోకి రావడం, యిష్టంలేకపోయింది.అందుకే నేరుగా తన గదిలోకి పోయి, మావయ్య తనకి రాసిన రెండ వుత్తరాల్నీ తీసుకుని, చెల్లెలున్న చోటికి వచ్చింది. అక్క రావడంతో, అక్కణ్ణించి వెళ్ళిపోవాలని లేచింది శారద.

"కూచోవే..." అంటూ తనూ కూచుంది అరుణ.

శారద యాంత్రికంగా కూలబడింది.

"మావయ్య కలిశాడా?" ప్రశ్నించింది అరుణ; తన కేమీ తెలీనట్టే.

"ఆ!"

"ఏమన్నాడవు తే!"

"ఏవిషయంలో?"

"నువ్వు రాసిన ఉత్తరం విషయంలో."

శారద నిస్పృహాతో నిట్టూర్పు విడిచింది. చప్పున జవాబు చెప్పలేదు.

"నాతో చెప్పడానికి సందేహిస్తున్నావేమిటి చెల్లీ!"

"సందేహించడం లేదక్కా! చెప్తాను... నా బాధను చెప్పడానికి, యింకెవరున్నారు గనుక! నీతో చెప్పుకొని నా హృదయాన్ని తేలికపర్చుకుంటాను." అంటూ క్షణం ఆగి "నేనూహించినదానికి, విరుద్ధంగా జరిగిందక్కా!" అంది.

"ఇంతకీ యేమన్నాడేవిటి?"

"నేనింత హఠాత్తుగ యీ నిర్ణయానికి వచ్చినందుకు ఆశ్చర్యపోయాడట. ఇంతకుముందే, తనహృదయం వేరొకరికి అంకితమయ్యిందట. తన మనస్సుని యిప్పుడు మార్చుకోలేడట. ప్రతీచోట, నేను ఓడిపోతున్నానక్కా!" అంటూ వాపోయింది.

ఆ క్షణంలో చెల్లెలి స్థితికి, జాలికలిగింది అరుణకి.

"అది నీ భ్రమ చెల్లీ! నువ్వు ఓడిపోవడంలేదు. ఎదుటి వాళ్ళను ఓడించాలని ప్రయత్నిస్తున్నావంతే! ఆనందంని ఓడించాలని, అసూయకు గురిచెయ్యాలని ప్రయత్నించి, మావయ్యంటే, యెప్పుడూ లేని అభిమానాన్ని యిప్పుడు

ప్రదర్శిస్తున్నావు. అతను తన అసహాయతను ప్రకటిస్తే; అది నీ ఓటమి యెలా అవుతుంది చెప్పు? ఆనందం విషయంలోనూ నువ్వు ఓడిపోలేదు. పైగా అతను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాడు. అది నీ గెలుపేగాని; ఓటమికాదు. అది నువ్వు అర్థం చేసుకోవడం లేదు. ఇకపోతే మావయ్య విషయం నీకింక తెలీదు. మావయ్య చాలా రోజులుగా నా ప్రేమకోసం; నన్ను తన జీవిత భాగస్వామినిగా చేసుకోవడం కోసం పరితపిస్తున్నాడు." అంటూ; ఆగింది అరుణ.

శారద నిర్ఘాంత పోయింది. అక్క మొహంలోకి;ఆశ్చర్యంగా పరికించింది.

"మావయ్య నిన్ను ప్రేమిస్తున్నాడా అక్కా?" శారద గొంతు వణికింది.

అక్కమాటల్ని ఆమె నమ్మలేకపోతోంది. ఆనందం చేసిన ద్రోహానికి తనేం బాధపడ్డం లేదని తనని నమ్మించడానికి అక్క చేస్తున్న ప్రయత్నాల్లో యిదొకటేమోనని సందేహించింది శారద. తను ఆనందంపట్ల పెంచుకున్న ద్వేషాన్ని వుపసంహరించుకుని అతణ్ణి వివాహం చేసుకుంటానని అక్క భావం కావచ్చును. తనకోసమే ఆమె త్యాగం చేస్తుందేమో! అందుకే మావయ్యను రప్పించి; ఆయనచేత అలా చెప్పించిందేమో! శారదకి యేమీ అర్థంకాలేదు. ఇందులోని నిజానిజాలు; యేమిటో వూహించుకోలేక; సతమతమౌతోంది.

చెల్లెలు; చకితమై; ఆ ప్రశ్న వేసిందంటే; వింతగా తోచలేదు అరుణకి. తను యీ విషయాన్ని చెల్లెలితో చెప్పలేదింతవరకూ మరి!

"నిజం చెల్లీ ! మావయ్య నన్ను పిచ్చిగా ప్రేమిస్తున్నాడు."

"నా మనస్సు మార్చాలని, నువ్విలా మారిపోయావేమోనక్కా!" అరమోడ్పుగా చూస్తూ, అంది శారద.

"అంటే, ఏమిటి నీ అభిప్రాయం శారదా?"

"ఏముంది? నువ్విలా మారి, మావయ్యను వివాహం చేసుకుంటే, ఆనందం మేష్టార్ని మళ్ళీ నేను యథాతథంగా ప్రేమించి, ద్వేషాన్ని ఓ మూలకునెట్టి, వివాహానికి అంగీకరిస్తానని కదూ, నువ్వు అభిప్రాయపడుతున్నావు? అంటే, యీ విధంగా నువ్వు నాకోసం త్యాగం చేస్తున్నావన్న మాట... నిజం చెప్పక్కా!"

చెల్లెలికి, ఆ సందేహం కలగడంలో తప్పు లేదనుకుంది అరుణ. ఎందుకూ అంటే, పరిస్థితులు అలా యేర్పడ్డాయి. శారదకి ఆనందంపట్ల ద్వేషం ఏర్పడ్డం, తత్ఫలితంగా మావయ్యకి తన అనురాగాన్ని వ్యక్తం చెయ్యడం, అతను తన అసహాయతను తెలియజేయడం, అన్ని యాదృచ్ఛికంగా జరిగినా, శారదకి నమ్మకం కలగడం లేదంటే, ఆశ్చర్యపడ్డం లేదు.

"నువ్వు చాలా పొరబడుతున్నావు చెల్లీ! నీకోసం త్యాగం చెయ్యడానికి, నాకు అర్హతవుంది, అక్కనుగాబట్టి. కాని, ప్రస్తుత పరిస్థితుల్లో నేనేం త్యాగం చెయ్యడం లేదు. యాదృచ్ఛికంగా జరుగుతున్న సంఘటనలే!"

"అలా అయితే, మావయ్యకు నేను ఉత్తరం రాస్తా

నన్నప్పుడు, ఈ విషయం యెందుకు దాచావక్కా?" ఏడుపు స్వరంతో అంది శారద.

"అలా అడిగావు, బావుంది శారదా! ఈ విషయాన్ని నీతో అంతకుముందు చెప్పకపోవడం పొరపాటే! అప్పటికీ, నేనేం నిర్ణయించుకోలేదు గాబట్టి, చెప్పడానికి సాహసించ లేకపోయాను. నువ్వు మావయ్యకి ఉత్తరం రాస్తున్నరోజు కూడా ఒక నిశ్చితాభిప్రాయానికి రాలేకపోయాను. నీ ఉత్తరం చూశాక, మావయ్య యేం చేస్తాడో, చూడాలనిపించి, నీతో చెప్పలేదు. ఒకవేళ మావయ్య, యేదో బలహీనతకు లొంగిపోయి, నిన్ను వివాహం చేసుకుందుకు సిద్ధపడితే, నేను ముందుగా చెప్పడంవల్ల, నీ ఆశల్ని త్రుంచిన దాన్నవు తానుగా! ఇంతేగాని, మరే కారణం కాదు చెల్లీ!"

అక్క మాటలు, శారదకి కాస్తంత నమ్మకాన్ని కలుగ జేసినా, హృదయాంతరాళాల్లో ఎక్కడో సందేహం లేకపో లేదు. ఆమె మెదడులో రైళ్ళు పరుగెడుతున్నాయి. అక్క తనకోసం, ఆమె సుఖాన్ని త్యాగం చేస్తుందేమోనన్న అను మానం తీరలేదింకా.

"ఏమిటో అక్కా! అంతా అయోమయంగా వుంది. ఏడుపొస్తుంది కూడా! మావయ్యే నా కోరికను అంగీకరించితే యీ సమస్యలే నాకు వుండకపోను. అతనిలా మారిపోతా డని నేననుకోలేదు" నిరుత్సాహం వ్యక్తపడుతున్నట్టుగా అంది శారద.

చెల్లెలు, యింకా తన మాటల్ని నమ్మలేకపోతున్నం దుకు, బాధపడింది అరుణ. మావయ్యను, తనే మార్చేశా

నన్న సందేహం శారదలో వుందేమోననిపించింది. ఇంక తను ఉపేక్షించకూడదను. చెల్లెలికి నిజం తెలియాలంటే, తన మీద నమ్మకం యేర్పడాలంటే, ఒకే ఒక్క మార్గం కనిపించింది. మావయ్య రాసిన వుత్తరాలు, ఆమెముందు పడేయాలి. వాటి అవసరం వస్తుందనే వుద్దేశంతోనే వుత్తరాల్ని తనతో తీసుకొచ్చింది. అవి చదువుకున్నాకయినా, మావయ్య తనని మనసారా ప్రేమిస్తున్నాడని, అతణ్ణి తనేమీ మార్చ లేదనీ, ఆమె కోసం ప్రత్యేకంగా తనేం త్యాగం చెయ్యలేదని, నమ్మకముం దేమోనన్న విశ్వాసం యేర్పడింది.

"శారదా! ఒకే రక్తాన్ని పంచుకున్న అక్క చెల్లెళ్ళం మనం. నా మనస్తత్వం నీకు చిన్నప్పట్నుంచీ తెలుసు. అయినా సరే నామాటలమీద నీకు నమ్మకం కుదరలేదంటే, ఏడు పొస్తుంది..." అంది అరుణ బాధగా.

శారద చప్పున అందుకుంది.

"అదేం కాదక్కా..." అని యింకా యేమో చెప్ప బోతూ వుంటే, ఆమెకి ఆ అవకాశం కలిగించకుండా మధ్యలో కలుగజేసుకుంది అరుణ.

"సరేలే శారద! నీ లేతహృదయాన్ని నొప్పించడం, నాకే బాధగా వుంటుంది. మావయ్య నన్ను నిజంగా ప్రేమి స్తున్నాడో లేదో, అతని దృఢసంకల్పం యేమిటో నువ్వు తెలుసుకోవడం అవసరం ... అయితే, యీ ఉత్తరాలు చదువు. వీటి అవసరం వుంటుందనే తీసుకొచ్చాను" అంటూ జాకెట్టులో అంతవరకూ దాచిపెట్టిన వుత్తరాల్ని తీసి, చెల్లెలికి అందించి అరుణ,

ఉత్తరాలు తీసుకుంటూంటే శారద చేయి వణికింది. ఎందుకులే అక్కా చదవడం? అందామనుకుంది కాని, మనస్సు ఊరుకోలేదు. ఆ వుత్తరాల్లో యేముందో, చూడాలన్న ఆసక్తి పెరిగింది. ఉత్తరాల్ని చదవడం ప్రారంభించింది శారద. అరుణ, ఆమె కేసి తదేకంగా చూస్తోంది. ఆమె మొహంలో ఎటువంటి మార్పులు వస్తున్నాయో తెలుసుకోవాలని ప్రయత్నిస్తోంది.

అదో విచిత్రమైన వాతావరణం. తన నిర్దోషిత్వాన్ని తెలియజేసుకోవాలని ఆరాటపడే నిందితురాలిలా ఆసక్తితో చెల్లెలి మొహంలోకి చూస్తోంది అరుణ. అక్కగా, తను చెల్లెలికి యేవిధమైన మనస్తాపమూ కలుగజెయ్యకూడదని, ఆమె అభిప్రాయం. ఆ వుత్తరాలు చదివాకయినా, చెల్లెలిలో తను ఆశించిన మార్పు వస్తుందో రాదో నన్న ఆరాటం ఆమెను కలవరపరుస్తోంది.

శారద, ఉత్తరాలు చదవడం ముగించి, భారంగ ఓ నిశ్వాసం విడిచింది. ఉత్తరాల్ని అక్కకు అందించింది.

“ఇప్పటికైనా నా మాటల్లోని నిజాన్ని నమ్ముతున్నావా చెల్లీ?” అంది అరుణ.

“నిన్ను నమ్మడం లేదని నే నెప్పుడయినా అన్నానా అక్కా? పరిస్థితులు నాకు ప్రతికూలంగా మారాయి. అది నా దురదృష్టం. ఎవర్నీ నేను నిందించను.”

“ఈ నిస్పృహను పెంచుకోవడం, నీ తెలివితక్కువ తన మంటాను శారదా! లేకపోతే యేమిటెదంటాను? నన్ను ఆనందం వంచన చేశాడని అపోహపడి, అతనిపై ద్వేషాన్ని

పెంచుకుని, అతణ్ణి హింసకు, మనోవ్యథకు గురి చేసి, నువ్వా అర్థంలేని ఆవేదనను లోనవ్వడంలో అర్థమేముందని? ఆ ఆవేదన వుండాల్సింది నాకు. కాని, నేను బాధపడలేదే! జరిగే ప్రతి సంఘటనకూ మనమేం బాధ్యులం కామేమోనన్పిస్తుంది అప్పుడప్పుడు; అందుకే, నేను బాధపడలేదు. మావఁయ్యజీవితంలో ప్రవేశిస్తే, అతని అభ్యర్థనా నిలబెట్టినట్టూ వుంటుంది...మారిన మనిషిలో మళ్ళీ పతనావస్థ రాకుండా చూసినట్టూ వుంటుందన్న తృప్తి యేర్పడుతుంది."

అరుణ, యిలా యేవేవో చెప్తున్నా, వాటిగురించి ఆలోచించే ఓపిక లేక పోయింది శారదకి.

"అయితే మావఁయ్యను వివాహం చేసుకుందుకు, యిప్పుడు నిర్ణయించుకున్నావా అక్కా-?"

"ఔను చెల్లీ! ఇప్పుడా నిర్ణయానికి వచ్చాను. పరిస్థితులు అందుకు దోహదం చేశాయన్నా, తప్పులేదు. ఆనందం నాకు దూరమయ్యాక, స్వతంత్ర జీవితాన్ని సాగించాలన్న తలంపుతో ఉపాధ్యాయిని వృత్తిని చేపట్టాను. నాజీవితం మోడుబారినదైనా, నిన్నయినా ఒక 'వ్యక్తి'గా రూపొందించాలని, ఒక అంతస్తులో చూడాలనీ కలలుగన్నాను. కాని, నా కలలూ, వూహాలూ, మట్టిపాలై, నాలో బడబాగ్నిని నింపివేశాయి. నా వుద్యోగం పోయాక, ఆ తలంపే మానేశాను. నువ్వు చదువు మానేస్తే, బలవంతం చెయ్యలేక పోయాను. ఇంక నాలో మిగిలిన ఆశలేవిటి చెప్పు? ఒంటరిగా జీవితాన్ని సాగించి, నేనేం సాధించగలను? ఒక విధమైన బలహీనత యేర్పడింది. అదేసమయంలో మావఁయ్య, తన

మనస్సుని వ్యక్తం చేస్తూ, వుత్తరాలు రాశాడు. ఆలోచించాను. నన్ను అంతగా ఆరాధిస్తున్న వ్యక్తిని జారవిడుచుకోవడం, యిష్టం లేకపోయింది. నేను నా అనంగీకారాన్ని తెలిపితే, మళ్ళీ మావయ్య దురలవాట్లకి దాసుడవుతాడేమో నని భయం పుట్టింది. ఇవన్నీ కారణంగా నామానస రథాన్ని మావయ్యకేసి తిప్పాను. ఇప్పుడు నీకు అర్థమయ్యిందనుకుంటాను శారదా! నేనేం పొరపాటు చెయ్యలేదనే నానమ్మకం" ముగించింది అరుణ.

శారద, చప్పున యేమీ మాట్లాడలేకపోయింది. అక్క ఆ నిర్ణయానికి రావడం, సబబుగానే వుందనిపించింది. అయితే తను ఆనందం పట్ల ద్వేషాన్ని పెంచుకోవడం, అన్యాయమా?...ఆమె ఆలోచనలో పడిపోయింది.

అప్పుడే మాధవరావు వచ్చాడు.

"అబ్బ! ఏం యెండలు?" అనుకుంటూ కుర్చీలో కూలబడిపోయాడు.

"కొత్తగా చెబుతున్నావేవిటి మావయ్యా యీ విషయం? అందరికీ తెలిసిందేగా?" నవ్వుతూ అంది అరుణ.

పద్మ వస్తూవుండటం చూసిన శారద, లేచినుంచుని, ఆమెను మందహాసంతో ఆహ్వానించింది.

"చాలా రోజులకి మళ్ళీ కలుసుకున్నామే!" అంది వుత్సాహాన్ని పుంజుకుంటూ శారద.

"ఆ మధ్య నేను వూళ్ళోలేనుగా! నేను వచ్చినప్పట్నుంచీ, నువ్వు కాలేజీకి వస్తేచెప్పావు... మరెలా కలు

స్తాం...?" అంది పద్మ మందస్మితంతో.

"క్షేమమా పద్మా!" అంది అరుణ.

"ఆఁ, క్షేమమేనక్కా!" అంటూ కూచుంది పద్మ.

అక్కడుండటం సబబుగా వుండదనిపించి పక్క గది లోకి పోయి, వాలుకుర్చీలో చేరబడ్డాడు మాధవరావు.

"ఈవేళ కాలేజికి వెళ్ళలేదా?" ప్రశ్నించింది శారద.

"లేదే! మా పిన్నిగారొత్తు రొచ్చింది ఢిల్లీనుంచి... అందుకే, యీ రోజు సెలవు తీసుకున్నాను. సరేగాని, నువ్వు చదువు మానేశావట...ఏం?"

"ఎవరు చెప్పారు మానేశానని...?" యెదురు ప్రశ్న వేసింది శారద.

"స్టూడెంట్సు అనుకుంటుంటే విన్నాను..."

"ఔనమ్మా పద్మా! మానేసింది. దానికి చదువుకోవ డం యిష్టంలేదుట. బలవంతంగా యెవరేం చెప్పగలం చెప్పు?" అంది నిట్టూరుస్తూ అరుణ.

"కారణం యేమిటే శారదా?" మళ్ళీ శారదను వుద్దే శించి ప్రశ్నించింది.

"అబ్బ! కారణం యేమీలేదు. నా కిష్టంలేదు; మానే శాను. అంతే" విసుగ్గా జవాబిచ్చింది.

పద్మకి ఆశ్చర్యమేసింది, శారద విసుగుచూసి. ఏదో వుండి వుంటుందని, అనుమానం వేసింది. అయినా— ఆట్టే విసి గించడం బావుండదేమో నన్పించింది.

"అన్నట్టు, నీ కీ విషయం తెలుసా?"

"ఏమిటది?" ఆస కితో చూసింది శారద.

"ఆనందం మేష్టారు నిన్నను వుదయం కాలేజీకిపోతూ లారీతో ఢీకున్నారట...పాపం, దెబ్బలు తగిలాయట ... స్కూటరు ముందు చక్రం పచ్చడయిందట. గవర్నమెంటు హాస్పిటల్‌లో వేశారుట...ఆ విషయం తెలిశాక, మే మందరమూ యెంతో విచారించాం." అంది. నిజానికి, ఆ విషయం శారదకి తెలియజెయ్యాలన్న అభిప్రాయంతోనే అక్కడికి వచ్చింది పద్మ. ఆనందం మేష్టారుకి శారదంటే,ఎంత అభిమానమో ఆమెకి తెలుసు.

శారద క్షోభించిపోయింది. ఆనందంని ద్వేషిస్తున్న ఆమె హృదయాన్ని, అవార్తా రంపపుకోతకోసింది. చలించిపోయింది. ఏదో భీతి, చెప్పలేని ఆవేదన, ఆమె కళ్ళల్లో అశ్రువుల్ని నింపాయి. అరుణ కూడా అదే అనుభూతిని పొందింది. 'భగవాన్! ఆనందంకి యే అపాయమూ లేకుండా కాపాడు తండ్రీ' అంటూ మనసులో ప్రార్థించుకుంది. చెల్లెలి అంతరాంతరాల్లో జరుగుతున్న సంఘర్షణ, ఆమె అర్థం చేసుకోగలిగింది. అందుకే ఆ ప్రార్థన!

శారద అచేతనంగా వుండిపోయినా; అరుణ ఊరుకోలేకపోయింది.

"ప్రమాదకరమైన దెబ్బలేమైనా తగిలాయా పద్మా?" ఆతృతగా అడిగింది.

అరుణ అంత ఆసక్తిగా అడుగుతున్నందుకు విస్తుపోయింది పద్మ. బహుశా; శారద యింతకు ముందు చెప్పి వుంటుందేమోనని సరిపెట్టుకుంది.

"గాయాలు తగిలాయటగాని; పెద్ద ప్రమాదమేమీ లేదంటున్నారు. ఆ యాక్సిడెంటులో బ్రతికి బైటపడినందుకు; ఆయన అదృష్టవంతుడే అంటున్నా రంతా!"

"పోనీలే! ప్రమాదమేమీ లేకపోతేచాలు..." తృప్తిగా అనేసింది అరుణ.

క్షణం మౌనం.

"మరి నే వస్తానే శారదా! అక్కా! వస్తా మరి..." లేచి వెళ్ళిపోయింది పద్మ.

"ఇప్పుడు నీకు తృప్తిగా వుందా శారదా? నీ హృదయం; ఆనందంతో నిండిపోయిందా?" కోపంగా అడిగింది అరుణ; పద్మ వెళ్ళిపోయిన కొద్ది క్షణాల తర్వాత.

శారద హృదయం, ద్రవించిపోయింది. కళ్ళల్లోగూడు కట్టిన కన్నీరు, ప్రవాహవేగంతో చెక్కిళ్ళమీదికి జాలువారుతోంది. ఏదో అనాలనుకుంటోంది గాని, పెదాలు వణుకుతున్నయ్. మూగ బాధ అనుభవిస్తోంది.

"అకారణంగా అర్థంలేని ద్వేషాన్ని పెంచుకుని, యెవరికోసమో యేదో త్యాగం చేస్తున్నానని భ్రమపడి, ఆనందం హృదయాన్ని గాయపర్చావు చెల్లీ! ఈ ప్రమాదం యెలా జరిగిందంటావు? ఊహించడం, చాలా సులువు. నీ మీద అనురాగాన్ని అంతరింపజేసుకోలేక, అదేపనిగ నీ కోసం పరితపిస్తూ, నీ రూపాన్ని క్షణక్షణం చూస్తూ, మతిలేని వాడిగా తయారయ్యుంటాడు. ఈ ఆలోచనలతో, ఈ ఆవేదనతో స్కూటర్ నడపడం సాధ్యమయ్యే పనేనా? మన

స్నేహితుడో వుంటే, వాళ్లు దగ్గర పెట్టుకోలేకపోయాడు. ప్రమాదం జరక్క యేమవుతుంది? దీనికి కారకురాలవు నువ్వు కాదా? అదృష్టవశాత్తూ, అతనికి ప్రమాదమేమీ జరగలేదు గాని, ఒకవేళ అతను..." అని యింకా చెప్పబోతూ వుంటే, శారద దిగ్గునలేచి 'అక్కా,' అంటూ ఆమె ఒడిలో వాలిపోయింది... "మరింకేం అనొద్దు. తప్పు నాదే! చాలా క్రూరంగా ప్రవర్తించాను... అతనికి నా క్షమాపణ చెప్పుకోవాలి... వెళ్దాం పదక్కా!" అంది శారద రుద్ధ స్వరంతో.

అరుణ హృదయం, ఆనందంతో ఉప్పొంగిపోయింది. జీవితంలో యెప్పుడూ అంత సంతోషంపొందలేదామె. ఆనంద బాష్పాలు కళ్ళల్లో జ్యోతుల్లా మెరుస్తున్నాయి. కళ్ళొత్తుకుంటూ, చెల్లెల్ని కౌగలించుకుంది.

"ఈ క్షణం, నా కెంతో ఆనదంగా వుందమ్మా చెల్లీ! పద, హాస్పటల్ కి వెళ్దాం..." అంటూ ఆమె కళ్ళను తుడిచింది తన చీరచెంగుతో.

పక్క గదిలోంచి అంతా విన్నాడు మాధవరావు. ఇప్పు డర్థమయింది శారద మనస్తత్వం. తను యే బలహీనతకూ లొంగిపోకుండా, దృఢసంకల్పంతో నుంచున్నందుకు గర్వపడ్డాడు. అక్కణ్ణించి ముందు గదిలోకి వస్తూ—

"పదండి అరుణా, నేనూ వస్తాను మీతో" అన్నాడు.

"అంతా విన్నావా మావయ్యా?" అడిగింది అరుణ.

"అర్థం చేసుకున్నాను అరుణా! శారద, ఇంకా పసిపిల్లేగా! ఆవేశం యెక్కువ..." మందహాసంతో అన్నాడు.

"ఇప్పుడు వెడితే, లోపలికి రానిస్తారో లే దో?" అరుణకి సందేహం కలిగింది.

"సాయంత్రమే చూద్దాం..." అన్నాడు మాధవరావు.

శారద అక్కణ్ణించి మెల్లగా జారుకుంది. మాధవరావు, అరుణ కేసి చూసి చిన్నగా నవ్వేడు. అరుణకి సిగ్గు ముంచుకు రాగా మొహం పక్కకి తిప్పుకుని, మందహాసం ఒలికిస్తూ, అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

మాధవరావు తృప్తిగా నిట్టూర్చి కుర్చీలో కూలబడి పోయాడు. 'ఈ గదిలో యెంత చల్లగా వుంది!' అనుకున్నాడు.

# 20

ఆనందం యే వార్డులో వుంటున్నాడో తెలీదు వాళ్ళకి. హాల్లోనుండి అప్పుడే హడావుడిగా వెళ్ళిపోతున్న నర్సుని కేకేసి, మాధవరావు అడిగాడు.

"ఆనందంగారని, కాలేజీ లెక్చరర్ — ఆయన నిన్న ఉదయమే యాక్సిడెంటులో యిరుక్కుని, హాస్పటల్లో చేర్చబడ్డారట. ఎక్కడ వుంటున్నాడో, మీరేమైనా ఇన్ఫర్మేషన్ యివ్వగలరాండీ?"

ఆ నర్సు మాధవరావు కేసి ఆసక్తిగా చూళ్ళేదుగాని. అతని పక్కనే వున్న అరుణ, శారదల కేసి మాత్రం అదోలా చూసింది.

"స్కూటర్, లారీ యాక్సిడెంటేనా?" అందా నర్సు.

"ఔనండీ!" శారద అందుకుంది,

నర్సుకి అర్థమైపోయింది, బహుశా ఆమె అతని భార్య అయ్యుంటుందని.

"ఇదిగోండి... ఇలా యీ పక్కకు తిరిగి తిన్నగా యిరవయ్యో 'బెడ్' దగ్గరికి వెళ్ళండి. అదృష్టం బావుండి, కాళ్ళూ, చేతులూ విరగలేదుగాని, యాక్సిడెంటు మాత్రం పెద్దదేనట. అయినా, అంత పరధ్యాన మేమిటండీ? కాస్త మీరైనా చెప్పండి జాగ్రత్తగా డ్రైవ్ చేస్తుండమని..." శారదకేసి చూస్తూ చెప్పి, ముందుకు సాగిపోయింది.

నర్సులకూడా మన స్తత్వ శాస్త్రం, క్షుణ్ణంగా తెలిసుంటుందేమోననుకుంది అరుణ. లేకుంటే, శారదను ఉద్దేశించే యెందుకు చెబుతుంది?

"యాక్సిడెంటులో యిరుక్కుంటే, తలోక విమర్శ విసిరినవాళ్ళే! అందరికీ లోకువై పోతాడా వ్యక్తి!" నవ్వుతూ అనేసి ముందుకుసాగి, ఆమె చెప్పిన చోటుకి దారి తీశాడు మాధవరావు. అతనివెంట నడిచారు అక్కచెల్లెళ్ళిద్దరూ.

"ఇరవయ్యో నవంబరుబెడ్ అదిగో!" అంటూ చూపించాడు మాధవరావు రెండు గజాల దూరంలో.

శారద హృదయం విపరీతంగా కొట్టుకుంటోంది. కాళ్ళు, తడబడ్డాయి.

"అక్కా! ఎందుకో భయమేస్తుందే!" మెల్లగా గొణిగింది.

"మరేం భయంలేదు. మనల్ని చూసి, ఆనందం యెంతో మురిసిపోతాడు చూడు..." మెల్లగామందలించింది అరుణ.

ఆనందం దగ్గరికి వచ్చేశారు. మాధవరావు ముందు

వెళ్ళాడు గాబట్టి, అత నెవరో తెలియని కారణాన అదోలా చూశాడు ఆనందం.

"ఎలా వుంది ఆనందం ?" అరుణ ప్రశ్న వినేసరికి, ప్రాణం లేచివచ్చి నట్టయింది ఆనందంకి. అతని కళ్లు శారద కోసం వెదికాయి. అరుణ ప్రక్కనే మొహం దించుకుని నుంచున్న శారదను చూశాడు. గాయాలవల్ల కలిగిన బాధంతా, పటాపంచలై నట్టయింది.

"దెబ్బలు బాగా తగిలాయి అరుణా!" బాధవల్ల గామోసు, మాటలు పట్టి పట్టి మాట్లాడుతున్నాడు.

"మాకు కబురైనా పంపలేదేం?" అంటూ అతణ్ణి ఆపాదమస్తకం పరికించింది. శారద కళ్ళు కూడా అదేపని చేశాయి. తలకి, చేతులకి, కుడికాలుకీ కట్లున్నాయి.

"ఎవరికో కబురుపంపించను అరుణా? నా కెవరున్నా రని?" అతని స్వరం బొంగురుపోయింది.

"ఈవేళ తెలిసింది, పద్మద్వారా! అయినా; యింత పరధ్యాన్నంగా స్కూటరు పోనివ్వడ మేమిటి చెప్పు?" అంది అరుణ; ఏదో అధికారం వున్నదానిలా మెల్లగా మందలిస్తూ.

"ఆ ప్రశ్న వెయ్యకు అరుణా! ఇదిలా జరగాలనుంది... జరిగిందంతే! అన్నట్టు వీరెవరు?" మాధవరావు కేసి దృష్టి నిలుపుతూ అన్నాడు ఆనందం.

"మా మావయ్య! నేను ఈయన్ని వివాహం చేసుకో బోతున్నాను" అంది అరుణ, ఆ కాస్త రహస్యం యెందుకు దాచిపెట్టడమూ అని. అది ఆనందం తెలుసుకోవాలనే మరీ చెప్పింది, సగర్వంగా. మాధవరావు మొహం వికసించింది.

"చాలా అదృష్టవంతులండీ మీరు..." అన్నాడు

మాధవరావుని వుద్దేశిస్తూ.

"ఆ మాట నిజమండీ!" ముసి ముసి నవ్వుల్తో జవాబిచ్చాడు మాధవరావు.

క్షణం, మౌనం వారిమధ్య రాజ్యమేలింది.

"శారదా! ఇంకా, నా మీద ద్వేషం పోలేదా?" మెల్లగా అన్నాడు.

శారద జవాబివ్వలేదు. ఆమె కన్నుల్లో నీరు నిండింది. అరుణకి పరిస్థితి అర్థమయ్యింది. అసలే బిడియపడుతూ, బితుకు బితుకు మంటూ వచ్చిన చెల్లెలు, తమ సమక్షంలో మాట్లాడ లేదుకూడా.

"మావయ్యా, అలా మనం బైటికి వెళ్ళి వద్దాం రా! ఆనందం; మీరు మాట్లాడుతూ వుండండి; మళ్ళీ వస్తాం..." అంటూ బైటికి నడిచింది మాధవరావుతోపాటు.

"రా శారదా! ఇలా కూచో..."అన్నాడు ఆనందం. అతనికి తెలుసు, శారద మారిందని— తనమీద ద్వేషం, కోపం; ఆమెలో అంతరించాయని! లేకుంటే, యిప్పుడిలా తనని చూడ్డానికి రాదు... అందుకే చనువుగా కూచో మన్నాడు.

శారద మెల్లగా నడిచి, మంచంమీద అంచున కూచుంది. ఆనందం పక్కనే అలా కూచోవడం ఆమెలో కొత్త అనుభూతిని కలిగించింది.

"శారదా, నే నడిగిన ప్రశ్నకు జవాబు చెప్పావు కాదేం? ఇంకా నామీద కోపముందా?" అన్నాడు మెల్లగా నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"అలా అనకండీ! మిమ్మల్ని అన్యాయంగా ఆ వేదనకు

గురిచేశాను. అందుకు, క్షమాపణ కోరుకుంటున్నాను..."
అంది హీనస్వరంలో.

ఆనందం హృదయం, దూదిపింజలా తేలికపడి; ఆకాశానికి యెగిరింది. శారద; తనని యిప్పటికైనా అర్థం చేసుకుంది...అది చాలనుకొని మురిసిపోయాడు.

"అబ్బే! అలా క్షమాపణ కోరకూడదు... మనలో మనకి; క్షమాపణ లేకుండా చెప్పు...నువ్వు నన్నర్థం చేసుకున్నావు. అంతే చాలు" అన్నాడు ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

"అంతా చూస్తున్నారండీ"సిగ్గుతో కుంచించుకుపోయి చేతిని వెనక్కి తీసుకుంది శారద.

ఆనందం నవ్వుకున్నాడు.

"ఇంతవరకూ ఈ గాయాల బాధ; నన్ను నమిలేస్తుండేది. ఇప్పుడు ఆ బాధే తెలీటంలేదు...యెందుకో తెలుసా? నా అమృతమూర్తి స్పర్శ తగిలింది గబట్టి..."

శారద; మొహం పక్కకి తిప్పుకుంది.

"చాలెండి ఈ వర్ణనలు... నాలోని ఈ మార్పుకి కారకు లెవరో తెలుసా?"

"నువ్వు చెప్పకుండా యెలా తెలుస్తుంది?"

"మా అక్క! నిజానికి మిమ్మల్ని ద్వేషించాల్సింది ఆమె! అయినా; అటువంటి భావనే లేకుండా, మిమ్మల్ని అర్థం జేసుకుంది. నాలో చెలరేగిన అర్థరహితమైన ద్వేషాన్ని పటాపంచలు చేసింది. నిజానికి మా అక్క అమృత మూర్తి."
ఆనందం, శారద మాటలు విన్నాక, ఓ నిట్టూర్పు విడిచాడు.

"ఔను శారదా! అరుణ అమృతమూర్తే! ఆమెకి మన

మెంతో ఋణపడి వున్నాం..." అన్నాడు.

"ఔను మేష్టారూ!" అంది ముక్తసరిగ.

అంతలోనే అరుణ,మాధవరావు అక్కడికి వచ్చేశా
వాళ్లు రావడంతోనే తృళ్ళిపడి, లేచి నుంచుంది శార
అరుణ లోలోన నవ్వుకుంది.

"ఆనందం, మరి మేం వెళ్లొస్తాం..." అంది అరు
దగ్గరగావచ్చి.

"మంచిది అరుణా! ఈ విశాల విశ్వంలో 'నా' అన
వాళ్ళెవరూ లేక పోయిన లోటు తీరింది. ఈ సమస్య; ఇల
పరిష్కారమవుతుందని, నేనెప్పుడూ అనుకోలేదు. ఇప్పుడు
నేనెంతో అదృష్టవంతుడిగా భావిస్తున్నాను" కృతజ్ఞతా భావ
వుట్టిపడుతూ వుంటే, అన్నాడు ఆనందం.

"ఎవరిమట్టుకు వాళ్ళే అలా అనుకుంటూ వుంటాం
దానికేంలే! పద శారదా!"

"వస్తాను మేష్టారూ!"

"మంచిది శారదా! అప్పుడప్పుడూ కనిపిస్తూ వుండండి.
ఎవరూ లేని నాకు మీరైనా వస్తుంటే; వేయి యేనుగుల
బలం వచ్చినట్టుగా వుంటుంది."

"అలాగే ఆనందం..." మాటిచ్చింది అరుణ.

ఆనందం కళ్ళు, ఆనంద బాష్పాలతో నిండాయి.
మాధవరావు కూడా అతనికి చెప్పేస్తూ బయలుదేరాడు.

వాళ్లు ముగ్గురూ అలంత దూరం వెళ్ళాక; ఆనందం
తేలిక పడిన హృదయంతో ఓ నిశ్వాసం వదిలాడు.

'భగవాన్! నువ్వు యెంతో దయామయుడివి తండ్రీ'
అనుకున్నాడు మనస్సులో. *